


సైతం ఆ కోవలోకే వస్తుంది.

'వినోదిని' కూపన్లకు సంబంధించి, విజేతల సంఖ్యను పెంచితే బాగుంటుంది.

**– ఎన్.వి. రమణి,** హైదరాబాద్

★ కార్డుకథలన్నీ బాగున్నాయి. ముఖ్యంగా ఆనాటి రాత్రి, సున్నావిలువ కథలు ఆకట్టు న్నాయి. కథకుల ఫైల్ లో భాగంగా మీరందిం చిన 'గన్నేరు' చాలా బాగుంది. కార్టూన్లన్నీ నవ్వులపూలు పూయించాయి.

**– జె.ఎస్.** విజయవాడ

★ ముషాయిరాలో ఆశాలతగారి 'చెట్టు నేర్పిన సత్యాలు' మమ్మల్ని ఆకట్టుకుంది. తెలుగుకథలన్నీ బాగా చదివించాయి. భారతీయభాషల్లో పావులీటరు పాలు (బెంగాలీ) ప్రపంచ భాషల్లో చెట్టు (బల్గేరియన్) కథలు ఆసక్తికరంగా ఉన్నాయి. పి. సాంబశివరావు 'పరామర్శ' విశ్లేషణాత్మకంగా ఉంది. కార్డు కథలు ఎంతాగానో అలరించాయి.

**– వై.మణికుమార్,** సికింద్రాబాద్

★ నవంబరు నెల విపుల పెద్దలు చదవాల్సిన పిల్లల కథలతో ప్రత్యేక సంచికగా ఇవ్వడం ఎంతో సందర్భోచితంగా ఉంది. నిజంగా ఈ సంచికలోని కథలన్నీ పెద్దలు తప్పకుండా చదవటమే కాకుండా పిల్లలకు కూడా చెప్పాల్సివిగా ఉన్నాయి. ముషాయిరా కవితలు ఎంతో నచ్చాయి. కార్టున్లు నవ్వుల విందు చేశాయి.

**– శ్రీరాం,** పెన్నాడ

★ కార్టూన్లు, జోకులు అలరించాయి. 'నవ్వుల విందు'లు పేరుకు తగినట్లే పసందైన విందులు అందించాయి. అనువాద కథలు ఆసాంతం రక్తికట్టాయి. ప్రధానంగా బెంగాలీ కథ 'పావులీటరు పాలు' చదివినంతసేపూ ఆసక్తి రేకెత్తించింది. కార్డు కథల్లో 'కథకాని కార్డు కథ', 'రుద్రభూమి' బాగా నచ్చాయి. ఆయా రచయితలకు అభినందనలు.

**– మారుతీ కిశోర్,** విశాఖపట్నం

★ 'పెద్దలు చదవాల్సిన పిల్లల కథల'ంటూ విభిన్న జీవన దృశ్యాలను ఆవిష్కరించిన తీరు బాగుంది. అనువాద కథల్లో గుజరాతీ కథ 'ఈసారి', రష్యన్ కథ 'అన్నాచెల్లెళ్లు' నచ్చాయి.

**– మురుగన్,** హైదరాబాద్

★ పెద్దలు చదవాల్సిన పిల్లల కథల సంచికగా వచ్చిన నవంబరు విపుల మమ్మల్నెంతో అలరించింది. ఇందులోని కథలన్నీ బాగా చదివించాయి. ముఖ్యంగా అభిమాన రచయిత మల్లాదిగారి 'మనుషులతో సంబంధం' నాకు నచ్చింది. ఇంకా టాల్‌స్టాయ్ కథ అన్నాచెల్లెళ్లు కంట తడి పెట్టించింది. వ్యభిచరించే స్త్రీల వెనుక దీనగాథను విప్పిచెప్పింది. మహిళలతో అసభ్యంగా ప్రవర్తించేవారికి చెర్నాకోలుతో కొట్టినట్లనిపిస్తుంది. ముషాయిరా, కార్టూన్లు, కార్డుకథలు అన్నీ చాలా బాగా ఆకట్టుకుంటున్నాయి.

**– రమాదేవి,** ఒంగోలు

★ ప్రత్యేక సంచిక మొత్తం మీద మమ్మల్ని బాగా అలరించిన కథ జగడ (తమిళం). అలాగే 'భగవంతుడి అన్న' హిందీ కథ కూడా. తెలుగు కథల్లో ఈమని రమగారి 'పరివర్తన', జోసెఫ్‌గారి కథ 'కడిగిన ముత్యం' స్పందింపజేశాయి. 'నేటి మహిళ' శీర్షికన వచ్చిన కార్డుకథ వర్తమాన స్థితిగతుల్ని మా కళ్లముందు నిలిపింది. కవితల్లో 'శిథిల శిల్పం' నచ్చింది.

**– లీల,** చిలకలూరిపేట



మీ అభిప్రాయాల్ని e-mail : vipula.chatura@gmail.com కు మెయిల్ చేయవచ్చు.

# తెలుగు కథను బతికించండి

ప్రపంచంలో చిన్న కథానికలు ఎలాంటి పోకడలు పోతున్నాయి? మనదేశంలో వివిధ భాషల్లో ఎలాంటి కథలు వస్తున్నాయి? రచయితలు ఎలాంటి కథావస్తువులను ఎన్నుకుంటున్నారు? కథనం ఎలా ఉంటోంది? ఎవరి శైలి ఎలా ఉంటోంది? ప్రధానంగా మన తెలుగు కథ ఎలా సాగుతోంది? పరిశీలించడానికి 'విపుల' మాసపత్రిక ఎంతో దోహదపడుతోంది. అందుకే మొత్తం పత్రికా ప్రపంచంలోనే 'విపుల'ది విశిష్టస్థానమని చెప్పక తప్పదు.

'బుల్లితెర' ప్రభావం పెరిగాక పఠనాసక్తి తగ్గుతోంది. పాఠకుల ప్రోత్సాహం లేకపోతే కథారచయితలు క్రమంగా తగ్గిపోతారు. ఇలాంటి పరిస్థితుల్ని ఎప్పటికీ రానివ్వకూడదు. అందుకే ఒక సూచన చేయాలనిపిస్తోంది. సాధ్యాసాధ్యాలు పరిశీలించగలరు.

ఏడాదిలో పదకొండునెలలపాటు 'విపుల'ను విశ్వకథావేదికగానే నడపాలి. పన్నెండోనెల మాత్రం అచ్చంగా తెలుగు కథలకే కేటాయించాలి. ఈ సంచికకోసం మంచి పారితోషికాన్ని ప్రకటించి విస్తృతస్థాయిలో పోటీలు నిర్వహించి అత్యుత్తమ కథలను ఎంపిక చేయాలి. ఇది ఒక్క 'ఈనాడు' సంస్థకే సాధ్యమని నా నిశ్చితాభిప్రాయం. దీనివల్ల తెలుగు కథ బతికి బట్టకడుతుంది. అవసరమైతే సంచిక వెలను పెంచుకోవచ్చు. సంచిక మాత్రం కథాప్రియులు, గ్రంథాలయాలు పదికాలాలపాటు పదిలపరచుకునేలా ఉండాలి.

విశ్వకథావేదిక- విపుల లక్ష్యానికిది అడ్డంకిగా తోస్తే పోనీ పన్నెండో నెల 'విపుల'తో పాటు ఓ తెలుగు కథల ప్రత్యేక సంచికనూ అదనంగా ప్రచురించండి. కావాలనుకున్నవారు కొంటారు. తెలుగు భాషకు, ముఖ్యంగా ప్రధానంగా యువతలో పఠనాసక్తిని పెంపొందించడానికి ఇదెంతో దోహదపడుతుంది.

బెంగాల్‌లో 'పూజా స్పెషల్స్' పేరుతో, తమిళనాడులో 'దీపావళి స్పెషల్స్' పేరుతో ప్రత్యేక సంచికలు ప్రచురిస్తున్నారు. వీటిలోని కథలు అనేకం నాటకాలుగా, సినిమాలుగా వస్తున్నాయి. ఇంతకంటే ఆ సంచికల వైశిష్ట్యానికి తార్కాణమేముంటుంది? మన ప్రత్యేక సంచికలు ఆ స్థాయిని అతిక్రమించాలని నా ఆకాంక్ష.

**–పి. సాంబశివరావు,**
సినీదర్శకులు, హైదరాబాద్

---

★ 'విపుల' నవంబరు సంచిక ఏకబిగిన చదివించింది. కథలన్నీ సహజ ఇతివృత్తాలతో, హృదయాన్ని హత్తుకునేలా వున్నాయి. మనుషులతో సంబంధం (ఆఫ్రో-అమెరికన్), ఎవరికి దొరికితే వారిది (ఇద్దిష్), తెలుగుకథ 'పరివర్తన' చాలా బాగున్నాయి. ఈసారి కార్డు కథలన్నీ నూటికి నూరు శాతం అలరించాయి. ప్రత్యేకించి రష్యన్ కథ 'అన్నాచెల్లెళ్ళు' మనసును ఎంతగానో కదిలించింది.

**– నియాజ్ అలీ,** హైదరాబాద్

★ ముఖ్యంగా పోలెండ్ కథ 'సంగీతకారుడు' నచ్చింది. శారీరకంగా బలహీనత ఉన్నా, సంగీతాన్నే ప్రాణప్రదంగా మలుచుకున్న బాలుడు జాన్ స్థితి గుండెని పిండేసింది. 'డ్రాయింగ్' ఒరియా కథలోనూ విద్యార్థి పాత్ర చిత్రీకరణ హృద్యంగా ఉంది. పిల్లలతో ఉపాధ్యాయులు సున్నితంగా ఉండాల్సిన అవసరాన్ని చాటిందీ కథ. తెలుగు కథ 'వడగళ్ల వాన' కూడా ఆకట్టుకుంది. కార్డు కథలు ఆసక్తికరంగా ఉన్నాయి.

ఒక సూచన: పాఠకుల లేఖల్లో ఉత్తమమైనవాటిని ఎంపికచేసి ప్రచురిస్తే, వారికెంతో ప్రోత్సాహకరంగా ఉంటుంది.

**– కోట శ్రీదేవి,** శృంగవరపు కోట

★ ప్రత్యేక సంచికను చక్కగా తీర్చిదిద్దారు. 'పెద్దలు చదవాల్సిన పిల్లల కథలు' అనడం ఉత్సుకత రేకెత్తించేలా ఉంది. శ్రీగంగగారి తెలుగు కథ 'వడగళ్ళ వాన' తరాల అంతరాల్ని వెల్లడించింది. మరో కథ 'స్వాతి ముత్యాలు' ఆసాంతం చదివింపజేసింది. అనువాద కథల్లో 'రాజీ' వాస్తవ స్థితిగతులకు అద్దంపట్టింది. 'భగవంతుడి అన్న' శైలి ప్రశంసనీయం. 'అన్నాచెల్లెళ్ళు' కథ ఊహించని మలుపులతో సాగింది. 'కాళ్ళ పట్టీలు' కథ

# జవాబులేని ప్రశ్న



'ఏమండీ మీరు టీచరా?' అడిగాడు ఎదురింటి ఎల్లయ్య.




"అవును, రోజూ మీరు ట్యూషన్‌కు వచ్చే పిల్లల్ని చూస్తున్నారుగా"

"ఏ స్కూల్లో చేస్తున్నారు? అక్కడ చదువు బాగా చెప్తారా? మా బాబును చేరుద్దామని అడుగుతున్నాను" అన్నాడు ఎల్లయ్య.

"మహాత్మాగాంధీ ఇంగ్లీషు మీడియం గవర్నమెంటు హైస్కూల్లో చేస్తున్నా. మా స్కూల్లో అన్ని సబ్జెక్టులు బాగా చెప్పే టీచర్స్ వున్నారు. ఆటలు, పాటలు మంచిగా నేర్పటానికి పి.ఇ.టి., మ్యూజిక్ టీచర్లు వున్నారు. మీ బాబును నిస్సంకోచంగా మా స్కూల్లో చేర్చవచ్చు" అన్నాను నేను.

"మీ బాబు మీ స్కూల్లో చదువుతున్నాడా?" అడిగాడు ఎల్లయ్య.

"లేదు. సెయింట్ మేరీస్‌లో చదువుతున్నాడు"

"మీ స్కూల్లో చదువు బాగుంటే, మీ బాబును ఎందుకు చేర్పించలేదు?" అడిగాడు ఎల్లయ్య.

ఆ ప్రశ్నకు నా దగ్గర జవాబు లేదు. నేను మౌనంగా ఉండిపోయాను.

– **పోలిశెట్టి ఓబయ్య**
యల్లారెడ్డిగూడ, హైదరాబాద్

# వైరానికి కారణం



నేనా ఆఫీసులో కొత్తగా చేరాను. ఓ పదిహేను రోజుల య్యాక తెల్సిందేమిటంటే.. రామా రావుకి రాఘవరావుకి క్షణం పడదు. ఒకరు ఉప్పు అయితే మరొకరు నిప్పు. ఆఫీసు మొత్తాన్ని రెండు పార్టీలుగా డివైడ్ చేసేశారు. నాకు అపరాధ పరిశోధన అంటే చాలా ఇష్టం. డిటెక్టివ్ పుస్త కాలు పుంఖానుపుంఖాలుగా చదివివుండడం చేత ఏదైనా ఇన్వెస్టిగేట్ చేయాలంటే తెగ కుతూహలం. అందుచేత వాళ్ళిద్దరి మధ్య భేదా భిప్రాయాలు ఎందుకొచ్చాయో తెల్సుకుందామని ఎంతో ట్రై చేశా. ఎవర్నడిగినా తెలియదన్నారు. ఇహ లాభంలేదని దీన్నో ప్రాజెక్ట్‌లా తీసుకుని ప్రొసీడ్ అయ్యాను.

వన్ మంత్ డే అండ్ నైట్ పిచ్చ హార్డ్‌వర్క్ చేశాను. వాళ్ళిద్దరూ ఇంతకుముందు పనిచేసిన కంపెనీలు.. నివసిం చిన ప్రదేశాలకి వెళ్ళి ఎంక్వైరీ చేశాను. చివరా ఖరికి అసలు విషయం తెలిసి నోరెళ్ళబెట్టడం నావంతయింది. అసలు వాళ్ళిద్దరి మధ్య వైరానికి కారణమేమిటనగా..

వాళ్ళిద్దరూ చిన్నప్పట్నించి స్నేహితులు. యువకులయ్యాక రామారావు ఒక అమ్మాయిని ప్రేమించాడు. వాళ్ళని సినిమా కష్టాలు చుట్టుముట్టాయి. అయితే రాఘవరావు దగ్గరుండి ఎంతో సహాయం చేసి వాళ్ళ పెళ్ళి చేసి దగ్గరచేశాడు. అదిగో అదే కారణం. ఆరోజు అలా రాఘవరావు పెళ్ళి చేయకుండా వుండివుంటే ఎంతో సుఖంగా వుండి వుండేవాడినని రామారావు కారాలు మిరి యాలు నూరుతున్నాడు. దానికి ప్రతిగా రాఘ వరావు కూడా మధ్యాహ్న మార్తాండుడిలా భగ్గుమంటున్నాడు.

– ప్రతాప వెంకట సుబ్బారాయుడు
సైనిక్‌పురి, సికింద్రాబాద్




# ఇచ్చితి పో!



భీమిలి బీచ్ ఒడ్డున నడుస్తుంటే రాందా స్‌కు ఇసుకలో సగం బయటికి కనిపిస్తూ ఒక దీపం కనిపిం చింది. 'అల్లాఉద్దీన్ అద్భుత దీపం' గుర్తొచ్చింది. ఏమో.. ఎందులో ఏముందో..అనుకుం టూ మట్టి పట్టినట్లున్న ఆ దీపాన్ని జేబురుమాలు తీసి రుద్దాడు, బంగారమో, వెండో తెలుసుకుందామని. గాలిలో ఓ మాంత్రికుడి రూపం ప్రత్యక్ష మైంది. వికటాట్టహాసం.. రాందాస్ ఆశ్చర్యపోయాడు. తర్వాత ఆలోచించసాగాడు. చిరాకు తెప్పించే తన బ్యాంక్ జాబ్‌కు రిజైన్ చేసి పారే యొచ్చు అనుకున్నాడు కూడా.

"నాకు తెలుసు.. నీకు మూడు కోరికలు న్నాయి. అయితే ఒకటి గుర్తుంచుకో. నువ్వు కోరిన ఒక్కో కోరికకూ నీ అర్ధాంగికి రెండిం తలు ఫలితం అందుతుంది"

రెండడుగులు ముందుకెళ్లిన రాందాసు తక్కున ఆగిపోయాడు. "నాకు కోకాపేటలో కోటిరూపాయల బంగళా కావాలి"

"ఇచ్చితి పో.. నీ భార్యకు రెండు కోట్ల ఖరీ దుచేసే బంగళా కూడా"

"రెండో కోరిక.. ఓ నాలుగు కోట్ల క్యాష్, ప్లస్ గోల్డ్.."

"ఇచ్చితి పో.. మీ ఆవి డకు ఎనిమిదికోట్ల క్యాష్, ప్లస్ రెట్టింపుగోల్డ్"

".. మూడో కోరిక" సందేహించాడు రాందాస్.

"చెప్పు"... ఆ మాంత్రిక రూపం రెట్టించి అడిగింది.

"నన్ను సగం చంపు"

"...."

– మంత్రవాది మహేశ్వర్
మెహిదీపట్నం, హైదరాబాద్

# నెంబర్ ఫోర్




అది వందమీటర్ల పరుగు పోటీ. పోటీలో పాల్గొంటున్న తన మిత్రుడు నానీకి సూచనలిస్తున్నాడు శ్యాం..

"నువ్వు పరిగెత్తేటప్పుడు నీ చూపంతా లక్ష్యం మీదే వుండాలి"

"సరే.."

"వెనక్కి తిరిగి చూడకూడదు"

'అలాగే.."

"చుట్టూ వున్న జనాన్ని అస్సలు పట్టించుకోకు"

"కోను.."



తర్వాత... పోటీదారులంతా పరిగెత్తడానికి సిద్ధంగా వున్నారు. ఈలోగా అనౌన్సర్ వచ్చి అనౌన్స్ చేశాడు 'వన్.. టూ.. త్రీ.. గో'

పోటీదారులంతా పరిగెత్తడం ప్రారంభించారు. నానీ మాత్రం పరిగెత్తకుండా అలాగే నిల్చున్నాడు. మిత్రుడెందుకు పరిగెత్తడంలేదో అర్థం కాలేదు శ్యాంకి. అతనిలో కంగారు పుట్టింది. గబగబా నానీ దగ్గరకు వచ్చి, "ఏరా! అందరూ పరిగెడుతూ వుంటే నువ్వేంటలా బెల్లం కొట్టిన రాయిలా నిల్చుని చూస్తున్నావ్?" అడిగాడు శ్యాం.

శ్యాం వంక అదోలా చూసి "అనౌన్సర్ చెప్పింది విన్నావా! ఆయన చెప్పినట్లే ఫాలో అవుతున్నాను" అన్నాడు నానీ.

"ఏం చెప్పాడు?" శ్యాం ముఖంలో క్వశ్చన్ మార్క్.

"ఒన్.. టూ.. త్రీ.. గో.. అన్నాడుగా అనౌన్సర్. మరి నా నెంబర్.. ఫోర్! అందుకే నా నెంబర్ అనౌన్స్ చేసేవరకు వెయిట్ చేస్తున్నాను"

పక్కన 'ధబ్'మని శబ్దం! వెనక్కి తిరిగి చూసిన నానీకి.. అక్కడే నేలపై పడున్న శ్యాం కనిపించాడు.

*– వాడపర్తి వెంకటరమణ*

*శివాజీపాలెం, విశాఖపట్నం*

# అర్హత

గ్రూప్-1 పోస్టులకోసం ఫైనల్ ఇంటర్వ్యూ జరుగుతోంది. ఇంటర్వ్యూ నిర్వహిస్తున్న ముగ్గురు అధికారులు అడిగిన ప్రశ్నలకీ తడు






ముకోకుండా జవాబులు చెబుతున్నాడు రమణ రావు. తెలివైనవాడు, చురుకై నవాడు, అంతకు మించి సమయస్ఫూర్తి కలిగి నవాడతను. పోటీ అధికంగా ఉండడంతో వివిధ కోణాల్లో అభ్యర్థుల సామర్థ్యాన్ని అంచనా వేస్తున్నారు ఇంటర్వ్యూ బోర్డు సభ్యులు..

"చివరగా నిన్ను ఒక ప్రశ్న అడుగుతు న్నాను. అత్యున్నతమైన ఈ ప్రభుత్వ అధికారి ఉద్యోగం పొందడానికి.. సిన్సియర్‌గా చెప్పు, ..నీకున్న ప్రత్యేక అర్హతలేంటి? " ఇంటర్వ్యూ బోర్డు ఛైర్మన్ అడిగాడు.

ఒక్క క్షణం ఆలోచించాడు రమణరావు.

"నేను ఒక్క సంవత్సరం కూడా ఏ ప్రభుత్వ విద్యాసంస్థలోనూ చదువుకోలేదు సార్!" చెప్పా డు వినయంగా!

బోర్డు సభ్యులు ముగ్గురి మొహాల్లో మెరిసిన చిరునవ్వు.. రమణరావులోనూ ప్రతిబింబిం చింది.

– పున్నమరాజు, హైదరాబాద్

# మునిగిపోతున్న నావ




**చా**లాసేపటి నుంచి వీధివాకిట నిలబడి భర్త రాక కోసం ఎదురుచూస్తున్న ఆమె.. ఒక్క నిట్టూర్పు విడిచి లోనికి వచ్చింది. పెద్దకూతురు దగ్గరకు వెళ్లి నేరస్థురాలిలా తలదించుకొని తగ్గుస్వరంతో "పదిన్నర దాటింది. మీ నాన్న ఇంకా రాలేదు.." అంది.



ఇంటర్ రెండో సంవత్సరం చదువుతున్న ఆ అమ్మాయి తోకతొక్కిన తాచులా ఒక్కసారిగా కస్సుమని లేచింది. పట్టరాని కోపంతో చదువుతున్న పుస్తకాన్ని నేలకేసి విసిరికొట్టింది. తనకన్నా నాలుగేళ్లు చిన్నదయిన చెల్లెల్ని ఉద్దేశిస్తూ "ఏ జన్మలో చేసుకొన్న పాపమో.. ఈ కొంపలో పుట్టాం! బయలుదేరు. ఆయనగారు ఏ చెత్తకుండీ దగ్గర పడి ఉన్నాడో వెతికి తీసుకువద్దాం" అంది.

రాత్రి పదకొండుగంటలవేళ.. తాగిన మత్తులో ఒళ్లెరుగకుండా పడివున్న తండ్రిని కూతుళ్లిద్దరూ ఆటోలో నుంచి దింపి, ఇంట్లోకి చేరవేశారు.. బియ్యం బస్తాని చేరవేసినట్లు.

అతడలా పీకలదాకా తాగి ఒంటిమీద స్వాధీనం కోల్పోయి ఇంటికొచ్చే దారిలో ఎక్కడ పడితే అక్కడ పడిపోయిన సందర్భాలెన్నో ఉన్నాయి. అలా పడటంతో ఒకసారి పక్కటెముకలు రెండూ విరిగాయి. మరొకసారి నుదిటిమీద పెద్దగాయమయింది. ఇంకొకసారి జీతాలనాడు జేబులో జీతం డబ్బులు మొత్తం ఎవరో తస్కరించారు. ఇన్ని జరిగినా అతడికి చీమ కుట్టినట్టు కూడా ఉండదు.

మరుసటిరోజు కూతుళ్లిద్దరూ లేకుండా చూసి "ఆడపిల్లలిద్దరూ ఎదిగివస్తున్నారు. ఒక్క రూపాయి కూడా వెనకేసింది లేదు. ఇంత బాధ్యత లేకుండా ప్రవర్తిస్తున్నారే? వాళ్ల బతుకులేం కావాలనుకుంటున్నారు? తప్పతాగి పడి ఉన్న మిమ్మల్ని ఆడపిల్లలు ఇంటికి చేరవేస్తున్నారే? మీకు సిగ్గనిపించడం లేదూ? " అందామె.

ఆమె మాటల్లో నిష్ఠూరం లేదు, అంతులేని వేదన ఉంది. తన మాటలు అతడి మీద పనిచేయవని ఆమెకు తెలుసు. అయినా ఆమెలో ఏదో తాపత్రయం.

కానీ చిత్రం! ఈసారి ఆమె మాటలు అతడి మీద బాగా పనిచేశాయి. అతడిలో అనూహ్యమైన మార్పును తీసుకువచ్చాయి. తప్పతాగి ఏ చెత్తకుండీ దగ్గరో పడి ఉన్న అతడిని ఇంటికి చేరవేసే దుస్థితి అతడి కూతుళ్లకు మళ్లీ ఎన్నడూ కలగలేదు.

ఎందుకంటే, అతడిప్పుడు ఇంటి దగ్గరే.. భార్యా కూతుళ్ల ఎదురుగానే తాగుతున్నాడు మరి!

– శీరం నారాయణస్వామి
ఈస్ట్ ఆనంద్‌బాగ్, సికింద్రాబాద్

# షరా మామూలే

"రామనాథం! నీలో మార్పు కన్పిస్తోంది. నువ్వు సాధారణ మనిషిలానే ఇప్పుడు ప్రవర్తిస్తున్నావు" అన్నారు సైకియాట్రిస్టు.

"నేను మొదటి నుండీ చెబుతూనే వున్నాను. కానీ నాకు పిచ్చి వుందని మా వాళ్లు చేర్పించారు. దానికి మీరు ట్రీట్‌మెంట్ అని చెప్పి రోజుల తరబడి ఇక్కడే వుంచేశారు" అని సమాధానంగా అన్నాడు రామనాథం.



"సరే.. నువ్వు మామూలుగానే ప్రవర్తిస్తున్నావు అదే మాకు ఆనందం. రేపు ఉదయమే మీ ఇంటికి ప్రయాణం ఏర్పాట్లు చేసుకో" అన్నారు సైకియాట్రిస్టు.

"థ్యాంక్యూ సార్!"

"ఇంటికి వెళ్ళాక ఏం చేస్తావు రామనాథం? "

"బతకడానికి ఏదైనా చేయాలి కదండీ! అందుకే నాకున్న ఆస్తినంతా పెట్టుబడిగా పెట్టి చిన్నవ్యాపారం ప్రారంభిస్తాను"




"వెరీగుడ్! తర్వాత? "

"వ్యాపారంలో వచ్చిన లాభాలతో చిన్న ఫ్యాక్టరీని పెడతాను"

"వెరీగుడ్! నీ ప్రవర్తనలో చక్కని మార్పు వచ్చింది. తర్వాత ఏం చేస్తావు? " అడిగారా సైకియాట్రిస్టు.

"దాన్ని పెద్ద ఫ్యాక్టరీగా మారుస్తాను"

"బాగుంది.. తర్వాత? "

"తర్వాత ఏం చేస్తాం? అందరిలాగే, ఫ్యాక్టరీకి నాలుగువైపులా బాంబులు పెట్టి పేల్చేస్తా.." అని రామనాథం అనడంతో..

"రేపటి నీ ప్రయాణం వాయిదా పడింది, తర్వాత మళ్ళీ కలుద్దాం" అంటూ వెళ్ళిపోయారు సైకియాట్రిస్టు.

– చప్పు నాగేశ్వరరావు
పాములవలస




# మ్యాచ్ ఫిక్సింగ్

ఆ రోజు..

"నేనూ అబ్బాయీ వెళ్లి పిల్లని చూసివస్తా మండీ!" అంది అమ్మ.

"నువ్వు వెళ్లి చూసిరా, చాలు! మళ్ళీ వాడు దేనికి? " అన్నారు నాన్నగారు. నాన్నగారి ముందు ఎదురుపడి మాట్లాడడానికి నాకు భయం. నా గుండెల్లో రాయి పడింది.

"అదేమిటి.. అలా అంటారు? వాడికి కాబోయే పెళ్ళాన్ని వాడు చూసుకోవద్దా? " అంది అమ్మ నిష్ఠూరంగా.

"సరే వెళ్ళి రండి! కానీ ఓ విషయం.. నువ్వు తొందరపడి వాళ్లకు మాట యిచ్చేయకు. ఆశలు కల్పించకు. తరువాత వీలునుబట్టి నిర్ణయం తీసుకోవచ్చు!" అంటూ గట్టిగా హెచ్చరించారు నాన్నగారు.

అమ్మాయివాళ్ల యింటికి చేరుకున్నాం. వాళ్లు మమ్మల్ని సాదరంగా ఆహ్వానించి, అతిథి మర్యాదలు ఘనంగా చేశారు.

"అమ్మాయి ఎక్కడ? " అంటూ అమ్మ నేరుగా యింట్లోకి దూరిపోయింది. నేను హాల్లో ఒంటరిగా బిక్కుబిక్కుమంటూ సోఫాలో కూర్చున్నాను.



"అమ్మాయి చాలా బావుంది! ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ పిల్లను వదులుకోను. మా ఇంట్లో నా మాటకు ఎవరూ ఎదురు చెప్పరు! నాదే తుది నిర్ణయం" అమ్మ గొంతుపెంచి మాట్లాడేస్తోంది. నాన్నగారి హెచ్చరిక కల్ని గాలికి వదిలేసింది. ఆ ఇంటి ఆడపడుచు హోదాకి వియ్యపురాలి హోదా జత కలిస్తే అగ్నికి ఆజ్యం తోడయి నట్లుగా వుంది.

"ఓరేయ్ చిన్నా! అమ్మాయి ఎంత బావుందో చూడు" అంటూ సరాసరి తానే తీసుకువచ్చి నా వళ్లో కూర్చోబెట్టింది. నిజంగా అమ్మాయి చాలా బావుంది. ఆ అమ్మాయి నా కళ్ళల్లోకి చూసి కిసుక్కున నవ్వి నా ఒళ్లు తడిపేసింది. చుట్టూ వున్న జనం ఫక్కుమన్నారు. నేను ఏడవడం తరువాయి. అప్పటికి నా వయస్సు ఆరు. నా ధర్మపత్ని ఇందిరకి తొమ్మిది నెలలు. ఇరవై ఏళ్ల కిందటే అమ్మ చేసిన ఫిక్సింగ్!

– వియస్సార్వీ, కోలంక

# తెలివైన కొడుకు



పిసినారి అయిన రంగయ్య చనిపోతూ తన కొడుకును పిలిచి "నా ఆస్తి మొత్తాన్ని ధన రూపంలో ఈ కవర్‌లో పెట్టాను. నేను చనిపోయిన తర్వాత నా చితిలో పెట్టి దహనం చేయి" అన్నాడు.

"సరే నాన్నా" అన్నాడు కొడుకు రవి.

తోడుగా వచ్చిన రవి స్నేహితుడు నివ్వెరపోయాడు.

రంగయ్యను దహనం చేసిన తర్వాత ఇంటికి వచ్చిన రవితో "మీ నాన్న తన డబ్బు మొత్తాన్ని దహనం చేయమన్నాడు కదా! దహనం చేశావా? అని అడిగాడు స్నేహితుడు.

"మా నాన్న ఇష్టప్రకారమే దహనం చేశాను.. కానీ డబ్బు రూపంలో కాదు చెక్కు రూపంలో " అన్నాడు రవి.

మిత్రుని తెలివిని మనసులోనే మెచ్చుకున్నాడు రవి స్నేహితుడు.

**– ఎం. ప్రవీణ్,**
కోడుమూరు, కర్నూలు జిల్లా




# కొత్త వంటలు



కొత్తగా పెళ్ళయిన కాంతారావు బజారంతా తిరిగి 'కొత్త వంటలు' అనే పుస్తకం కొని భార్యకు ప్రజెంట్ చేశాడు. ఆవిడ రెచ్చిపోయి రోజుకో కొత్తరకం చేస్తూ భర్త దగ్గర నుంచి బోల్డు సర్టిఫికెట్లు సంపాదించేసింది.

ఒకరోజు కాంతారావు ఇంట్లో అడుగు పెడుతూనే భార్యతో "ఇవాళ చాలా ఆకలిగా ఉంది. స్నానం చేసొస్తా, భోజనం వడ్డించు" అన్నాడు చొక్కా గుండీలు విప్పుకుంటూ.

అయినా భార్యలో ఎటువంటి చలనం లేకపోవటం గమనించిన కాంతారావు "ఏమైంది? " అన్నట్లు ఆవిడవైపు చూశాడు.

"సారీ! ఇవాళ వంట చెయ్యలేదు" చెప్పింది సమాధానం.. బిక్కమొహం వేసుకుని..

"ఎందుకని" అడిగాడు కాంతారావు.

"ఉదయం పాత పేపర్లవాడికి వేసిన పేపర్లతో పాటు పొరపాటున వంటల పుస్తకం కూడా వెళ్లిపోయిందండీ" జాలిగా జవాబిచ్చింది భార్య.

**– వి.వి.యస్.మూర్తి**
చోదిమెళ్ళ




# చేతివాటం

మా చిన్నవాడు టేబులుమీద మరచిపోయిన పెన్సిల్‌బాక్సు కనిపించలేదు. 'అది పని మనిషి చేతివాటమే అయివుంటుంది. సాయంత్రం ఆమెని నిలదీయాలి' అనుకుంటూ వంటింటి పనిలో నిమగ్నమయ్యాను. నేనో చిన్న రచయిత్రిని. నాకోసం ఓ చిన్న టేబులు, దానిమీద నోట్‌పేడ్స్, పెన్నులు, పెన్సిళ్ల స్టాండులు ఇలా అన్ని హంగులు సమకూర్చాను. సాయంత్రం మావాడు వచ్చాడు.



"ఏమండీ! స్టేపుల్‌పిన్స్ తెచ్చారా? " అని అడిగాను.

"స్టేపుల్‌పిన్స్, కాగితాలు అన్నీ తెచ్చాను" అని "ముందు కాఫీ ఇవ్వు" అని అడిగారు.

ఇంతలో పనిమనిషి వచ్చింది.

"ఇక్కడ పెన్సిల్‌బాక్సు నువ్వు దొంగిలించావు కదా! మాకు నిజం చెప్పు" అని ఆమెను నిలదీశాను.

"తీశానుగాని దొంగలించలేదు. మిమ్మల్ని అడిగి తీసుకుందామనే లోపే ఎదురింటి ఆవిడ పిలవడంతో మరి ఆ సంగతి మరిచాను"

"ఇప్పుడు పెన్సిల్‌బాక్సు తీశావు. ఇక రేపు ఇంకేం దొంగిలిస్తావో.." అని నేనంటుండగా మాటల మధ్యలోనే.. పనిమనిషి అడ్డుకుంది.. "మాకు డబ్బులు చాలక ఇలా చిన్నవాటి కోసం మిమ్మల్ని అడగవలసి వస్తోంది. మరి మీకు డబ్బుంది కదా! మీ ఆయనగారు ఆఫీసునుండి పెన్నులు, పెన్సిళ్లలాంటి చిన్న చిన్న వస్తువులు తెస్తుంటారు కదా! అది దొంగతనం కాదా? ? "

ఆ మాటలకు ఒక్కసారి అవాక్కయ్యాను. ఆ మాటలలో వున్న నిజాన్ని గ్రహించడానికి కొంచెం టైం పట్టింది.

– *దూశి గురునాథరావు*

విశాఖపట్నం

# మార్నింగ్ వాక్

**రా**జధానిలో ఉంటున్న రాధికను చూడటానికి బామ్మ వచ్చింది. పెళ్లయిన తర్వాత బామ్మ రావడం అదే గనుక, రాధిక బామ్మకు ఇష్టమైనవి వండి పెట్టాలని నిర్ణయించుకుంది. బామ్మకు ఏ ఊరిలో ఉన్నా వేకువ ఝామునే లేచి స్నానపానాదులు పూర్తిచేసుకుని శుచిగా దేవుడిపూజ చేసుకోవటం అలవాటు. అలాగే రాధిక ఇంట్లో కూడా వచ్చిన మర్నాడే తన కార్యక్రమాలకు శ్రీకారం చుట్టింది.



వేకువఝామునే లేచి మనుమరాలి ఇంటి ముందు ఊడ్చి, నీళ్లు చల్లి, చక్కగా చుక్కలు ముగ్గు వేయడంలో నిమగ్నమైన బామ్మగారు హఠాత్తుగా రాధిక భర్త గోపాల్ దూరంగా బనీను.. నిక్కరుతో రావడంతో చూసి "అయ్యో రాధికా.. రాధికా.." అంటూ కేకలు పెట్టింది.

ఇంట్లో ఉన్న రాధిక బామ్మ దగ్గరకు పరుగులు పెట్టింది.




"చూడవే! అబ్బాయి, బనీను.. నిక్కరుతో వస్తున్నాడు. పాపం బట్టలు పోయాయి అనుకుంటా!" అన్నది.

రాధిక నవ్వి "అబ్బే లేదు బామ్మా! ఆయన ఆ బట్టలతోనే మార్నింగ్ వాక్‌కు వెళ్లారు. ఇప్పుడు వస్తున్నారు" అని చెప్పింది.

బామ్మ బుగ్గలు నొక్కుకుంటూ "అలాగా! మా ఊళ్లో రాత్రుళ్లు పేకాట క్లబ్బుల మీద పోలీసులు పడితే తెల్లవారుఝామున మగపిల్లకాయలు కూడా ఇలాగే వస్తూంటారు లేమ్మా!" అంటూ వివరించింది.

ఆశ్చర్యపోవడం రాధిక వంతయ్యింది.

– *పి.వి.రమణకుమార్*

చిలకలూరిపేట


అమ్మమ్మను ఏమన్నార్రా?
సండే, సీరియల్స్ రావన్నాం.. అంతే!






TV


వచ్చుతే వర్షంలో
ఆడిస్తే గొడుగు పాడైపోతుంది...


వీరు ఆపరేషన్‌కు ముందుగా ఫీజు కట్టక్కర్లేదు, పోస్టుమార్టం తర్వాత అవయవాలు మొత్తం దానం చేస్తామని అగ్రిమెంట్ రాసి సంతకం చేస్తారు...
డా॥ ఉపాయం MBBS..


'మంకీ' కటింగని లేటెస్టు స్టైల్ మమ్మీ...!


మనోడికి కరెక్టుగా నప్పిందే!!

"జీవితంలో విజయం సాధించడం ఎలా!
అనే నా పుస్తకానికి పబ్లిషర్ దొరకడం లేదండీ!




అక్కడికి నువ్వొక్కదానివే పెళ్ళి కాకుండా తల్లివైపోయినట్టు ఏడుస్తావేంటి..? నేనుమాత్రం పెళ్ళి కాకుండా తండ్రిని కాలేదా..?
నేనెవరితో చెప్పుకోను..

బంగాళదుంప తరక్కుండా... పులుసులో వేస్తారుటోయ్..!
వింతగా వుంది... వంటవాడు
వంటక్కొత్తేమో...!!

ష్..! భోయినాలయ్యాక
నీ.. టెన్నిస్ బంతి
ఎక్కడ పడిందో...
వెతికిస్తా..!!

కామేష్




మీరూ... మీ మతి మరుపూను..! మనవాళ్ళ పెళ్ళి గంగ ఫంక్షన్ హాల్లో..! మీరెళ్ళింది.. ముంగ ఫంక్షన్ హాలు..!! ఇట్లుండె..!!
కామేశ్




సైబర్ ఘరా పాపులను
చూసి మన కింకరులు భయ
పడుతుంటే.. భూలోకం
నుండి రోబోలను
తెప్పించాం.. ప్రభూ!

ఫ్రెంచి కథ

- మొపాసా

# మహాపాపం

అనువాదం : గోరంట్ల వాణీదేవి

మేం తరచూ వెళ్లే ప్రాంతంలో ఒక వృద్ధ సాధువు వుండేవాడు. అతనుండేది ఒక లోయ. ప్రపంచంతో సంబంధం లేకుండా జీవించే ఈ రకం మనుషుల గురించి, వారి గత జీవితాల గురించి తెల్సుకుని ఆశ్చర్యపోయేవాళ్లం.

ఆ సాధువును కలసి వస్తున్నప్పుడు నా మిత్రుడన్నాడు "నాకొక సాధువు తెలుసు. అతనిది చాలా చిత్రమైన కథ. అడవి మధ్య ఎత్తయిన కొండ తెలుసు కదా! అక్కడ పాములెక్కువ కనుక పాముల కొండ అంటారు దాన్ని. పదేళ్లక్రితం ఆ సాధువుండేవాడక్కడ. అతన్ని గురించి తెలుసుకోవాలనే కుతూహలంతో ఒకరోజు గుర్రంమీద అక్కడికి బైలుదేరాను. గుర్రం దిగి కాలినడకన కొండెక్కుతున్నాను. వాతావరణం ఆహ్లాదకరంగా వుంది. మైమరపించే పూలవాసనలు పీలుస్తూ, అక్కడి మనోహర దృశ్యాలను చూస్తూ ఒళ్లు మరచిపోయాను. పర్వతశిఖరాన ఒక పాడుబడిన గుడివుంది. ఆ గుడి శిధిలాల సమీపంలో ఒక బండమీద సాధువు కూర్చొని వున్నాడు. అతని వయసు నలభై ఐదు నుంచి యాభై మధ్య ఉండవచ్చు. తల ముగ్గుబుట్టలా వుంది.

నేనొక గంట గడిపానక్కడ. ఆ సాధువు జీవితంపట్ల విరక్తితో అక్కడికి వచ్చినట్లు గ్రహించాను. రెండు మూడుసార్లు నేను అతన్ని కలుసు కున్నాను. అలా కొంతకాలానికి ఇద్దరం మిత్రులమైపోయాం. వసంత రుతువులో ఒకనాటి ఉదయం తినుబండారాలతో నేనక్కడ వున్నాను. ఇద్దరం కలిసి భోజనం చేయాలని నిశ్చయించుకొన్నాం.

గాలి సుమ సౌరభాలను మోసుకొస్తోంది. వృద్ధులు కూడా ప్రేమస్వప్నాలు కనే కాలం. సాధువు నన్ను చూసి ఆనందించాడు. ఇద్దరం కూర్చున్నాక నేను ఒక గ్లాసు మద్యాన్ని అతనికందించాను. అతనిలో దాగున్న రహస్యాలన్నీ బైటకొస్తాయని నేననుకుంది నిజమే అయింది. మద్యం సేవించాక అతడు ఉత్తేజితుడై, పారిస్‌లో తన జీవితం గురించి చెప్పసాగాడు. చివరకు నేను సాహసించి ఇలా సన్యాసిగా ఎందుకు గడపాల్సివచ్చిందని అడిగా.

"ఆ కథంతా చాలా జుగుప్సాకరం, ఎంతో బాధామయం. నేను పుట్టింది పారిస్‌లో. నా చదువంతా అక్కడే సాగింది. మంచి ఉద్యోగమూ దొరికింది. స్వేచ్ఛగా, పైలాపచ్చీసుగా కాలం గడుపుతున్నాను. ఒకే స్త్రీతో జీవించడం నాకు ఇష్టం లేదు. అందుకే వివాహం చేసుకోలేదు. ఒకరి తర్వాత మరొకరిని.. అలా స్త్రీలను మారుస్తూ వచ్చాను. అలా చాలామందితో సుఖించాను.

నా జీవితం హాయిగా హోటళ్లలో, థియేటర్లలో గడచిపోసాగింది. పారిస్ నగరంలోని విలాసవంతమైన జీవితాన్ని నేను పూర్తిగా అనుభవిస్తున్నాను. ఇంకేం పనిలేదు. దాదాపు ఇరవై ఏళ్లు నేను ఉల్లాసంగా, ఉత్సాహంగా జీవితాన్ని గడిపేశాను. ఈ మధ్య కాలంలో నాకు భార్యాపిల్లలూ, మిత్రులూ ఎవరూ లేరు.

నేను నా పుట్టినరోజు జరుపుకోవటానికొక హోటల్ కెళ్లాను. భోజనాది కార్యక్రమాలు ముగిశాక, అందమైన అమ్మాయిలు దొరికే ప్రదేశానికి చేరాను. అక్కడొక సుందరీమణి రాత్రంతా నాతో గడిపింది. పారిస్‌లో అత్యంత వైభవోపేతమైన హోటల్‌కు ఆమెను భోజనానికి ఆహ్వానించాను. ఆమె వస్తానని మాటిచ్చింది. శృంగారం రసవత్తరంగా వుండాలని, నేను కోరుకున్న అమ్మాయి స్వభావం గురించి తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నాను. అందుకు చాలా శ్రమపడాల్సి వచ్చింది. చాలారోజులకు మా ఇద్దరి మధ్య గాఢ సంబంధం ఏర్పడ్డాక నేనామె ఇంటికెళ్లాను. రెండు గదుల చిన్న ఇల్లు. ఉన్నంతలో పరిశుభ్రంగా వుంది. ఆమెతో రెండు గంటలు గడిపాను. సంతోషంగా వుండటం ఆమె స్వభావం. ఆమె పట్ల నేను పూర్తిగా ఆకర్షితుడినయ్యాను. వచ్చేటప్పుడు డబ్బు దిండుమీద పెట్టబోతూ గోడకున్న ఫొటోలను జాగ్రత్తగా గమనించాను. ఓయువకుని ఫొటోపై నాకళ్ళు నిలిచిపోయాయి. గతంలోని జ్ఞాపకాలు గిర్రున తిరిగాయి. నేనామెను ఆతృతగా అడిగాను "ఈ యువకుడెవరు? "

నేను ఆ అమ్మాయినలా అడిగేసరికి ..నన్ను పరిశీలనగా చూసి అంది "నేనెన్నడూ చూడని నా తండ్రిది. మా అమ్మ చనిపోతూ ఈ ఫొటోను జాగ్రత్తగా చూసుకోమని, ఎప్పటికైనా అది మేలు చేస్తుందని చెప్పింది. నేను నా తండ్రిని వెదకాలని ప్రయత్నించలేదు. నా గురించి అతనికీ తెలియదు"

అనుకున్నదానికంటే ఎక్కువ ఫీజు ఆమెకిచ్చి, నేనెటువెళ్తున్నానో నాకే తెలియకుండా.. అడవివైపు పరుగెత్తాను.

తనకొక చక్కని బాబు పుట్టాడని వాడికి తండ్రివి నేనేనని.. పది నెలల తర్వాత ఆమె దగ్గరనుండి నాకు ఉత్తరం వచ్చింది. నేనామెను పూర్తిగా మర్చిపోవాలనుకొనే సమయంలో, ఆ ఉత్తరం నా మనసును పట్టి కుదిపేసింది. నేను నది ఒడ్డున కూర్చొని నా గత సంఘటనలను నెమరేసుకొంటూ వుంటే, ఆ అమ్మాయి నా కూతురే అన్న విషయం నాకు మింగుడు పడలేదు! ఈ మహాపాపానికి ప్రాయశ్చిత్తం చేసుకునే సాహసం నాలో లేదు. నేను ఒక వకీలును కలుసుకొని ఆమె జీవితం సుఖంగా గడపటానికి కావలసిన ఏర్పాటు చేశాను. ఆ తర్వాత ఇక్కడకొచ్చేశాను. ఇక్కడా ఎన్నిరోజులుంటానో తెలియదు. నా గురించి మీ అభిప్రాయం ఏమిటో ఇప్పుడు చెప్పండి"

నేనన్నాను "తప్పు తెలుసుకున్నాక మీరు మీ కర్తవ్యాన్ని నెరవేర్చారు. ఇదేమీ మామూలు విషయం కాదు. ఇతరులెవరైనా ఇది కూడా చేసేవారు కాదు"

"నాకు జీవితంపట్ల విరక్తి కలిగింది. మానసిక స్థితి కూడా దిగజారింది. పారిస్ నగరమంటే అసహ్యం కలిగింది. ఇంతటి ఘోరపాపం జరిగిందిక్కడే. ఇక్కడే నా జీవితం సర్వనాశనమయింది" అన్నాడాయన వేదనగా.

ఈ కథ విన్నాక నేను నాలోని చైతన్యం కోల్పోయాను. ఎలాగో సాధువుకు చెప్పి ఇంటికొచ్చాను.

మళ్లీ కొన్నాళ్ల తర్వాత వెళ్లి చూసేసరికి, ఆ పాముల పర్వతం మీద ఆ సాధువు లేడు. ఆ తర్వాత మరెన్నడూ నేనతన్ని చూడలేదు! V

**కథకుల ఫైల్-6**

- కీ.శే. సురవరం ప్రతాపరెడ్డి

# వకీలు యెంకయ్య

సుమారు 40 ఏండ్ల కిందటి విషయం. ఆ కాలములో వకీళ్ళంటే గొప్ప అధికారులన్నమాట. చాలా గ్రంథాలు కూడా చదువవలసినవి లేకుండేది. ఏవో రెండు తురక మాటలు మాట్లాడి రెండు లావు పుస్తకాలు చంకన పెట్టుకొని బజారులో తిరిగినవాడంతా వకీలు అనుకునేది. మన యెంకయ్య అస్సలు పేరు వెంకటరెడ్డి దొర. అతడు సన్ 1277 ఫసలీలో పాలమూరు జిల్లాలోని (ఇప్పుడు దాన్ని మహబూబునగర మంటారు) సింగారము అనే గ్రామములో జన్మించినాడు. తల్లిదండ్రులు బీదవారు. రెండుకాండ్ల సేద్యము. మామూలి జీవనము. అప్పుసప్పు లేకుండా బ్రతికినవాళ్ళు. నంబి రంగయ్య బళ్ళో భారతము, భాగవతము చదువడము, వ్రాయడము, చిక్కు ఉత్తరాలలో చిక్కు విడదీయడము, వడ్డీ లెక్కలు సరిగా వేయడము,



## తెలంగాణ వైతాళికుడు



మహబూబ్‌నగర్ జిల్లా అలంపురం తాలూకా ఇటిక్యాలపాడు గ్రామానికి చెందిన సురవరం ప్రతాపరెడ్డిగారు హైదరాబాద్ నిజాం కళాశాల, మద్రాసు రెసిడెన్సీ కళాశాలలోను చదివి బి.ఏ., బి.ఎల్. పట్టాలు పొందారు. ఉపనిషత్తులు, వ్యాకరణ, తర్క, మీమాంసలను అభ్యసించారు. గోలకొండ పత్రిక సంపాదకులుగా అప్పటి నిజాం ప్రభుత్వానికి ఎదురొడ్డి నిలిచారు. రాజకీయంగానే కాక సాహితీ సాంస్కృతిక రంగాల్లో తెలంగాణకు అపారమైన సేవలందించారు. ప్రతాపరెడ్డి గారి సేవలకు నోచుకోని సంస్థ తెలంగాణలో ఒక్కటికూడా లేదంటే అతిశయోక్తి కాదు.

పత్రికద్వారా దేశసేవ, తెలంగాణ ప్రజల సర్వతోముఖాభివృద్ధి, సంఘసంస్కరణ, మాతృభాషా వికాసమనే ఉన్నత లక్ష్యాలను సాధించడానికి జీవితాన్ని అంకితం చేశారు.

ప్రాచీన సంప్రదాయ పద్ధతిలో సంస్కృత పాండిత్యాన్ని సముపార్జించినప్పటికీ సురవరం వారు ఆధునిక వైదుష్యాన్ని జోడించుకొని సాహితీరంగంలో విశేష ప్రతిభ ప్రదర్శించారు. వీరు మొత్తం నలభైవరకు గ్రంథాలు రాశారు. వీటిలో ఒకటి రెండు అముద్రితాలు కాగా, ఒకటి రెండు అసమగ్రాలు. ఆధునిక వాఙ్మయంలోని సాహితీ ప్రక్రియలన్నిటినీ ప్రతారెడ్డి గారు చేపట్టారు. ఆనాటి నవలా రచయితల మాదిరిగానే వీరూ మొదట గ్రాంథిక శైలినే అనుసరించారు. తరువాత క్రమంగా వ్యావహారికభాషలోనే రచనా వ్యాసంగాన్ని కొనసాగించారు. పద్యాలతో పాటు దేశభక్తి ప్రబోధితాలైన అనేక గేయాలనూ రాశారు. నైజాం నవాబు సంస్కరణలను తీవ్రంగా విమర్శిస్తూ గోల్కొండ పత్రికలో రాసిన సంపాదకీయాలు తెలంగాణ ప్రజలను ఎంతగానో ఉత్తేజపరచాయి. మిగిలిన రచనలకన్నా సురవరం వారి కథానికలు బహుళ ప్రజాదరణ పొందాయి. వీరు రచనల్లో గ్రామీణ జీవితానికి, తెలంగాణ భాష, పలుకుబడికి పట్టంకట్టారు. వీరి 'నిరీక్షణ' కథానిక ఉత్తమశ్రేణికి చెందిందిగా పలువురి విమర్శకుల మెప్పుపొందింది.

చీకటిలో దారితెలియక మగ్గుతున్న తెలుగు జాతికి ముఖ్యంగా తెలంగాణకు వెలుగును చూపించి, కర్తవ్యోన్ముఖం చేయడానికి ప్రతాపరెడ్డిగారు తమ కలాన్ని, జీవితాన్ని అర్పణ చేశారు. అందువల్లే తెలుగు వైతాళికుల్లో సురవరంవారిది సమున్నతస్థానం.







**పేరు** : **సురవరం ప్రతాపరెడ్డి**

**జననం** : 1896 మే 28వ తేదీన మహబూబ్‌నగర్‌జిల్లా బోరవెల్లి గ్రామంలో మాతామహుల ఇంట్లో

**ప్రసిద్ధి** : సంస్కృతాంధ్ర ఆంగ్ల, ఉర్దూ, పార్శీ భాషల్లో పండితులు. తెలంగాణ రాజకీయ చరిత్రలో ప్రముఖపాత్ర పోషించారు. ఆంధ్రమహాసభ మొదటి అధ్యక్షులు. గోలకొండ పత్రిక సంపాదకులుగా సుప్రసిద్ధులు. ప్రజావాణి పత్రిక వ్యవస్థాపకులు. ఆంధ్ర సారస్వత పరిషత్తు సంస్థాపక అధ్యక్షులు. విజ్ఞానవర్ధనీ పరిషత్తు వ్యవస్థాపకులు. హైదరాబాద్ ఆయుర్వేద సంస్థకు ప్రథమాధ్యక్షులు. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన మొదటి తెలుగు రచయిత.

**రచనలు** : శుద్ధాంత కాంత, ఆరెవీరులు నవలలు, మొగలాయి కథలు, ప్రతాపరెడ్డి కథలు అనే కథానికా సంపుటాలు. వీరి 'నిరీక్షణ' కథానిక అన్ని భారతీయభాషల్లోకి అనువాదితమైంది. వీరు రాసిన ఆంధ్రుల సాంఘిక చరిత్రకు కేంద్రసాహిత్య అకాడెమీ అవార్డు లభించింది. రామాయణ విశేషాలు, హిందువుల పండుగలు, హైందవ ధర్మవీరులు, గ్రంథాలయాలు, లిపి సంస్కారం, పౌరసత్వాలు, పూనా వ్యవసాయ ప్రదర్శన, గోలకొండ కవుల సంచిక, చంపకీభ్రమర ప్రబంధంతో పాటు భక్తతుకారాం, ఉచ్ఛల విషాదం నాటకాలు.

**మరణం** : 1953 ఆగస్టు 25

అప్పు పత్రాలు వ్రాయడం, ఇవి 15 ఏండ్ల వయసు వచ్చేవరకు నేర్చుకున్నాడు.

ఇట్లా వుంటే ఒకనాడు ఇంట్లో వెంకటరెడ్డికి అతని తండ్రికి మాటలు జరిగినవి. తండ్రి చాలా కోపగాడు. నా ఇంట్లోనుండి తక్షణం వెళ్ళిపో అన్నాడు. వెంటకరెడ్డి మర్నాడు తెల్లవారేవరకు ఇంట్లోలేడు. తండ్రి యేమిన్నీ చింత చేయలేదు. తల్లి మాత్రం చాటుకు కన్నీరు రాల్చింది.

## ఉద్దండుల అండదండలు

ఆంధ్రోద్యమ పితామహులైన మాడపాటి హనుమంతరావుగారు ప్రతాపరెడ్డిగారికి అన్నింటా అండగా నిలిచారు. భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని చెరసాలకు వెళ్లిన వారిలో తొలి తెలుగువారైన గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారికి ప్రతాపరెడ్డిగారంటే అత్యంత అభిమానం. అప్పట్లో హైదరాబాద్ రాష్ట్రంలో జరిగిన జాతీయోద్యమాలు, విమోచనోద్యమాలన్నిటితోను ప్రతాపరెడ్డిగారికి గాఢమైన సంబంధం ఉంది.

జీవిత చివరి భాగంలో ప్రత్యక్ష రాజకీయాల్లో ప్రవేశించి వనపర్తి నియోజకవర్గం నుంచి శాసనసభ్యులుగా ఎన్నికయ్యారు. ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకు అధ్యక్షులుగా, గ్రంథాలయ సంఘానికి ఉపాధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

★ ★ ★

ఆకాలంలో హైదరాబాదులో వకాలతు చేసేవాళ్లు పల్లకీలలో పొయ్యేవారు. ఖాజా కమాలుద్దీన్ దెహలవీ అనే ఆయనకు జేనడు గడ్డం, రంగు వేసినందున అది మొక్కజొన్న పీచువలే వుంది. పెద్ద పగిడి. మర్యాదకు తగినంత పెద్ద పొట్ట. ఇంచుమించు భూమికి తగిలే అంత పొడవైన షేర్వాని. ఎట్టిని మనిషి, ఎత్తైనవాడు, పిల్లి కండ్లు ఇతనికి నెలకు రూ. 2000 ఆదాయము. ఫౌజ్దారీ (Criminal cases) లో పేరు పొందినవాడు. ఎటువంటి నేరము చేసినవాడు కానీ బరీ (విడుదల) చేయిస్తాడనే పుకారు. న్యాయాధికారికీ ఇతనికీ చాలా స్నేహం. ఎక్కువ వాదించేవాడు కాడు. కాని, ఈయన లేచి నిలిచినాడంటే కేసు జయమైందన్నమాటే. ఒకనాడు సాయంత్రకాలములో వెంకటరెడ్డి వచ్చి ఎట్లో ఈయన కాళ్ళమీద పడ్డాడు. ఇంటినుండి పారివచ్చినాడు. తన వూరికి పట్నమునకు 60 మైళ్ళ దూరము. కాని సాహసించి వచ్చినాడు. మౌల్వీసాబ్ అతణ్ణి చూచి ఏంకావలె అన్నాడు.

"మీ సేవ"

"అచ్ఛా" అన్నాడు మౌల్వీ.

దినమూ వెంకటరెడ్డి వకీలుసాబుగారి పుస్తకములు మోసుకొని కచ్చేరీకి పోవడము, ఇంటిలో కాయిదాలు సర్దడం, బజారుకు పోయి కూరగాయలు, మాంసము కొనితెచ్చి ఇయ్యడము ఇవి అతనికి ముఖ్యమైన పనులు. ఐదేండ్లు గడిచినవి. వెంకటరెడ్డికి ఉర్దూ బాగా మాట్లాడే నేర్పు కలిగింది. ఇంతో అంతో వ్రాస్తాడు, చదువుతాడు. 5-6 పెద్ద పెద్ద ఖానూను పుస్తకాలు కొన్నాడు. ఒకనాడు పాలమూరికి వ్యాపారస్తుల బండ్లు పోతూవుంటే ఒక బండిలో పడి ప్రయాణమైనాడు.

వెంకటరెడ్డి మళ్ళీ వచ్చినాడంటే పూరంతా తలక్రిందు అయింది. కొందరు అతడు సన్యాసులలో కలసినాడని, తాము రామేశ్వరము పొయ్యే బైరాగులలో అతన్ని చూచి బాగా గుర్తుపట్టినామనిన్నీ, కొందరు అతడు పెద్దజానంపేటలో (ఇప్పుడు ఫర్రుఖునగరు అంటారు) తురకలలో కలిసినాడనిన్నీ, వక దళిత స్త్రీని పెండ్లి చేసుకున్నాడనిన్నీ, కొందరు అతడు కృష్ణలోపడి చచ్చినాడనిన్నీ- యిట్లెన్నెన్నో పుకారులు పుట్టించి వుండిరి. తల్లిదండ్రులు దినాలు లెక్కపెట్టి యెదురు చూచి యెదురుచూచి యింక చచ్చినాడనే నిర్ణయించి చాలా వ్యాకులములో కుంగిపోయిరి. ఇప్పుడు వెంకటరెడ్డి మళ్లీ 5 పెద్ద పుస్తకాలు

ఏమేమో తురక కాయిదాల మూట, షేర్వానీ, తుర్కీటోపీ, బట్టలు, బూట్లు తెచ్చి నాడని వూరంతా సంభ్రమము. మనిషి చాలా మారిపోయినాడు. నెత్తిన క్రాపు, సన్నగా మీసము లేర్పడినాయి. షేర్వానీ లాగు తొడుగుతాడు. నెత్తిన తురక టోపీ మూరెడిది ఎక్కించినాడు. తురకంలో మాట్లాడుతాడు. పట్నములో వకీలు అయి వచ్చినాడంట అనజొచ్చినారు, ఊరివా రంతా గౌరవించినారు. తల్లిదండ్రులకు అనపట్టరాని సంతోషమైంది. గ్రామమంతా వకీలు యెంకయ్య.. వకీలు యెంకయ్య అని పిలువ మొదలుబెట్టినారు. సర్కారు వారు సన దియ్యకున్నా పల్లెటూరువారు వెంకటరెడ్డిని వకీలు చేసినారు.

★ ★ ★

రెండేండ్లు గడిచినవి. ఇప్పుడు వకీలు యెంకయ్యకు 23 ఏండ్లు. దిన దినము ఊరివారిని బెదరించుతాడు. మాటకు కచ్చే రీకి పోతానంటాడు. మాటకు ఫౌజ్దారీ మొకద్దమా పెట్టి బేడీ హత్కడీ వేయిస్తా నంటాడు. తురకములో గుక్క తిప్పకుండా నలభైమాటలు ఏకధాటిగా వాగుతాడు. ఆ వూరి పోలీసుపటేలు వీనిదెబ్బకాగలేక యెంకయ్యకే ముక్తారునామా (Power of attorney) యిచ్చి పటేలిగిరీ చేయమ న్నాడు. కాని పట్వారీ, మాలీ పటేలు ఇద్దరు వకటయినారు. గ్రామములో రెండు పార్టీలేర్పడ్డవి. ఇప్పటికేమో సమానముగా వున్నవి. ఇట్లుండగా ఆ వూరిలో ఒక ఖూనీ జరిగింది. పది ఏండ్ల పిల్లవాన్ని ఒకన్ని చంపి బావిలో వేసినారు. రాత్రి జరిగిన పని. యెవరు చేసినారో తెలి యదు. వెంటనే వకీలు యెంకయ్య అమీన్ సాహెబుకు రిపోర్టు పంపినాడు. సాయిం త్రానికంతా అమీన్ హాజరైనాడు. అమీన్ సాబ్ వస్తాడని యెంకయ్య వకీలు 12 మంది యెట్టివారిని సిద్ధముగా ఎదురుకో లుకు వుంచినాడు. బండెడు కట్టెలు, 50 కోడిగుడ్లు, 5 కోళ్ళు, రెండు మేకపిల్లలు, 10 సేర్లు వాసన బియ్యము (పోలావుకు), 1 డబ్బా కాచిన నెయ్యి, చిల్లర మసాలా సామానులు, అదే మోతాదు మీద సిద్ధము చేయించినాడు. మాలీ పటేలు పార్టీలో పొగరు పట్టిన 10 మందిని వూరి ముందర కట్టేసి వుంచినాడు. అమీన్‌సాబు, ఇద్దరు జవాన్లు, ఒక వంటవాడు, జనానా బండిలో తన భార్య, ఒక దాసి వీరితో కూడ వచ్చినారు. చావడిలో పర్దాలు కట్టి నారు. జనానాకు విడిది చేయించినారు. పరుపుల దిండ్లు మెత్తలు, వీటికేమీ కొదు వలేదు. బావర్చీ (వంటవాడు) వంటకెక్కి నాడు. ధూముధాముగా ధూమము లేస్తూ వున్నది.

అమీన్‌సాబు పీనుగను ఎత్తించినాడు. పంచనామా చేసుకున్నాడు. పిల్లవాని తల్లిని ఎవరిమీద అనుమానం అని విచా రించినాడు. ఆమె యిట్లన్నది. "అయ్యా, ఏమి చెప్పాలె? నెల్లాళ్ళనుండి మాలీపటేలు ఆబోతులాగా నా వెంటబడినాడు. నేను వప్పుకోలేదు. నిన్న రాత్రి ఈ పదిమందితో నా ఇంటిమీదికి వచ్చినాడు. నేను తలుపు వేసుకుంటిని. నా పిల్లవాడు బయటనే వుండిపోయినాడు. నీవు బైటికి వస్తావా పిల్లవాన్ని చంపనా అన్నాడు. నేను పోలేదు. పిల్లవాన్ని ఏడుస్తున్నా లాగుకొని పోయినాడు. తెల్లవారేవరకు బాయిలో పడవేసినారని నాకు తెలిసింది. ఇది వున్న సంగతి" అని యేడ్చి యేడ్చి చెప్పుకున్నది.

అమీన్‌సాబు యెంకయ్య ముఖము చూచినాడు. ఇద్దరూ దాపుకు పోయినారు. తురకములో మాట్లాడుకున్నారు. ఏదో బరువుసంచి అమీన్‌సాబు చేతికి తగి లింది. "ఠీక్ ఠీక్" అనుకుంటూ ఇద్దరివత లికి వచ్చినారు.

"మాలీ పటేల్‌కు పకడ్కేలావ్" అని అమీన్ గర్జించినాడు.

పంచనామావద్ద మాలీ పటేలు పేరు

వచ్చినప్పుడే వకడు పోయి అతనితో చెప్పి నాడు. ఒరే ఇదంతా వకీలు యెంకయ్య గాని పనిరా అనుకొని యిప్పుడు యెదుటికి పోతిమా అవమానము అవుతుంది అని మాలీ పటేలు దాగుకున్నాడు. మాలీ పటేలు పారిపోయినాడనే వరకు నేరము యింకా గట్టిపడ్డది.

★ ★ ★

మూడేండ్లు హోరాహోరీగా కేసు జరిగింది. అస్సలు ఖూనీచేసిన వాడెవడో కాని మాలీ పటేలుకు 2 ఏండ్ల శిక్ష, 10 మందికి 2 ఏండ్లు మొదులుకొని 7 ఏండ్లవరకు శిక్ష, ఉభయ పార్టీలకు మొత్తము 20 వేలు ఖర్చు. మాలీపటేలు పని అయిపోయింది. జేలుకు పోయినాడు.

★ ★ ★

కాలం గడిచింది. మాలీ పటేలు, ఇంకా ముగ్గురు ఆయన పార్టీ వారు జైలునుండి వచ్చినారు. వకీలు యెంకయ్య అంటే ఆ ఊరికే కాదు, చుట్టుముట్టు గ్రామాదుల కంతా భయము కలిగిపోయింది. అతడు పట్టుకున్న కేసులన్నీ జయం. ఇట్లా ఉండగా ఆ ఊర్లోఉండే బాలయ్య అనే బోయవాడు 30 ఏండ్లవాడు పెండ్లి చేసుకున్నాడు. పెండ్లాము పేరు యెల్లి. 15 ఏండ్లది. ఎట్లనిది, మంచి అందగత్తె. ఆ జాతిలో ఇట్లాటి పిల్లలేదు అని పేరుపొందినది. పెద్ద కండ్లు, చేతికి వెండి కడియాలు, నడుములో వెండి డావు, ముక్కెర, ముత్యాల పోగులు, మెళ్ళో పగడాల దండ, మట్టెలు, గల్లుగల్లు మంటవి వెండి కడియాలు కాళ్లలో. కాపురం వచ్చిన నెల్లాళ్ళకు వకీలు యెంకయ్య యెల్లిని బావి నుండి నీళ్ళు తెస్తూంటే చూచినాడు. ఆనాడే తన యింట్లో బియ్యము చేయటానికని పిలిచి నాడు. దానితో సరసాలు మొదలు పెట్టి నాడు. యెల్లికిది నచ్చలేదు. ముఖము చిట్లించుకున్నది. కసరుకున్నది. యెంకయ్య చేయి పట్టుకున్నాడు. ఝాడించి వదిలించుకున్నది. చెంపగిల్లినాడు. యెల్లికి పట్టరాని కోపము వచ్చినది. చేట పారవేసింది. యింటి దోవ పట్టింది, "చూడు నేనెవరనుకున్నావు? నేను వకీలు యెంకయ్యను" అని మీసాలు (ఇప్పుడు బాగా పెరిగినవి) పురిపెట్టి నాడు. యెల్లి కొంచెము బెదిరింది. కాని వెనక్కి చూస్తూ చూస్తూ ఇంటికి పోయింది. మొగనికి జరిగిందంతా చెప్పుకున్నది. బాలయ్య మంచి కసరతు చేసిన జెట్టీ గిరిదాలు పెంచినాడు. చిల్లాడం తొడుగుతాడు. వానికి పట్టరాని కోపము వచ్చింది. మండిపడ్డాడు. పక్కింటి కూర్మన్న వచ్చినాడు. సంగతి కనుక్కున్నాడు.

"ఒరే! నీ బలం, నీ కోపం వకీలు యెంకయ్య వకాల్తా ముందర యేమి పనికి వస్తాదిరా? ఆయన ఖూనీ కేసులో పాపం అన్యాయంగా మాలీపటేలంతటి వాన్నే జేలుకు పంపియ్యలేదా? కావున, ఉపాయంగా పని సవరించుకోవాలె" అని హుషారు చేసినాడు. వారేదో రహస్యంగా మాట్లాడుకున్నారు.

★ ★ ★

మర్నాడు మళ్లీ యెల్లిని పిలిపించినాడు యెంకయ్య. యెల్లి వెళ్ళింది. మళ్లీ మళ్లీ

## కవిపండిత ప్రశంసలు

సురవరం వారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' వేటూరి ప్రభాకరశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ తదితర పండితుల మెప్పు పొందింది. 'హైందవ ధర్మ వీరులు' గ్రంథానికి పీఠిక రాసిన మల్లంపల్లి సోమశేఖరశర్మగారు అందులోని శైలిని, కథా కథన పద్ధతిని ప్రశంసించారు. ప్రతాపరెడ్డి గారి రామాయణ విశేషాలు, విమర్శ గ్రంథాలు తెలుగుభాష ఉన్నంతకాలం నిలిచి ఉండదగినవని సమకాలిక పండితులు, విమర్శకులు కొనియాడారు.

సరసాలు..

"ఏమే, ఈ ఊర్లో ఇంతమంది ఆడవాళ్ళు నేను పిలువకున్నా వస్తారు. నీ వొక్కదానవే నాకు నచ్చినదానవు. నీకు ఏం కావలెనో తెచ్చియిస్తా చెప్పు. నీవు దొరసాని లాగా ఉండవచ్చు. నీకీ యెండిసొమ్ము లేంటి? బంగారుసొమ్ములు మళ్లీ శనివారము వరకు చేయించిపెట్తాచూడు" అని యేమేమో అన్నాడు. యెల్లి ముసిముసి నవ్వులు నవ్వింది. యెంకయ్యకు ధైర్యము వచ్చింది. రాత్రికి వస్తావా అని వెంటనే అన్నాడు. మళ్ళీ యెల్లి వోరచూపులతో నవ్వింది. యెంకయ్య ఆ చూపులు చూసే వరకు ప్రపంచమే మరిచిపోయినాడు. యెల్లి మెల్లగా ఇల్లా అంది.

"అయ్యా, నా కిట్లాంటి పనులు అలవాటు లేవు, రాత్రి రావాలంటే భయమౌతుంది, మా ఆయన ఈవేళ సంతకు పోయిండు. రేపు వస్తాడు. మా ఇంట్లో ఇంకెవ్వరు లేరు, నీవే రాత్రి పూట మా ఇంటికి రాకూడదేమి! బీదవాళ్ళ ఇంటికి వస్తే యేమాయె." యెంకయ్య ఇప్పుడు యెల్లికి దాసానుదాసు. సరే అన్నాడు.

రాత్రి యెంకయ్య గంజితో చలువచేసిన బట్టలు వేసుకున్నాడు. జల్తారు రుమాలు తీర్చి కట్టినాడు. తాంబూలము వేసుకున్నాడు. ఇంత అత్తరు బట్టలకు పూసుకున్నాడు. చుట్ట చేతపట్టుకున్నాడు. మెల్లగా యెల్లి ఇంటికి పోయినాడు. తలుపు తిన్నగా తట్టినాడు. యెల్లి తలుపు తెరిచింది. నులక మంచంమీద గొంగడివేసి కూర్చో పెట్టింది, దిండు వేసింది. తాను వోరగా నిలుచున్నది.

"ఏమే, కొత్త పెండ్లికూతురులాగ సిగ్గుపడతావేమి? తలుపు మూసి గడివేసిరా" అన్నాడు.

యెల్లి తలుపు మూసింది. దూరంగా నిలుచోనుంది. "దగ్గరకు రా" అంటున్నాడు యెంకయ్య. యెల్లి ఆమాట ఈమాట చెప్పి కాలయాపన చేస్తూ వుంది. తుదకు యెంకయ్యనే లేచి దాన్ని చేయిపట్టి మంచంమీదకి లాగినాడు. ఇంతట్లో తలుపు దడాదడా కొట్టినారు.

"ఏమే యెల్లీ! తలుపు తీయవే" అని ధ్వని వచ్చింది. యెల్లి గడగడ వణకింది.

"ఎవరెవరు, నీ మొగుడా? రేపు వస్తాడంటివే. ఇప్పుడే ఎందుకు కాలబడివచ్చినాడు ముండాకొడుకు" అన్నాడు యెంకయ్య.

"అయ్యా నీకాళ్లు మొక్కుతా. నా మొగుడు చూచెనా ఇద్దరినీ చంపేస్తాడు. ఆ గరిసెకొట్టిట్లో దాగుకో" అని యెంకయ్యను గరిసెకొట్టిడిలో మూసింది. తలుపు తెరిచింది. బాలయ్య వచ్చినాడు.

"ఏమే, మంచి మంచి వాసన వస్తుంది. ఏమి! యెవరన్నా మిండగాడు వచ్చిండా" అన్నాడు.

"చాలులే, ఎప్పుడిదే తమాషాలు నీకు" అంది యెల్లి.

"లేదులే, ఇంతకే కోపము వచ్చిందే. యెల్లీ! ఈవ్వాళ సంతకు పోతుంటే- ఇక్కడెవ్వరు లేరు కదా- బాటలో వక డబ్బీ దొరికింది. దాంట్లో మంచి మంచి పచ్చలు, రత్నాలు వున్నవే. యెవరో గొప్ప దొరలు పోగొట్టుకున్నారు. దీన్ని దాపెట్టు" అని డబ్బీ చేతికిచ్చినాడు.

యెల్లి మెల్లగా గరిసెకొట్టిడిలోకి పోయి గూట్లో పెట్టింది. యెంకయ్య ఆ మాటలు విన్నాడు. డబ్బీ పెట్టింది చూచినాడు. మెల్లగా దాన్ని అందుకుని తెరచి లోపల వేళ్లు పెట్టి తడివినాడు. చెట్మని నూరు సూదులు కుట్టినట్లు రెండుమార్లు రెండువేళ్లకు తేలు కుట్టింది. డబ్బీ క్రింద పారేవేసినాడు. అబ్బా అని కూతవేసినాడు.

బాలయ్య "యేమే దొంగలు వచ్చినట్లుంది. అరే కూర్మా! దొంగలు" అన్నాడు.

కూర్మడూ వానికొడుకూ వచ్చినారు. ముగ్గురు కట్టెలు తీసుకొని గరిసెలోకి

చెప్పులతో పోయినారు. వెంకయ్యను పట్టు కున్నారు. తెలియనట్లుగా మెత్తగా పడగొట్టి నారు.

“వరే నేను యెంకయ్యనురా, వకీలు యెంకయ్యను” అన్నాడు. అనినా విన కుండా కొట్టి బయటికీడ్చినారు. మళ్లీ కొట్టి నారు. యెంకయ్య మూర్ఛపోయినాడు. చచ్చినాడేమో అని వీధిలో పారవేసినారు. అప్పుడేపోయి పటేలు పట్వారీలతో చేసిన పని చెప్పుకున్నారు. మీ ప్రాణానికి మా ప్రాణము అన్నారు వారు. ఆనాడు పటేలు పట్వారీలకు నిద్రలేదు. బోయవాండ్లందరి ఇండ్లకు తిరిగినారు. తమ పార్టీ వాళ్లంద రికీ హెచ్చరిక చేసినారు.

★ ★ ★

పది దినాలవరకు యెంకయ్య మంచము పట్టినాడు. చస్తాడని అందరనుకున్నారు. ఊరంతా వకీలు యెంకయ్యకు జరిగిన పరాభవము చెప్పుకున్నారు. బాలయ్య పెద్దశూరుడైనాడు. యెల్లి వీరపతివ్రత అయింది. 10-15 దినాలకు యెంకయ్య బయట తిరుగుబట్టినాడు. నిలిచిన చోట నిలువడు.

ఆ వూర్లో సర్కారీ ఈతచెట్లు చాలా సమృద్ధి. సుమారు 2000 వుండవచ్చును. ఈ పది దినాలలో వక చెట్టు లేకుండా కొట్టివేసినారు. మాలీపటేలు యెంకయ్య వకీలు మీద రిపోర్టు చేసినాడు. అమీన్‌సా బును అంతకుముందే కలసివచ్చినాడు. 2000 రూపాయిలు వూర్లో అందరూ చందాలు వేసుకొని జమ చేసినారు. 1500 రూ. అమీన్‌సాబుకు కట్నం కింద వసూలై నవి. అమీన్‌సాబు వస్తూనే యెంకయ్యకు బేడీలు వేసినాడు. యెంకయ్య 1000-1500-2000 వరకు సవాలు చేసి నాడు. మాలీపటేలు మళ్ళీ అమీన్‌సాబును దాపుకు పిలిచి 500 యిచ్చుకున్నాడు. యెంకయ్య వద్ద నగదు లేదు. ఇంకేమి చేస్తాడు? వూర్లో 100 మంది సాక్ష్యము చెప్పినారు. వెంకయ్యకు బేడీలు వేస్తూనే యెంకయ్యపార్టీ వారు భయపడ్డారు. యేమి చిత్రమో వక్కడుకూడా సాక్ష్యానికి రాలేదు. యెంకయ్యకు నాలుగు ఏండ్లు శిక్ష వేసినారు.

★ ★ ★

యెంకయ్య ఇంతవరకు 40 కాండ్ల సేద్యము, పెద్దబంగ్లా పాడీ పంట సమృద్ధి, ఇద్దరు కొడుకులు, భార్య పక్కవూరి దేశ ముఖు బిడ్డ, అన్నీ బాగానే వుండింది. పిడుగువలె ఈ శిక్ష పడినప్పుడే యెంకయ్య దశ అయిపోయిందని అందరూ అనుకు న్నారు. లోకకంటకుడు, నూర్లకొలది కొంపలు గూల్చె, స్త్రీలను చెరిచె, డాకాలు చేయించె, ఖూనీలు చేయించె, వీనికింకా తక్కువే శిక్ష అయింది అన్నారు అందరు. యెంకయ్య జేలుకు పోతూనే ఒకనాడు వానియెద్దులు 10 మాయమైనవి. ఆనాడు మాదిగ గేరిలో జల్సా! నెల్లాళ్ళ తర్వాత కల్లములో మాలంత మాయము. బోయగే రిలో జాతర ఆనాడు. ధాన్యము కోఠాలు అంటుకొన్నవి. ఎవరూ ఆర్పే దిక్కు లేదు. ఇల్లు దోచుకున్నారు. సాక్ష్యము లేదు. ఇట్లు దినమొక గండము యెంకయ్య యింటివారికి. యెంకయ్య జైలు నుండి వచ్చే వరకు బంగ్లా పోయింది. చిన్న పాత కొంపలో తన వాండ్లు సంసారము చేస్తు న్నారు. ఒకే కాడి. దానికి తగిన భూమి. తక్కినదంతా పోయింది. భార్య ముతుక బట్టలు కట్టుకున్నది. తల్లిదండ్రులు చచ్చి నారు. వకీలు యెంకయ్యకు క్రొత్త దృశ్యము చూచేవరకు పట్టరాని శోకము వచ్చింది. హా! అని మూర్ఛపోయినాడు. మూర్ఛ తెలిసిన తర్వాత- ‘అరే! వకాలకు ఎంత పని చేసిందిరా’ అన్నాడు, మళ్ళీ మూర్ఛపోయినాడు.

నిర్వహణ :

*డా. వేదగిరి రాంబాబు*

తమిళ కథ

-జ్ఞానపీఠ గ్రహీత
జయకాంతన్

# నమ్మకం

అనువాదం : జిల్లేళ్ళ బాలాజీ

"కృష్ణా.. కృష్ణా.. కృష్ణా.." అని పిలుస్తూ, ప్రయాణీకులను ఎగాదిగా చూస్తూ, ఆ బస్సంతా వెదికారు అంబలవానర్. అతను కనిపించకపోవటంతో, బస్ ముందు వైపున్న డోర్ నుండి కిందికి దిగారు. ఆ బస్టాండ్‌లో ఎక్కడైనా కృష్ణన్ కనిపిస్తాడేమోనని నలువైపులా దృష్టి సారించారాయన.

కృష్ణన్ ఎక్కడా కనిపించలేదు!

'ఎక్కడికెళ్ళాడబ్బా? సీటు సంపాదించడానికి ఈ బస్సు లోనేగా ఎక్కాడు? సీటు సంపాదించాక, తన చేతి సంచీని సీటు లోనే వుంచుతానన్నాడే.. నాకోసం ఎక్కడైనా వెదుకుతున్నాడేమో' అనుకుని మళ్ళీ ఆ బస్సులోకే ఎక్కారాయన. తన చేతిసంచీ ఎక్కడైనా కనిపిస్తుందేమోనని మరోసారి ఆ బస్సంతా వెదికారు. చేతి సంచీ కనిపించలేదు, కృష్ణనూ ఎక్కడా కనిపించలేదు.

బస్సు బయలుదేరటానికి సిద్ధమైంది. ఇప్పుడు తను బస్సులో నుంచి దిగాలా? లేక ప్రయాణాన్ని కొనసాగించాలా... ఏ నిర్ణయానికీ రాలేకపోయారు అంబలవానర్. 'పాపం, ఒకవేళ ఆ కుర్రాడు తన చేతి సంచితో... ఎదురుచూస్తుంటే...?' అనే ఆలోచన రాగానే పాలుగారే అతడి ముఖం ఆయనకు మళ్లీ గుర్తొచ్చింది. 'ఇక్కడే ఎక్కడో ఉంటాడు' అనే నమ్మకంతో ఆయన బస్సునుండి కిందికి దిగారు.

పాండిచ్చేరి వెళ్ళే ఆ బస్సు బయలుదేరింది. తర్వాతి బస్సు రావటానికి ఇంకా గంటయినా పడుతుంది.

కాసేపటి క్రితమే ఆ బస్టాండ్‌లో పరిచయమైన కృష్ణన్ ఆయన మదిలో మెదులుతున్నాడు. చూడగానే తనను ఆకట్టుకున్న ఆ పాలుగారే కృష్ణన్ మోమునే గుర్తుచేసుకుంటూ అక్కడే చాలాసేపు వెదికారాయన. 'ఒకవేళ పారిపోయాడా? తనను మోసం చేశాడా? చేతిసంచిని తను పోగొట్టుకున్నాడా? ... ఛఛ... అతడి ముఖాన్ని చూస్తే అలా అనిపించటంలేదు!' అని ఎన్నో రకాలుగా ఆలోచించి, 'ఔను, మోసపోయాం!' అనే నిర్ణయానికి వచ్చాక అంబలవానర్ ఒళ్ళంతా ఒక్కసారిగా చెమటలు పట్టాయి. అంగవస్త్రంతో చెమటను తుడుచుకున్నారు. దూరంగా ఒక చెట్టు నీడన ఉన్న సిమెంట్ బెంచ్ వద్దకు వెళ్ళి ఒంటరిగా కూర్చున్నారు.

'మంచి కుర్రాడు... నా అభిమాని... అని నమ్మాను' మనసులో అలా అనుకోగానే ఆయనకు తనపట్ల ఒక పశ్చాత్తాపం కలిగింది; అవమానంగానూ అనిపించింది; ఏడుపు కూడా వచ్చింది...

తన ప్రస్తుత పరిస్థితి, తన గురించి ఆలోచించేకొద్దీ, 'ఛ, నేను ఏడవకూడదు' అనుకుని తనను తాను నిబ్బరించుకున్నారు. ఆయన బాధంతా.. నాలుగువేల రూపాయల డబ్బు పోగొట్టుకున్నానని కాదు. చిన్నదో పెద్దదో ఒక నమ్మకం చెది

రిపోతున్నప్పుడు మనిషిలో కలిగే ఆ స్పందనకు మాటలు ఉండవు. కొందరికి ఆ అనుభవంలో అసలు జ్ఞానమే నశించి పోతుంది!

'ఇప్పుడు ఏం చెయ్యాలి' అనే ఆలోచనలో పడ్డారు అంబలవానర్.

'సింహం' కలం పేరుతో మేటి రచయితగా, గొప్ప గొప్ప సభలలో ప్రసంగించే ఉపన్యాసకుడిగా, చర్చాగోష్ఠుల్లో న్యాయనిర్ణేతగా ఇలా ఎన్నో రంగాలలో నిష్ణాతులుగా పేరు సంపాదించారాయన. ఎందరో గొప్ప వాళ్ళలో తానూ ఒకడినన్న భావంతో ఠీవిగా తల పైకెత్తుకుని నడవటం ఆయన స్వభావం. ఆయన పేరు వినగానే 'ఎక్కడా? ' అని కుతూహలంగా ఆయనను చూడాలని తహతహలాడే అభిమానులున్నారు. అంతేకాక, ఆయనతో ఒక్కసారైనా మాట్లాడాలని తపించే సాహితీ అభిమానులూ ఎందరో ఉన్నారు. ఎప్పుడూ ఆయన వెంట ఎందరో చుట్టుముట్టి ఉండేవారు. ఆయన చేతి సంచిని ఆయన మోయటమన్నది చాలా అరుదు. దాన్ని మోయటమే తమ భాగ్యంగా తలచే శిష్యులూ ఆయనకున్నారు.

అలాంటి ఆయన సాహితీ మిత్రులు కొందరు.. తమిళనాట పలుచోట్ల అప్పుడప్పుడూ కలుసుకుంటూ సాహితీ సమావేశాలు జరిపేవారు. దాదాపు ప్రతినెలా పౌర్ణమినాడు ఆ సమావేశం జరిగేది. అలాంటి ఒక సమావేశాన్ని పాండిచ్చేరి సముద్రతీరాన ఉన్న 'నీలవోళి'లో ఇవ్వాళ జరుపుతున్నారు. మిత్రులందరూ ముందుగా వెళ్ళి ఆ ఏర్పాట్లలో పడ్డారు. అంబలవానర్‌కు పాండిచ్చేరిలో ఒక సొంత పని కూడా ఉంది. పాండిచ్చేరిలో ఎప్పుడో ఓ మిత్రుని వద్ద చేబదులుగా తీసుకున్న మూడువేల రూపాయలూ.. ఈ సందర్భంగా తీసుకెళ్ళి ఇస్తే సరిపోతుందని భావించి, బ్యాంకుకు వెళ్ళి డబ్బు డ్రా చేసుకొచ్చేసరికి సమయం మించిపోయింది. మామూలుగా తోడువచ్చే కొందరు మిత్రులు ముందస్తు ఏర్పాట్లు కోసం వెళ్ళిపోయారు. 'ఏవుందీ... కొన్ని గంటల ప్రయాణమే కదా... ఒంటరిగా మరో బస్‌లో వెళ్ళొచ్చులే'నన్న ఆలోచనతో బస్టాండ్‌కు రాగానే "అయ్యగారూ, నమస్కారం" అంటూ కాసేపటి క్రితం ఆయనకు ఎదురొచ్చాడు ఆ కృష్ణన్.

అంబలవానర్‌కు అందరూ తెలిసి ఉండే అవకాశం లేదు. కానీ ఆయనెవరో తెలియని వాళ్ళుంటారా?

కృష్ణన్‌కీ ఆయనెవరో తెలుసు. ఆయన రచనలు, అభిప్రాయాలంటే తనకెంతో అభిమానమంటూ తనను తాను పరిచయం చేసుకున్నాడు.

అతడి సుకుమారత్వమూ, సునిశితమైన చూపులూ, పాలుగారే ఆ ముఖమూ.. చూసిన అంబలవానర్.. వెంటనే అతణ్ణి తనుకున్న అసంఖ్యాక అభిమానుల్లో ఒకడిగా అంగీకరించారు.

పాండిచ్చేరి..సాహితీ సమావేశం..మిత్ర బృందం. ఇవన్నీ తెలుసుకున్నాకే, తన సొంత ఊరు పాండిచ్చేరి అని కృష్ణన్ చెప్పి ఉండాలి అని ఇప్పుడు స్ఫురణకు వచ్చింది అంబలవానర్‌కు.

తన పేరు కృష్ణన్ అని అతడు చెప్పటం కూడా అబద్ధమేనా? అని కూడా అనిపించింది. అతను పాండిచ్చేరి నుండి ఏదో పనిబడి ఇక్కడికొచ్చినట్టూ, తిరిగి వెళ్ళటానికి టికెట్ డబ్బులో కొంచెం తగ్గినట్లు ఆ కథనం! ఆయనకూ తనకూ కలిపి పాండిచ్చేరి వరకూ టికెట్ కొంటే, అక్కడికి వెళ్ళగానే ఆ డబ్బును తిరిగి ఇచ్చేస్తానని అతను ప్రాధేయపడ్డ తీరుతో.. మనసు కరిగిపోయింది అంబలవానర్‌కు. "దానిదేముంది తమ్ముడూ! నేనే ఇద్దరికీ టికెట్లు కొంటాలే..." అన్నారప్పుడు. తోడు కోసం, చేతి సంచిని మోయటంకోసం ఎవరి గు

రించో ఎదురుచూడకుండా.. ఒక మనిషి దొరికాడన్న సంతృప్తి కలిగింది ఆయనకు. కలిగినోడికి పట్టిందల్లా బంగారమే కదా!..

"టిక్కెట్లు ఎక్కడ కొనాలి? "

"బస్సులోనే టిక్కెట్టు ఇస్తారు... ఎలాగో గుంపులోకి దూరి మొదట సీటు సంపాదించాలి. ఇక్కడికే బస్సు వచ్చి ఆగుతుంది..." అంటూ అంబలవానర్‌ను కాస్త పక్కకు తీసుకెళ్ళాడు కృష్ణన్. అక్కడున్న ఒక బెంచ్‌మీద చేతి సంచిని ఉంచి, దాన్ని తెరిచి, లోపల కవర్లో ఉన్న కరెన్సీ నోట్లలో ఒకట్రెండు కాగితాలను తీసుకున్నాడు. వాటిని చొక్కా జేబులో పెట్టుకుని, చేతి సంచిని మూసి, దాన్ని కృష్ణన్ చేతికిచ్చాడు అంబలవానర్.

కాసేపటికి బస్సొచ్చింది. ప్రయాణీకులు పొలోమంటూ లోపలికి ఎక్కడానికి ప్రయత్నించారు.

"అయ్యా, తమరు ఇలా కూర్చోండి. నేను వెళ్ళి సీటు సంపాదించి మిమ్మల్ని పిలుస్తాను" అని అంబలవానర్‌ను ఆ సిమెంట్ బెంచ్‌పై కూర్చోపెట్టి చేతి సంచితో సహా గుంపులోకి దూరాడు కృష్ణన్.

'హమ్మయ్య, సాయానికి ఒక మనిషి దొరికాడు. లేకపోయుంటే ఈ గుంపులో దూరి బస్సులో సీటు సంపాదించటం సాధ్యమయ్యే పనేనా? ' అనుకుని స్థిమితపడ్డారు అంబలవానర్.

ఆ పాలుగారే ముఖాన్ని చివరిసారిగా చూడ్డం అప్పుడే...

అరగంటగా అక్కడే, ఆ సిమెంట్ బెంచ్ మీదే కూర్చుండిపోయారు ఆయన. టిక్కెట్టు కోసం తీసి ఉంచిన నూరు రూపాయల నోటు జేబులో ఉంది. చేతి సంచిలో డబ్బుకాక ఇంకేవో వస్తువులు, జత బట్టలూ ఉన్నాయి. ఇప్పటికీ మించిపోయిందేమీ లేదు.. తర్వాతి బస్సు రాగానే అనుకున్న ప్రకారం పాండిచ్చేరి వెళితే సరిపోతుంది. 'ఏంటో... ఉన్నపళంగా బయలుదేరి వచ్చేశాను' అని చెప్పొచ్చు. ఈ అవమానాన్నీ, మోసాన్నీ బయటకు చెప్పి నవ్వులపాలు కాకూడదు' ఇలా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారాయన. ఆయన మనోఫలకం మీద పదేపదే ఆ పాలుగారే మోము దర్శనమిస్తూ, ఆ నమ్మకద్రోహాన్ని గుర్తుకు తెస్తూ ఆయనను నిట్టూర్చేలా చేస్తోంది.

బస్సొచ్చింది. అంగవస్త్రాన్ని విదిలించి భుజమ్మీద వేసుకొని బయలుదేరారు అంబలవానర్.

ఈసారి సాహితీ సమావేశం... నీలవోశిలో... సముద్రతీరాన... ఎంతో విజయవంతంగా ముగిసింది. దాన్ని సమర్థంగా

నిర్వహించిన మిత్రుల ఉత్సాహం, ఉల్లాసంలో పాలుపంచుకోవాలని ఆయనకుంది. అందుకు మనసెంతగా తహతహలాడుతున్నా, మిత్రులు ఆయనను పొగడ్తలతో ముంచెత్తుతున్నా... ఆరోజు మధ్యాహ్నం బస్టాండ్‌లో జరిగిన సంఘటనని ఆయన మరిచిపోలేకపోతున్నారు. పైకిమాత్రం నలుగురితో కలిసి నవ్వుతూ కనిపిస్తున్నారన్నది వాస్తవం.

ఊరికి తిరిగొచ్చిన అంబలవానర్‌ను "సంచీ ఏదీ? " అని అడిగిన భార్యతో "ఊళ్లో మరిచిపోయి వచ్చేశా, తరువాత వస్తున్న మిత్రులు ఎవరైనా తీసుకొస్తార"ని చెప్పి అప్పటికి తప్పించుకున్నారు. కానీ ఆయన కళ్ళముందు పదేపదే కనిపించి నవ్వే ఆ కృష్ణన్ పాలుగారే మోమును ఆయన మరిచిపోలేకపోతున్నారు.

ఒకరోజు అంబలవానర్‌కు కృష్ణన్ నుంచి ఒక ఉత్తరం వచ్చింది.

'అయ్యా,

మీ నమ్మకాన్ని వమ్ముచేశాను. ఆ ద్రోహానికి నన్ను క్షమించండి. నేను మిమ్మల్ని చూసి గొప్పగా భావించడం నిజం. మీ సాయంతో.. మనసు విరిగిపోయి నేను వదిలించుకుని వచ్చేసిన నా తల్లిదండ్రుల వద్దకే తిరిగి వెళ్ళాలని నిర్ణయించుకోవటమూ నూటికి నూరు పాళ్లు నిజం. అయితే మీరు ఎందుకో చేతి సంచీని తెరిచినపుడు అందులోని డబ్బు నన్ను ఒక్క క్షణం మొద్దుబారేలా చేసింది. ఒకరి నమ్మకానికి వ్యతిరేకంగా నడుచుకునే వాళ్ళంతా ద్రోహులు కారని.. మీకు సవినయంగా మనవి చేసుకుంటున్నాను. మీనుండి అపహరించిన ఆ డబ్బు నా భవిష్యత్ జీవితానికి గట్టి పునాది అవుతుందని భావిస్తున్నాను. మీ దుస్తులను మీ జ్ఞాపకార్థం నా వద్దనే భయభక్తులతో, భద్రంగా ఉంచుకున్నాను. నా తల్లిదండ్రుల కష్టమూ, ఆర్జితంతో పెరిగాను నేను. కానీ వాళ్ళకు ఏ రకంగానూ ఉపయోగపడలేకపోతున్నానన్న విరక్తితో, ఇల్లూ ఊరూ వదలి వచ్చేశాను. వాళ్లు నన్ను ఒక నమ్మకద్రోహిగా భావించి శపించే ఉంటారు. కానీ నేను వాళ్ళకు కృతజ్ఞతతో నమస్కరిస్తున్నాను. అలా నమస్కరించతగ్గ వ్యక్తుల జాబితాలో మీకే ప్రథమ స్థానాన్ని ఇచ్చాను. నన్ను ఆశీర్వదించండి. ఏదో ఒకరోజు మీ చేతి సంచీతో సహా వస్తాను. మీ నుండి తీసుకున్న అప్పుకి పలురెట్లు తీసుకొచ్చి ఇస్తాను. నన్ను నమ్మండి. ఇలా రాస్తే నా తల్లిదండ్రులకు అర్థంకాదు, మీ గొప్ప మనసుకు అర్థమవుతుందని నమ్ముతున్నాను. తస్కరణ గురించి తెలిసిన ఆ క్షణంలో మీ మనసు ఎంతగానో తల్లడిల్లిపోయి ఉంటుంది. అది గ్రహించి నేను పడ్డ మనోవేదన ఎవరు అర్థం చేసుకోగలరు?

ఎప్పటికీ కృతజ్ఞతలతో

కృష్ణన్

అంబలవానర్ కళ్ళు చెమ్మగిల్లాయి. ముఖంలో వెలుగు వచ్చింది. తనను తానే మరిచిపోయి గొంతెత్తి పాడారు 'పాలుగారే మోము కనులముందు కదలాడె, పసిడి పూదోటలో మనసు పరవశించె... కృష్ణా!'

అంబలవానర్‌కు ఉత్సాహం పొంగుకొచ్చింది. ఉండదా మరి? ... ఆయన ఊహల్లో ఒక కథ రూపుదిద్దుకుంది. V

తెలుగు కథ

- ఎ.వి. రెడ్డిశాస్త్రి



# పడవ ప్రయాణం

**చా**లా ముఖ్యమయిన ప్రయాణం. వ్యవహారాన్ని ముగించుకుని తొందరగా బయల్దేరాలని ఎంత హడావుడిపడ్డా కుదర్లేదు. బాగా ఆలస్యమైంది. నది దగ్గరకి చేరుకునేసరికి, సాయంకాలం అయింది. నది చాలా పెద్దది. ఒడ్డు కనిపించడమే లేదు. ఇలాంటి సమయంలో నదిని దాటి ఆ ఒడ్డు చేరుకోవాలి. ఆతృతతో అటూ యిటూ చూశాను, పడవ కనిపిస్తుందేమో నని. కనుచూపు మేరలో ఒక్క పడవ వాడూ కనిపించటంలేదు. 'సాయంకాలం అయిపోయింది కదా ఇంకెవరు వస్తారు' అని పడవలవాళ్లంతా ఇళ్లకి వెళ్లిపోయిన ట్టున్నారు. నాది తప్పనిసరి ప్రయాణం.. ఏం చెయ్యడానికీ తోచడంలేదు.

ఇంతలో దూరంలో ఎవరో వ్యక్తి కూర్చు న్నట్టు అనిపించింది. పడవవాడేనేమో అని గబగబ నడిచి వెళ్లేను. పడవవాడే అయి వుండాలి.. అతని పక్కన ఓ చిన్న పడవ వుంది కనక. అయితే మామూలుగా పడవలు నడిపేవాళ్లలా లేడు. బాగా ముసలి వాడు. వెండి దారంతో చేసినట్టుగా తెల్లగా మెరిసిపోతూ గెడ్డం. ఆలోచన నిండినట్లు గా విశాలమైన కళ్లు. అస్తమిస్తున్న సూర్యు డికెదురుగా ధ్యానముద్రలో కూర్చొని వు న్నాడు. బెస్తవాడే కావచ్చు కానీ ఒక యోగిలా కనిపిస్తున్నాడు.

అతని ధ్యానాన్ని భంగం చెయ్యడానికి వెనకాడేను చాలా సేపు. కానీ నాది తొంద ర పని. అతన్ని పలకరించక తప్పలేదు. మామూలు పడవ వాళ్లెవరయినా అయితే 'ఏమోయ్' అని పలకరించేద్దును. కానీ ఇతనేమో యోగిలా కనిపిస్తున్నాడు. అంచేత ఇతన్ని ఎలా పలకరించాలి? చివ రకి ధైర్యంచేసి "అయ్యా, తమరెవరో నాకు తెలీడంలేదు. పడవ ఇక్కడ వుంది కనుక, నావికులే అనుకుంటున్నాను. నాకు చాలా తొందరపని వుంది..నదికి అవతల ఒడ్డున. నదిని దాటించే నావికులు దొరు కుతారా? " అన్నాను వినయంగా.

"అయ్యో.. అదెంత భాగ్యం! ప్రయాణీ కుల్ని నది దాటించేవాణ్ణే నేను. సాయంత్రం అయిపోతోంది కదా.. ఈ సమయంలో ఈ మహానదిని దాటడానికి ఎవరు వస్తార్లే అని ఇక్కడ కూర్చుని.. అస్తమిస్తున్న సూర్యుడ్ని చూస్తున్నాను. నా అస్తమయానికి పిలుపుని ఎప్పుడు పంపి స్తావు ప్రభూ అని వినయంగా అడుగుతు న్నాను. ఇంతలో మీ పిలుపు వినబడింది. పదండి, నదిని దాటిస్తాను" అన్నాడు అత గాడు చిరునవ్వుతో. అతని నవ్వులో, అతని చూపులో, అతని మాటలో దయ, కృప, ప్రేమ వర్షిస్తున్నట్టుగా అనిపించింది. నన్ను నేను మరిచిపోయేను క్షణకాలం.

పడవ తాళ్లు విప్పుతూ తనలో అనుకుం టున్నట్టు "ఇలాటి సంధ్యా సమయంలో కూడా ఒకర్ని నది దాటించగలగడం ఎంత అదృష్టం" అని బయటికే అన్నాడు.

పడవ బయల్దేరింది. ఒడ్డు క్రమేపీ దూరం అవుతోంది. ముసలి నావికుడు నావైపు చిరునవ్వుతో చూస్తూ "ఎక్క డ్నుంచి వస్తున్నారు? " అనడిగేడు.

"ఆ కనిపిస్తోంది చూడండి.. అదేదో వూరు.. అక్కడ్నుంచి వస్తున్నాను"



"వూరి పేరూ, భోగట్టా తెలియవా? "

"ఎప్పుడూ వూపిరి సలపని పన్లో వుంటాను. అంచేత ఏనాడూ ఆ వూరి పేరేమిటి, ఆ వూరి వ్యవహారాలేవిటీ అన్నది తెలుసుకోడానిక్కూడా నాకు వీలు పడలేదు"

"అవును, మీరు చెప్పింది నిజమే. నిత్య వ్యవహారాల్లో మునిగి తేలుతూ, ఒక్కొక్క ప్పుడు ముఖ్యమైన వాటి గురించి తెలుసు కోడానిక్కూడా వీలుపడదు"

"మీ మాటలు వింటుంటే నాకనిపి స్తోంది.. నేను పొరపాటు చేశానా అని. నేను వున్న వూరు పేరేవిటి, ఇక్కడ వ్యవ హారాలేవిటి...ఏదీ తెలుసుకోలేకపో యాను. సరే పోనివ్వండి.. కాస్త ఆల స్యంగా తెలుసుకున్నా ఫర్వాలేదు కదా! మనం బయల్దేరిన వూరి వివరాలు మీకు తెలిసివుంటాయి.. నాకు చెప్పండి.. ప్రయాణం ఎలాగూ నిదానంగా సాగు తోంది కనక"

"నాకు తెలిస్తే కదా..మీకు చెప్పడానికి? నాకూ తెలీదు"

"మీకూ తెలీదా? ఆశ్చర్యంగా వుందే.. మీరు చూస్తే పెద్దగా పని ఒత్తిడి ఏదీ వున్నవాళ్లలా కనిపించడంలేదు. ఎన్నో సంవత్సరాల్నుండీ ఇక్కడే వుండివుంటారు. అంచేత ఆ వూరి భోగట్టాలు మీకు తెలిసి వుంటాయని అనుకున్నాను" అన్నాను.

"మీరన్నది నిజమే. నేనిక్కడే పుట్టి పెరిగాను. ఇప్పటిదాకా ఇక్కడే గడిచింది కాలం. పరిస్థితులు బాగులేక చిన్నప్పటి నుండీ పడవ నడపవలసి వచ్చింది. ఆ వయసులో నా దృష్టల్లా ప్రయాణికుల్ని ఎలా జాగ్రత్తగా ఇవతల ఒడ్డునుంచి అవతల ఒడ్డుకి చేర్చడమా అన్నదానిమీదే వుండేది. పడవలో ప్రయాణం చేసే మనుషుల వివరాలు తెలుసుకోవడంమీద నా దృష్టి వుంటే కదా! నా దృష్టల్లా.. పడవ చూస్తే చిన్నది, నేను చిన్నవాడ్ని, నది చాలా పెద్దది.. వీళ్లందర్నీ ఎలా అవతల ఒడ్డుకి చేర్చగలను బాబూ అన్న దానిమీదే వుండేది. తీరా అవతలి ఒడ్డుకి చేరుకోగానే 'అమ్మయ్య, వీళ్లని ఒడ్డుకు చేర్చాను' అన్న ఆనందంతో మనసు నిండిపోయేది కానీ వాళ్ళు ఎవరు, ఎంత బాడుగ ఇచ్చారు అన్నది కూడా గమనించలేకపోయేవాడ్ని. అదేమి చోద్యమో కానీ నాకొచ్చే బాడుగ, నా అవసరాలు పోగా యింకా కొంచెం మిగుల్తూనే వుండేది. రోజుక్కావలసిన భత్యం డబ్బులు కూడా దొరకని తోటి పడవవాళ్లు నా దగ్గరకొచ్చి కొంచెం కొంచెం డబ్బులు తీసుకుంటుండేవారు. మీరెంత తీసుకుంటున్నారు, నాకెప్పుడు బదులు తీరుస్తారు అని నేనెన్నడూ అడిగేవాడ్ని కాను. అంచేత క్రమేపీ వాళ్లకి ఎలాంటి అభిప్రాయం వచ్చేసిందంటే.. తండ్రి దగ్గర్నుండి కొడుకు అడక్కుండానే తీసుకుంటుంటాడు చూడండి.. అలాగన్న మాట. ఇలాగ పొద్దుపొడిచినప్పట్నుండి పొద్దుకుంకేదాకా మనుషుల్ని ఆ ఒడ్డు నుండి ఈ ఒడ్డుకి చేరుస్తుండడంలోనే ఇన్నేళ్లు గడిచిపోయాయి. ఈ వ్యాపకంలో పడి మనుషుల పేర్లు, వాళ్ల జీవితాలు తెలుసుకోలేకపోయాను. వయసు పైబడిపోయింతర్వాత దేని గురించీ తెలుసుకోవాలనే కోరిక లేకుండా పోయింది. ఏం తెలుసుకొని మాత్రం మనమేం చెయ్యగలం అనే భావం వచ్చేసింది"

"అయితే కేవలం మనుషుల్ని ఇవతల ఒడ్డునుంచి అవతల ఒడ్డుకి చేరుస్తూ వుండడమే పనిగా పెట్టుకున్నారన్నమాట. మరే వ్యాపకం లేదా? "

"మనుషుల్ని ఇవతల ఒడ్డునుంచి అవతల ఒడ్డుకి చేర్చడం చిన్న పనేం కాదు కదా! నది చూశారా ఎంత విశాలంగా వుందో! ఇంత పెద్ద ప్రవాహంలో బయల్దేరడమే మన వంతు. ఈ చిన్న పడవ ఎక్కడికి కొట్టుకుపోతుందో, ఎక్కడికి మనని చేరుస్తుందో చెప్పడం కష్టం. నా చేతిలో పడవ నడిపే తెడ్డు వుంది నిజమే. కానీ యింత బలంగా పరుగెడుతున్న నీళ్ల ముందు ఈ కఱ్ఱ తెడ్డు ఏపాటి? నా తెడ్డుతో నేను పడవని నడిపేస్తున్నానని ముందురోజుల్లో అనుకునేవాడ్ని. కానీ అది నిజం కాదని క్రమేపీ బోధపడింది. పడవని నడిపించేది నదే. అప్పట్నుండే.. నా పని నేను చేస్తున్నాను, మిగిలిన సంగతి నదే చూస్కుంటుంది అని వూరుకున్నాను. ప్రయాణాల్లో ఎన్నో చికాకులు వచ్చేయి. నది మధ్యలో వుండగా తుపాన్లు వచ్చేయి. పడవ ఒక్కొక్కప్పుడు సుడిగుండాల్లో చిక్కుకుపోయేది. నిబ్బరంతో పడవెక్కిన ప్రయాణీకులు.. మధ్యలోనే వాళ్ల ప్రయాణం ముగిసిపోయినందుకు గోల పెట్టేస్తుండే వాళ్లు."

"అయితే, వాళ్ల గోలని మీరేమీ పట్టించుకునేవారు కాదా? ఎన్నోమార్లు పడవ మునిగిపోయిందంటున్నారు, మరి మీకేం కాలేదా? "

"అదే విచిత్రం.. నేను ఏనాడూ మునిగి

పోలేదు. అందరితోపాటుగా నేను కూడా మునిగిపోతున్నప్పుడు కూడా నేనేనాడూ గోలపెట్టలేదు..మునిగిపోతున్నందుకు. నా ప్రాణాల్ని రక్షించుకోడానికి ఈదడంలాంటి ప్రయత్నం కూడా నేనెన్నడూ చెయ్యలేదు. అందరు మునిగిపోతూవుంటే, నేనెందుకు ప్రయత్నం చెయ్యాలి ఈ ప్రాణం నిలబెట్టు కోడం కోసం.. అని అలా వుండిపోయే వాడ్ని. మరి ఈ నదికి నామీద ఎందుకు కనికరం పుట్టేదో ఏమిటో.. నేను అందరి తోపాటు మునిగిపోడానికి సంసిద్ధతని కన పరచినా, నన్ను మాత్రం ఎందుకో ఒడ్డుకు చేర్చేది ఈ నది. నాలాగే నా పడవ కూడా ఎక్కడో ఒడ్డుకు చేరి, నా కోసం వేచివున్నదాన్లా వుండేది!"

"అంతమంది హాహాకారాలు చేస్తూ మునిగిపోతుండడం చూశాక మీకేమీ అని పించేది కాదా? "

"ఎందుకు అనిపించేది కాదు? నేనే వారందరి చావుకీ కారణం అనిపించి కుమిలిపోయేవాడ్ని. క్రమేపీ అర్థం అయింది..నేను కారణం కాదు ఆ చావు లకి.. అని. నదిదే ఆ బాధ్యతంతా. నమ్మి ప్రయాణం చేస్తున్నాం. అది ఒడ్డుకి చేరు స్తుంది. ఒక్కొక్కప్పుడు చేరనివ్వదు. దీం తో నాకు ఒకలాంటి భావం వచ్చేసింది. అప్పట్నుండీ ప్రయాణీకులు మునిగిపో తున్నా, తేలిపోతున్నా చూస్తూ వుండడమే తప్ప విచారపడ్డం మానుకున్నాను"

"చాలా ధైర్యం కావాలి.. మీలా గుండెని దిట్టంచేస్కోడానికి. మరో విషయం..ఎంత మందినో అవతల ఒడ్డుకి చేరుస్తున్నారు కదా.. అవతల ఒడ్డున ఏ వూరుందో ఏమేనా తెలుసునా? "

ముసలాయన నవ్వేడు. నవ్వి "నేను పుట్టి పెరిగిన యివతల ఒడ్డు గురించే తెలీదు. అలాంటప్పుడు అవతల వొడ్డున ఏముందో ఎలా తెలుస్తుంది? " అన్నాడు.

"తెలిసిందల్లా ఈ ప్రయాణమేనన్న మాట!"

"ఇవతల ఒడ్డు, అవతల ఒడ్డు.. మధ్యన నది, ఈ మహానదిలో ప్రయాణం. అంతే నాకు తెలిసిందల్లా"

ఇద్దరం కాసేపు మౌనంగా వున్నాం. ఈసారి ముసలాయనే అన్నాడు "యిన్ని ప్రశ్నలు వేశారు కదా..మీకు తెలుసునా అవతల ఒడ్డున వున్న వూరేదో? "

"అదే అనుకుంటున్నాను..నాకూ తెలీదు. కాస్త వేళ వుండగానే అవతల ఒడ్డుకి చేరితే, ఎవర్నేనా అడిగి నాకు కావ లసిన మనిషియింటికి చేరుకోగలిగే వాడ్నేమో. తీరా సగం దూరం వచ్చేక, మీ మాటలు విన్నాక అంతా అగమ్యగోచ రంగా కనిపిస్తోంది. చీకట్లో ప్రయాణం.. ఏ ఒడ్డుకి చేరతానో తెలీదు. చేరింతర్వాత ఎక్కడికి వెళ్లాలో తెలీదు ఈ చీకట్లో"

"అయ్యో! ఎంతపని చేశారు! ప్రయాణ వివరాలన్నీ వెలుతురుండగానే తేల్చుకుని బయల్దేరి వుండవలసింది"

"అదే! కానీ యిప్పుడు విచారించి ఏం లాభం? దేనిగురించీ ఆలోచించుకోడానికే అవలేదు. యిదిగో, యిలాగ చీకట్లో ప్రయాణం చెయ్యవలసి వస్తోంది"

ఆ తరవాత మరి సంభాషణ కొనసాగ లేదు.

చీకట్లో మహానదిలో పడవ సాగు తోంది. అందులో యిద్దరే వ్యక్తులు. ఒకరు పడవలో ప్రయాణం చేస్తున్న వ్యక్తి. మరొకరు పడవ నడిపే వ్యక్తి.

బ్రిటన్ కథ

-రిచర్డ్ హ్యూజ్

# పోలీసు న్యాయం

అనువాదం : ఎమ్.వి.వి. సత్యనారాయణ

అతడు నన్ను చాలా సులువుగా చంపేశాడు! చెప్పులు కుట్టడానికి ఉపయోగించే బరువైన ఇనుపస్టాండ్‌తో తలమీద బాది చంపేశాడు. ఫట్‌మన్న ఒక్కటే చప్పుడు. దేవుడా! నేనెంత అమాయకురాలిని!

మొదటి దెబ్బతోనే అతడిమీద నాకున్న అసహ్యమంతా మాయమైపోయింది. అతడ్ని వేరే మహిళతో కలిసి ఉండగా చూశాను. అప్పుడే నాలో అతడిపట్ల అంతులేని ద్వేషం రగిలింది. అదే ఇప్పుడు మాయమైపోయింది.

నా నెత్తిమీద మరో దెబ్బవేశాడు. అంతే, నాలోంచి సమస్తమూ ఎటో వెళ్లిపోయింది.

నేను సున్నితమైన ఆడదాన్ని. వయస్సులో ఉన్న అందగత్తెను. వెన్నెల్లో మెరిసే పాలరాతి బొమ్మను. అలాంటి బొమ్మ అతడి చేతిలో ప్రాణం కోల్పోయింది!

అతడు నావైపే చూస్తూ నిలబడ్డాడు. ఆ చూపు అదో రకంగా ఉంది. నాకప్పుడే ఒక ఆలోచన కలిగింది. అతడ్ని వెంటాడాలి, ఏడిపించాలి. బతికినంత కాలం దెయ్యాలంటే భయపడి చచ్చేదాన్ని. ఇప్పుడు నేనే దెయ్యంగా మారిపోయాను. అందువల్లే ఇప్పుడు ఒక దెయ్యంగా ఆలోచిస్తున్నాను!

అతడెప్పుడూ దెయ్యాలను నమ్మలేదు. అలాంటివి లేవనేవాడు.

'లేవా! ఎందుకు లేవూ! అందుకే అతడికి బుద్ధి చెబుతాను. ఆ అవసరముంది కూడా'

జాక్ నిలబడ్డాడు, తనముందు కనిపించే దృశ్యాన్ని తేరిపార చూస్తూ. అతడు నాకు స్పష్టంగా అర్థమవుతున్నాడు. మరింత స్పష్టంగా అర్థమయ్యేకొద్దీ ద్వేషం, అసహ్యం నాకు అతడిమీద తిరిగి కలిగాయి.

అతడి మొహానికి నా మొహాన్ని తాకించాను. అతడికి నా మొహం చూసినట్టే తోచడంలేదు. తేరిపార చూస్తున్నాడు. తరువాత ముందుకు నడవసాగాడు, అచ్చంగా నాలోంచి నడిచిపోతున్నట్టు. నాలో నాకే తెలియని భయం కలిగింది. 'ఏమిటిది చిన్నపిల్లలా? అతడి కండరాలూ, ఎముకలూ, రక్తం నన్ను కలవరపెడ్తున్నాయి. భయం తనకి తానుగా ఇక ఎలాంటి ప్రభావం చూపదేమో! అయితేనేం! అతడిమీద ద్వేషాన్ని, అసహ్యాన్ని అతడికే తిరిగి ఇచ్చెయ్యాలి. భయం ఎలా వుంటుందో అతడికి నేర్పాలి'

పక్కకి తప్పుకొని దారి ఇచ్చాను. అప్పుడు గుర్తొచ్చింది, అతడికి నేను అడ్డం కాదు. వీధుల్లోకి చెట్ల నీడన సాగిపోతున్నాడతడు. తేరుకొని అతడ్ని అనుసరించి బయల్దేరాను. నానుండి తప్పించుకోలేడని తెలుసు. అతడితో నాకేమిటో విడదీయరాని బంధం ఉంది. అదే నేను అతడిని వెంటాడేలా చేస్తోంది.

ఎగువ వీధివైపు నడిచాడతడు. అక్కడి నుంచి పక్క వీధిలోకి ప్రవేశించాడు. అక్కడంతా చెట్ల నీడతో నిండి ఉంది. అయినప్పటికీ అతడ్ని ఎంతో స్పష్టంగా చూస్తున్నాను, పట్టపగలు చూసినంతగా!

నా ధైర్యం నాకు తిరిగివచ్చింది. వేగం



పెంచి అతడికంటే ముందు కదులుతున్నాను. అతడెన్ని మలుపులు తిరిగినా నాకంటే వెనకబడుతూనే వున్నాడు. నా చేతులు అతడివైపు ఊపుతున్నాను. నేను గతంలోనే విన్నాను, దెయ్యాలు మూలుగు శబ్దాలు చేస్తాయట! నేను కూడా అదే రకంగా మూలుగుతున్నాను.

అతడు చిన్నగా నవ్వాడు. ఆ నవ్వులో తృప్తి కనిపించింది. అయినప్పటికీ నన్ను స్పష్టంగా చూడలేకపోతున్నాడు. 'దెయ్యాల ఉనికిని నమ్మకపోవడం మూలంగానే నన్ను చూడలేకపోతున్నాడా?' నా చిన్ని పళ్లలోంచి 'హు!' అంటూ మూలిగాను. "అడుగో, అతనే హంతకుడు!" అరిచాను.

వీధిలో ఒక ఇంటి పైకిటికీ తెరచుకుంది. "ఎవరది?" ఆమె ఎవరోకానీ వీధిలోకి అరిచింది. "ఏమిటి సంగతి?" అని కూడా అంది.

'అంటే నా అరుపు ఎవరికో వినిపించినట్టే కదూ! ఏమైతేనేం! మంచే జరిగింది'. తర్వాత మౌనంలోకి జారుకున్నాను. అతడికి దారి వదలకూడదని నిర్ణయించుకున్నాను.

అతడు ముందుకే నడుస్తున్నాడు. తనలో తానే నవ్వుకుంటున్నాడు.

'అతడిలో అంతరాత్మ అనేది లేదు. సరికొత్తగా నన్ను హత్య చేశాడు. ఎంత సునాయాసంగా ఒక ఆడదాన్ని హత్య చేశాడు! అతడ్ని సులువుగా వదులుతానా?'

హఠాత్తుగా నేను దెయ్యంగా కావడమేమిటో.. అర్థం కాని వ్యవహారం. అరె, పది నిమిషాల క్రితం నేను ప్రాణాలతో హాయిగా ఉన్న దాన్నే కదా! ఇప్పుడు గాల్లో తేలిపోతున్నాను. గాలి స్వచ్ఛంగా ఉంది. నా రెండు భుజాల మధ్య సుకుమారంగా తగులుతోంది. నవ్వు వస్తోంది. ఎప్పటిలాగానే మనస్ఫూర్తిగా నవ్వాను. తలచుకుంటే నాకే విచిత్రంగా ఉంది.

జాక్ నా నవ్వును విన్నాడేమో! కాదు, కాదు.. అతడు పక్క వీధిలోకి తిరిగాడు. ఆ వీధిలో చెట్లన్నీ ఆకులు రాల్చే చెట్లే! ఏం చెయ్యాలో నాకు ఇప్పుడు అర్థమైంది. రాలిన ఆకులను కుప్పగా ఒకచోట చేర్చాను, అచ్చంగా గాలి మాదిరిగా. ఆకులు జాన్‌ను వెంటాడుతున్నాయి. అంచులన్నిటినీ వేళ్ల మాదిరిగా సాచి మరీ వెంటాడుతున్నాయి.

గరాటు తిప్పినట్టు జాక్ ఆకులను తన పాదంతో తిప్పాడు. తిప్పుతూనే ముందుకు సాగిపోతున్నాడు. నేను కూడా వెంటాడుతున్నాను. చెప్పాను కదా! అతడికీ నాకూ మధ్య ఏదో బంధం కొనసాగుతోందని!

ఒకసారి అతడు వెనక్కి తిరిగి నన్ను చూశాడు. గుర్తుపట్టినట్లు అనిపించింది. అతడి మొహంలో అలాంటి భావం కనిపించింది. అతడు నన్ను గుర్తుపట్టాడు?

అయితే ఆ మొహంలో భయంలేదేం? విజయోత్సాహం మాత్రమే ఉంది.

'చాలా సంతోషం మగడా! నన్ను చంపేశావ్! నీ దుఃఖాన్ని నేనూ చూస్తాను కదా!' అనుకున్నాను. కానీ.. ఒకే ఒక భావన నన్ను బలహీనురాల్ని చేసింది. సంప్రదాయబద్ధమైన క్రైస్తవురాలిని. చని పోయి పావుగంట మాత్రమే అయ్యింది. అయినప్పటికీ ఇంకా పగ, ప్రతీకారం ఎలా తీర్చుకోవాలా అని ఆలోచిస్తున్నాను. నా ప్రభువును కలుసుకోవాలనే భావన పక్కకి పెట్టి ఇదంతా ఆలోచిస్తున్నాను.

నా లోపల్నించి గొంతు వినిపిస్తోంది. 'అతడ్ని విడిచిపెట్టెయ్యి తల్లీ! ఇంకా ఆలస్యం చెయ్యక! అతడ్ని క్షమించెయ్!'

ఇంకా ఆలస్యమా! నేను వదలాలనుకున్నప్పుడే వదులుతాను. దెయ్యాలకు వెంటాడే స్వతంత్రం ఉంటుంది. అవును కదా!

మరో ప్రయత్నం చేసి అతడ్ని భయపెడతాను. ఆ తర్వాతే క్షమిస్తాను. స్వర్గం చేరడం గురించి ఆలోచిస్తాను.

అతడు ఆగి పక్కకు తిరిగాడు. నా మొహంలోకి మొహంపెట్టాడు. నా రెండు చేతులూ అతడికి గురిపెట్టాను.

"జాక్!" అరిచాను. "జాక్! నువ్వక్కడే నిలబడు. నీ పెదవిపై నవ్వు అలాగే ఉంచరా! చేప కళ్ల లాంటి నీ కళ్లను అలాగే తెరిపార చూడనియ్యి. నువ్వు గెలిచాననుకుంటున్నావ్ కదూ! లేదు. నేను నిన్నేం చెయ్యాలో అదే చేస్తాను. నీ పని అయిపోయినట్టే! నీ పని..." ఆగాను.

చిన్నగా నవ్వుకున్నాను.

కిటికీలు టపటప తెరుచుకుంటున్నాయి. ఏం జరుగుతోందిక్కడ? రొద గాలి ఏమిటి? ఎవరక్కడ? మాటలు వినిపిస్తున్నాయి.

'అతడ్ని వదలిపెట్టేయ్ తల్లీ! ఎందుకాలస్యం!'

అంతరాత్మ ఘోష! అదన్నమాట విషయం. అతడి రహస్యం బయటపడకుండానే వదిలిపెట్టెయ్యాలా? ప్రతీకారం తీర్చుకోవద్దా? నా ఆత్మను బలిపెట్టాడతడు?

'అయినా సరే క్షమించెయ్యాలా? భలే బాగుందే! అలాగే వదిలిపెట్టేదాన్నే! అతడ్ని వదలిపెట్టి సరాసరి స్వర్గానికి వెళ్లిపోవచ్చు కూడా! మరో సంఘటన జరగకముందే వెళ్లి పోవాలి కూడానూ'

నా రెండు చేతులూ బార్లా చాపాను. వాటిని గాల్లోకి వూపాలని ప్రయత్నించా, తేలిపోవాలనుకున్నా. ఏదో శక్తి అడ్డు కుంది. బలంగా అటకాయించింది. ఇంకా అతడిని ఏదో చెయ్యాలని.. నాలో అదే శక్తి ఆరాటపెడుతోంది. వీధిలో అతడ్ని వెంటా డుతున్నాను, నా ప్రమేయం లేకుండానే!

చాలామంది వ్యక్తులు ఇంకా నేను బతికే వున్నానుకుంటారు. కానీ నేను గాయాలతో మరణించాను, అతడి చేతిలో హతమ య్యాను. 'అసలు అతడికి నేనంటే భయం దేనికి? నన్ను ఎందుకు హత్య చెయ్యాలి? ఇప్పుడు నా రూపం చూసి కూడా తను ఎందుకు భయపడటంలేదు? '

నన్ను చూడలేదు అతడు! నాకు ఇంకా సందేహమే. అతడెటో పోతున్నాడు. జనం లేని రహదారినే ఎందుకు ఎంచుకున్నాడు? ఎంత దూరం వెళ్లిపోతాడతడు?

అదిగో భవనంమీద నీలం రంగు దీపం కనిపిస్తోంది. అవును.. అది పోలీస్‌స్టేషన్.

'ఓ ప్రభువా! నేను జయించాను. నా ప్రభువా! అతడు పోలీసులకు లొంగిపోతు న్నాడు. నేనే గెల్చాను!' గంతులేశాను.

'నువ్వా అతడ్ని తరిమింది? ' అంతరాత్మ ప్రశ్నించింది. 'నువ్వు శుద్ధ మూర్ఖురాలివి. అతడు నిన్ను చూడలేదనుకుంటున్నావా? అసలు అతడినుండి నువ్వేం ఆశిస్తున్నావ్? నువ్వంటే అతడికి వణుకు పుడుతోందను కుంటున్నావా? తను గడగడలాడుతు న్నాడా? తను పిరికివాడనుకుంటున్నావా? తన చావు నీ చేతుల్లో ఉందా? ఎంత మూర్ఖురాలివే!'

"నేను చెయ్యలేదు, చెయ్యలేదు" అరిచాను. "అతడికి నేనెలాంటి కీడూ తల పెట్టలేదు. ఎప్పుడూ లేదు. నిజంగా అతడ్ని బాధపెట్టలేదు. జాక్! నావైపు అలా చూడకురా! ఇంకా తగినంత సమయ ముంది.." అరిచాను.

పోలీస్‌స్టేషన్ ద్వారంలో నిలబడ్డాడు జాక్. అక్కడ్నుంచి నావైపు చూస్తున్నాడు. ఓ పోలీసు కానిస్టేబుల్ బయటికి వచ్చాడు. ఒకడి తర్వాత ఒకడుగా వాళ్లంతా వచ్చి అతడి చుట్టూ దడికట్టారు. అతడు తప్పించుకోలేడు

"అరె! జాక్!" నా గొంతు గద్గదమ య్యింది. "నన్ను క్షమించు. ఇలా చెయ్యా లనుకోలేదు నేను. కేవలం అసూయా ద్వే షాల వల్ల మాత్రమే ఈ రకంగా ప్రవర్తిం చాను. నిజానికి నిన్ను ప్రేమిస్తున్నాను'

అయినప్పటికీ పోలీసులకు అతడి ధ్యాసే లేదు. వాళ్లలోంచి ఒక గొంతు గుసగుసలాడింది. "అదిగో.. ఆమె..!"

"అవును. సుత్తితో కాబోలు అతడి తల పగలగొట్టింది. మెదడు ఇవతలికొచ్చింది. దేవుడా! ఆమె మొహం ఎంత కిరాతకంగా ఉంది, ఎవరో తరుముతున్నట్లు ఉంది" అంది రెండో గొంతు.

"ఆమె మొహం చూడండి. నిర్భాగ్యు రాలు! సుత్తితో తన తల పగలగొట్టుకున్న ట్టుంది. ఎంత ఘోరం? " పోలీస్ అధికారి ముందుకొచ్చాడు. 'నువ్వేం చెప్పినా అది నీకు వ్యతిరేకంగా ఉపయోగించాల్సి వ స్తుంది' అన్నాడాయన.

"జాక్!" మృదువుగా పిలిచాను. చేతులు చాపాను. అతడి మొహం తడిమాను.

"అమ్మా మేరీమాతా! పవిత్ర మాతా!" ఒక పోలీస్ కానిస్టేబుల్ ప్రార్థించాడు. తన గుండెలమీద శిలువను తాకినట్లు అభి నయించి "ఆమె అతడ్ని చూస్తోంది" అన్నాడు.

మరొకడు గుసగుసలాడాడు. "ఆమెను ఉరితియ్యరు. ఇప్పుడామె పరిస్థితి ఎంత దయనీయమో గమనించారా? " V




## అనువాదం : పాలకోడేటి కృష్ణమూర్తి

అదొక క్రీడాకారుల ఆసుపత్రి. అక్కడ చికిత్స పొందుతున్న క్రీడాకారుల మధ్య వాడిగా వేడిగా చర్చ సాగుతోంది. చర్చగా మొదలైన వాదన ఎంతగా వేడెక్కిందంటే దాని ఉష్ణోగ్రత నలభై డిగ్రీల సెంటీగ్రేడ్‌కు చేరుకుంది.

"నేనిప్పటికీ ఆ మాటే అంటాను. బాక్సింగ్ క్రీడ మరీ దారుణం. దెబ్బకు దెబ్బ తీసే ఆట. ప్రత్యర్థిమీద ముష్టిఘాతాలు కురిపించినప్పుడు ఆ గట్టి దెబ్బలకి వాడి పరిస్థితి ఎంత ఘోరంగా ఉంటుందో మీరు ఊహించలేరు". ఆవేశంగా అన్నాడు పోల్ వాల్ట్ (ఎగిరే క్రీడ) ఛాంపియన్.

"ఓ ఛాంపియన్ మహాశయా! ఉద్రేకపడకండి, మీ చేతులకి, కాళ్లకి వేసిన ప్లాస్టరు ఊడిపోగలదు..డాక్టరుగారు కోప్పడతారు" హెచ్చరించింది నర్స్.

"లేదు..లేదు. నేను వీళ్లందరికీ చెప్పదల్చుకున్నదేమిటంటే.."

"ఏం చెప్పాలనుకుంటున్నావు? .."

వెన్నెముక కీలు పట్టుతప్పడంతో దాన్ని సరిచేయించుకుని ఆసరాగా నడుముకు పట్టీ కట్టుకుని ఉన్న 'ఈత' ఛాంపియన్ కలగజేసుకుంటూ "నువ్వు ఎవరి తలమీదైనా పిడిగుద్దులు కురిపించినపుడు తల పగుల్తుందని అందరికీ తెలుసు" అన్నాడు.

ఆ మాటలు వినడంతోటే మోకాలి ఎముక విరిగి చికిత్స పొందుతున్న ఫుట్‌బాల్ గోల్‌కీపర్ బరువుగా నిట్టూర్పు విడిచాడు.

సెంటర్ ఫార్వర్డ్‌తో తలపడిన కారణంగా అతని కాలి బూటు ముఖానికి తాకడంతో చిన్నదెబ్బ తగిలింది. ఆ చిన్న దెబ్బకే అతని దవడ పళ్ళు బయటపడ్డాయి. అతను మాట్లాడలేని పరిస్థితిలో గురగురమనే శబ్దం మాత్రం చేశాడు.

ఇంతలో సైక్లింగ్ ఛాంపియన్ కలగజేసుకుని "బాక్సింగ్ క్రీడ చాలా క్రూరమైంది. అనాగరికమైంది" అని బిగ్గరగా అరిచాడు. ఇతని దవడ పళ్ళు విరగలేదు కానీ ఒక యాక్సిడెంటులో బాగా దెబ్బలు తగలడంతో శరీరమంతా బ్యాండేజీతో ఈజిప్టియన్ 'మమ్మీ'గా పడున్నాడు.

"గట్టిగా అరవకు. నీరసం వస్తుంది" అంది నర్స్.

"అయినా సరే, అది నా వాదాన్ని బలహీనం చేయలేదు" అంటూ ఇంకా గట్టిగా అరుస్తూ మాట్లాడసాగాడు సైక్లింగ్ ఛాంపియన్.

ముఖానికి గాయంవల్ల మాట్లాడలేక .. చేతులతో సైగలు చేస్తూ అతణ్ణి ప్రశంసించాడు ఫుట్‌బాల్ గోల్‌కీపర్.

పోల్‌వాల్ట్, ఈత ఛాంపియన్‌లు వాళ్ళిద్దరి వంక గర్వంతో చూశారు. ఎందుకంటే ఆ ఇద్దరి శరీర పైభాగాలన్నిటికీ గట్టిగా ప్లాస్టర్ వేసి ఉండడంతో కదలడానికి మెదలడానికి ఇబ్బందిపడే పరిస్థితి అయినప్పటికీ గోల్‌కీపర్ మినహా అందరూ నర్స్ వైపు చూస్తూ వికటాట్టహాసం చేశారు. గోల్‌కీపర్ మాత్రం గొంతులో గురగురలతో ఉండిపోయాడు.

"అయినా సరే వాళ్లు (బాక్సర్లు) దాన్ని ఎంజాయ్ చేయొచ్చు" అన్నాడు పోల్‌వాల్ట్ ఛాంపియన్.

"అవును, బహుశా వాళ్లు ఎంజాయ్ చేస్తుండొచ్చు" అంది నర్స్.

"సిస్టర్, మీ ఆలోచన పొరబాటని నా అభిప్రాయం. కావాలంటే మీరు ఓ బాక్సర్‌ని తీసుకురండి. అతనితో మాట్లాడి అతని అభిప్రాయం తెలుసుకుంటాం" వ్యంగ్యంగా అన్నాడు సైకిల్ ఛాంపియన్.

"అవును సరిగ్గా చెప్పావు. మనం అతనితో చర్చించవచ్చు" అన్నారు కోరస్‌గా ఫుట్‌బాల్, ఈత ఛాంపియన్లు.

నర్స్ అక్కడి నుంచి వెళ్లిపోయింది.

"నర్స్ గంటదాటినా రాలేదేమిటి? ఓహ్ బహుశా బాక్సర్‌ని తన భుజాల మీద మోసుకొస్తోంది కాబోలు. నడవలేడుగా మరి. అందుకే ఆలస్యమై ఉండొచ్చు"

"అవును... అవును... అవును..."అని అందరూ అనుకున్నారు.

ఇంతలో గోల్‌కీపర్ వేళ్లు ముడిచి చేతిని చూపుతూ "అదిగో నర్స్ వస్తోంది" అంటూ మూగభాషలో సంకేతమిచ్చాడు.

"సిస్టర్! బాక్సర్ ఏడీ? ఆసుపత్రి మొత్తంలో ఒక్క బాక్సర్ కూడా లేడా ఏమిటి? "

"బహుశా మార్చురీలో ఉండొచ్చు? "

"లేదు లేదు.. ఆసుపత్రి మొత్తానికి ఒకే ఒక్క బాక్సర్ ఉన్నాడు.. అది కూడా మాజీ బాక్సర్" అంది నర్సు.

"అదేమిటి. ఒక్క బాక్సరేనా? "

"అతన్ని వెదికి పట్టుకున్నావా ఏంటి? "

"మరి అతన్ని తీసుకురాలేదెందుకని? "

"ఎందుకంటే అతను ప్రతిరోజు మిమ్మల్ని చూట్టానికి వస్తాడు కాబట్టి. ఇంతకీ అతను ఎవరో కాదు మీ చీఫ్ సర్జన్..." నవ్వుతూ చెప్పింది నర్స్. V

తెలుగు కథ

-పొత్తూరి విజయలక్ష్మి



# వెండి దివ్వె

అది ఒక చిన్న కుటుంబం. ఆస్తి, అందం, ఆరోగ్యం వీటన్నిటితోపాటు మంచి తనం కూడా మేళవించిన వ్యక్తులున్న చూడ చక్కని కుటుంబం. శేఖరం, ఆయన భార్య సుమిత్ర. శేఖరానికి బాపట్ల దగ్గర పల్లె టూర్లో ఇల్లు, పొలాలు ఉన్నాయి. ఆయనకు ఇద్దరు కూతుళ్లు. ఒక్కడే కొడుకు. పేరు శశాంక్. అతని భార్య విద్య. వాళ్ళిద్దరికీ ఒక్కతే కూతురు. పేరు శ్రీలలిత. వాళ్ళింట్లో అందరూ లలితా సహస్రనామ పారాయణ చేస్తారు. కాబట్టి పాపకి ఆ పేరు పెట్టారు.

శశాంక్‌కి మంచి ఉద్యోగం ఉంది. కూతురు పుట్టేదాకా విద్య కూడా మంచి ఉద్యోగమే చేసేది. శ్రీలలితకి పదేళ్ళు నిండాయి. మంచి తెలివైన పిల్ల. చద రంగం, సంగీతం కూడా నేర్చుకుంటోంది. ఇక పెద్దవాళ్ల విషయానికి వస్తే వారి జీవి తాలకు అర్థమూ పరమార్థమూ కూడా శ్రీల లితే. అమ్మా నాన్నల శిక్షణలో ఆధునిక తను, తాత బామ్మల దగ్గర సంస్కృతి సాంప్రదాయాలను నేర్చుకుంటూ అపురూప మైన బాల్యాన్ని చవిచూస్తోంది.

కిందటిరోజు అలవాటు ప్రకారం కూతు రుకి అన్నం పెట్టడానికి వెండి కంచం కోసం వెతికింది విద్య. కనిపించలేదు. సర్లే, ఏ గిన్నెలలో కలిసిపోయిందో అని వేరే కంచంలో అన్నం పెట్టేసింది. ఆ తరువాత వెండి కంచం విషయం మరిచిపోయింది. తెల్లారాక ఆ విషయం గుర్తుకొచ్చి కంచం కోసం వెతికింది. వెండి కంచం, దానితో పాటు వెండి గ్లాసు కూడా కనిపించలేదు. "మీరేమైనా తీశారా అత్తయ్యా" అత్తగారిని అడిగింది. "లేదే, నేను తీయలేదమ్మా" అంది సుమిత్ర.

అత్తాకోడళ్ళు కంగారుపడిపోయి వంటిల్లంతా వెతికారు. అవి కనిపించలేదు. ఏదో అనుమానం వచ్చి పడకగదిలోకి వెళ్ళి, డ్రెస్సింగ్ టేబుల్ సొరుగు లాగి, చిన్న డబ్బా మూత తీసి చూసింది. అందులో ఉండే శ్రీలలిత బంగారు లాకెట్ గొలుసు కూడా లేదు. ఒక వస్తువు కనిపించకపోతే ఏమో అనుకోవచ్చు. కానీ ఏకంగా మూడు..! ఏమైపోయాయి? ఎవరు తీ శారు? ఇంట్లోకి చనువుగా వచ్చిపోయేది ఇద్దరే. పనిమనిషి కుమారి. బట్టలు ఇస్త్రీ చేసే అమ్మాయి లక్ష్మి. ఇంకెవరూ రారు.

కిందటిరోజు లక్ష్మి వచ్చి వెళ్ళింది. ఖచ్చి తంగా వారిద్దరిలో ఎవరో ఒకరు తీసి ఉంటారు. నమ్మశక్యం కావటంలేదు. ఇద్దరూ మంచివాళ్ళే. ఎన్నో ఏళ్ళుగా పనిచే స్తున్నారు. ఎప్పుడూ ఏమీ పోలేదు. వాళ్ళి లాంటి పని చేస్తారా. వాళ్ళు తీయకపోతే మరి ఎక్కడికి పోయాయి? ఇప్పుడేం చేయాలి?

పోలీసు రిపోర్ట్ ఇవ్వాలా? ఇస్తే నేలన పోయేదాన్ని నెత్తికి రాసుకున్నట్లు అవు తుందా? వస్తువులు దొరుకుతాయో లేదో నమ్మకంలేదు. కానీ పోలీస్ స్టేషన్ చుట్టూ ప్రదక్షిణలు చేయాలి. పోలీసులు ముందుగా పనివాళ్లను తీసుకుపోయి నాలుగు తగిలిస్తారు. పనివాళ్ళ తరపు

వాళ్ళు ఇంటి మీదకొచ్చి దెబ్బలాడతారు. పనివాళ్ళు పనులు మానేస్తారు. ఒకసారి వాళ్లమీద దొంగతనం మోపారని తెలిస్తే ఇంకెవరూ పనిలోకి రారు. పనివాళ్ళు లేని జీవితం దుర్భరంగా మారిపోతుంది. సరే పోతేపోయిందని ఊరుకోడానికి లేదు. ఇవ్వాళ ఇది అయింది. రేపు ఇంకొకటి మాయమవుతుంది.

అందరూ తలలు పట్టుకు కూర్చున్నారు.

"సర్లే నేను చూసుకుంటాలే" అని హామీ ఇచ్చింది సుమిత్ర. 'పెద్దది, అనుభవజ్ఞు రాలు. ఆవిడే చూసుకుంటుంది' అనుకుంది విద్య.

తెల్లవారింది. వస్తువులు పోయాయని ఇంట్లో అందరికీ తెలిసింది. "ఎక్కడికీ పోవు. మీరే ఎక్కడో పడేసి ఉంటారు" అన్నారు మగవాళ్ళు తేలిగ్గా.

శశాంక్ ఆఫీసుకి, శ్రీ లలిత స్కూలుకి వెళ్లారు. కుమారి పనిలోకి వచ్చింది. "రాత్రంతా నిద్ర లేదు, కుమారీ" అంటూ మొదలుపెట్టి జరిగిందంతా చెప్పింది సుమిత్ర.

కుమారి మొఖం పాలిపోయింది. "అదే మిటమ్మా, ఎలా పోయాయి? " అంది అయోమయంగా.

"అదే మాకూ అర్థం కావటం లేదు. బయటవారెవరూ రాలేదు" అంది సుమిత్ర.

"ఇల్లంతా చూశారా అమ్మా? " అడిగింది కుమారి.

"మాకు దొరకలేదు. నువ్వు చూడు. దొరికితే నీకు బహుమతి ఇస్తాం" అంది సుమిత్ర.

"అదేం వద్దమ్మా. దొరికితే నేనే మైసమ్మ తల్లికి నైవేద్యం పెడతాను" అంది కుమారి. పాపం, ఆమె భయం ఆమెది. ఇంట్లో ఏమైనా వస్తువులు పోతే పోలీసు రిపోర్ట్ ఇస్తారు. వాళ్లు ముందు పనివాళ్ళనే పట్టుకుపోతారు. వాళ్ళ చేతుల్లో పడ్డాక ఒళ్లు హూనమవడమే కాకుండా 'దొంగ' అనే పేరు పడుతుంది. ఇంకెక్కడా పని దొరకదు. ఇన్నాళ్ళుగా ఇన్ని ఇళ్ళల్లో పని చేస్తున్నా. ఎప్పుడు ఇటువంటి పరిస్థితి రాలేదు. కాళ్లు చేతులు వణికిపోతూనే వంటిల్లు అంతా వెతకటం మొదలుపెట్టింది కుమారి.

హాల్లో ఫోన్ మోగింది. శేఖరం ఫోన్ తీశాడు. "విద్యా, నీకే ఫోన్" అని కోడల్ని పిలిచాడు.

చిరాకుగా ఉన్న విద్య "ఎవరూ? తర్వాత చేయమనండి మావయ్యగారూ" అంది. ఆ మాటే చెప్పి, "కాదుటమ్మా అర్జంట్‌గా మాట్లాడాలట" అన్నాడు.

విసుగ్గా వచ్చి ఫోన్ అందుకుంది విద్య. అవతల మహాలక్ష్మి జ్యువలర్స్ షాపు యజ

మాని. ఎప్పుడైనా పెద్ద పెద్ద వస్తువులు, పెద్ద షాపుల్లోనే కొన్నా, ఇంటి దగ్గరలోనే ఉండే ఈ 'మహాలక్ష్మి' షాపులో ఏదైనా అర్జంట్‌గా కొంటూ ఉంటుంది. అతను అడపా దడపా ఫోన్‌చేసి 'ఫలానివాళ్లు ఎవరో కొత్త రకం నగ చేయించారు. చాలా బాగుంది. చూస్తారా? ' అని అడు గుతూంటాడు.

'అంభంలో కుంభం, ఆదివారంలో సోమ వారం' అన్నట్టు ఇప్పుడు ఈ హడావుడిలో అతను ఫోన్ చేసేటప్పటికి చిరాకు వచ్చే సింది విద్యకు. "ఏమిటండీ, ఏం కావాలి? " అంది విసుగ్గా.

"మీతో మాట్లాడాలి. తీరిగ్గా ఉన్నారా? " అన్నాడు.

"చాలా హడావుడిగా ఉన్నాను. మీరు తర్వాత ఫోన్ చేయండి" అంది.

"కాదు మేడం. మీతో అర్జంట్‌గా మాట్లా డాలి" అన్నాడు.

"నగల విషయమైతే నాకు ఇంట్రస్ట్ లేదండి" చిరాకు స్పష్టంగా తెలిసిపోతోంది ఆమె గొంతులో.

"నగల విషయమైతే ఇంత పొద్దున్నే మిమ్మల్ని ఇబ్బంది పెడతానా? మీకో విషయం చెప్పాలి. జాగ్రత్తగా వినండి. నే చెప్పబోయే విషయం మీకు బాధ కలిగించ వచ్చు. నిజానికి పనిమాలి ఫోన్‌చేసి చెప్పా ల్సిన అవసరం లేదు. కానీ మీ మంచి కోరేవాడిని కాబట్టి చెప్తున్నాను" అన్నాడు.

తెల్లబోయింది విద్య. అతను నగల షాపు యజమాని, తనో కొనుగోలు దారు. అతను తనతో చెప్పాల్సినంత ముఖ్యమైన విషయ మేంటో. "సరే చెప్పండి" అంది.

"అమ్మా, నిన్న సాయంత్రం మీ అమ్మాయి మరో అమ్మాయిని వెంటబెట్టు కుని మా షాపుకి వచ్చింది"

"మా అమ్మాయా? మీ షాప్‌కా? "

"అవును. నాకు ఆశ్చర్యం వేసింది. 'ఏమ్మా ఏం కావాలి? అమ్మగారు పంపిం చారా? ' అని అడిగాను. 'కాదంకుల్, నాకు డబ్బు కావాలి. రెండొందల యాభై గ్రాముల బరువుండే వెండి కంచం, యాభై గ్రాముల వెండి గ్లాసు, పదిహేను గ్రాముల బంగారం ఉన్నాయి. అవి అమ్ముతాను' అని చెప్పింది. నేను నిర్ఘాంతపోయాను. 'చిన్నపి ల్లవి. వస్తువులు అమ్ముతాననడం, డబ్బు కావాలనడం.. ఏమిటమ్మా ఇదంతా? ' అన్నాను. 'కారణాలు అడగకండి, నాకు కావాలి.. అంతే' అంది. షాపులో చాలా మంది ఉన్నారు. వింతగా చూస్తున్నారు. ఎందుకనవసరంగా గొడవ అనుకుని 'ఇప్పుడు నాకు తీరిక లేదు, రేపు పొద్దున్న రా' అన్నాను. 'పొద్దున్న నేను స్కూలుకి వెళ్ళాలి. సాయంత్రం వస్తా' అని చెప్పి వెళ్లి పోయింది. ఈ విషయం చెప్పాలనే ఫోన్ చేశాను. మీ మనసుకి కష్టం కలిగిస్తే క్షమిం చండి" అని చెప్పేసి సమాధానం కోసం ఎదురు చూడకుండా ఫోన్ పెట్టేశాడు అతను.

కుప్పకూలిపోయింది విద్య.

కోడలు వాలకం చూసి కంగారుపడ్డ శేఖరం భార్యను పిలిచాడు. ఆవిడ వచ్చింది. "విద్యా ఏమైంది? " అని అడి గింది. సమాధానం చెప్పకుండా కూతురి గదిలోకి వెళ్ళింది విద్య. కోడలి వెంటే వెళ్ళింది సుమిత్ర. వెతకడం మొదలు పెట్టింది విద్య. ఎక్కువ శ్రమ పడకుండానే దొరికాయి.

స్టడీ టేబుల్ సొరుగులో భద్రంగా కవ రులో కట్టి ఉన్నాయి ఆ వస్తువులు. తట్టు కోలేకపోయింది విద్య. అత్తగారిని కావలిం చుకుని బావురుమని ఏడ్చింది. విషయం అర్థమయింది సుమిత్రకి. కోడలిని అలాగే వదిలేసి వంటింట్లోకి వెళ్ళింది. వెతుకుతున్న కుమారిని వారించింది. "వదిలేయ్ కుమారీ! నిన్న మా వియ్యపురాలు వచ్చింది. ఆవిడే మైనా తీసిందేమో? నువ్వు నీ పని చేసుకో. మన సొమ్ము గట్టిది. ఎక్కడికి పోదు" అంది.

కుమారి మొఖం తేటపడింది. మామూ లుగా పని చేసుకుని వెళ్ళిపోయింది.

ఉన్నపాటున రమ్మని భర్తకు ఫోన్‌చేసి చెప్పింది విద్య. అతను ఆఘమేఘాలమీద వచ్చేశాడు. జరిగింది తెలుసుకుని పిడుగు పడినట్లయింది అతనికి. కూతురు దొంగ తనం చేసిందనే నిజం జీర్ణించుకోలేక తల్లడి ల్లిపోయాడు.

ఆ తర్వాత నలుగురూ ఒకేచోట కూర్చు న్నారు. తిండిమీద ధ్యాస లేదు. ఎవరూ మాట్లాడుకోవడం లేదు.

వాళ్ళ మనసులో ఎన్నో సందేహాలు! 'ఎందుకు చేసింది ఈ పని? ఏం తక్కువ చేశాం? చెడు స్నేహాలు చేస్తోందా? ఏమైనా చెడ్డ అలవాట్లకు లోనయిందా? ' అన్నీ ప్రశ్నలే. మామూలుగా సాయంత్రం నాలుగింటికి ఇంటికి వచ్చింది శ్రీ లలిత.

రాగానే నేరుగా అడిగేశాడు శశాంక. తియ్యలేదని బుకాయిస్తుందనీ, భయపడి పోయి ఏడ్చేస్తుందనీ, ఇంకెప్పుడూ చేయనని ప్రాధేయపడుతుందనీ అనుకున్నాడు.

కానీ అమ్మాయి మొఖంలో భయంలేదు, బాధా లేదు. "అవును తీశాను" అంది.

"అమ్మాలనుకున్నావా? " అంటే "అవును' ' అంది.

"ఎందుకు చేశావు ఈ పని? " అంటే "నాకు డబ్బు కావాల్సి వచ్చింది" అంది.

"మరి మాకెందుకు చెప్పలేదు? " అంటే "చెప్పకుండా దాచాలనుకున్నాను" అంది.

మాటకు మాట బదులు చెప్తున్న కూతు రుని చూసి శశాంక కోపం అవధులు దాటింది. చాచిపెట్టి లెంపకాయ కొట్టాడు. విద్య కూడా కోపంపట్టలేక వీపుమీద నాలుగు వాయించింది.

బావురుమని ఏడ్చింది శ్రీలలిత.

"తాతయ్యా" అంటూ తాతగారి వైపు వెళ్ళ బోయింది.

"తాతయ్యా లేదు, ఏమీ లేదు" అంటూ రెక్క పుచ్చుకుని లాక్కెళ్ళి గదిలో పడేసి తలుపేశాడు శశాంక్.

మరికాసేపటికి ఆ ఊళ్లోనే ఉన్న అమ్మమ్మ, తాతయ్య, మేనమామ వచ్చేశారు. వారిని చూడగానే మరోసారి ఏడ్చేసింది విద్య. జరిగిందంతా మరోసారి వివరంగా అడిగి తెలుసుకున్నాడు మేనమామ. "సారీ అయినా చెప్పటం లేదంటే.. ఇది చాలా సీరియస్ విషయం. ఈ రోజుల్లో పిల్లలు చాలా త్వరగా పెడదారి పడుతున్నారు. మనవల్ల కాదు. నాకు ఒక మంచి ఫ్రెండ్ ఉన్నాడు. చైల్డ్ సైకాలజీలో స్పెషలిస్ట్. సైకియాట్రిస్ట్‌గా మంచి ప్రాక్టీసు ఉంది అతనికి. అతని దగ్గరకు తీసుకువెళదాం. అప్పాయింట్‌మెంట్ తీసుకుంటాను" అన్నాడు.

విద్య మళ్ళీ బావురుమని ఏడ్చింది. శశాంక్ కూడా కన్నీళ్లు పెట్టుకున్నాడు. వాళ్ళిద్దరి వంకా జాలిగా చూశాడు మేనమామ. లేచి వెళ్ళి డాక్టరుకి ఫోన్‌చేసి అపాయింట్‌మెంట్ తీసుకున్నాడు. ఎనిమిదిన్నరకు తీసుకురమ్మన్నాడు డాక్టర్.

సుమిత్ర కళ్ళు తుడుచుకుంది. "స్కూలు నుంచి వచ్చాక పాప ఏమీ తినలేదు. అన్నంపెట్టి తీసుకెళ్దురుగాని" అంది. ఆవిడ ప్రాణం విలవిలలాడిపోతోంది. అసలు కంటే వడ్డీ ముద్దు కదా!

కంచం తీసుకుని గదిలోకి వెళ్ళబోతున్న భార్యను వారించాడు శేఖరం. "ఇటు ఇవ్వు నేను పెడతాను" అన్నాడు. అన్నం పెడుతూ కథలు చెప్పడం తాతగారికి, తింటూ వినడం మనవరాలికి ఎంతో ఇష్టం. తలుపు తీసుకుని లోపలికి వెళ్ళాడు.

మంచంమీద ముడుచుకు పడుకున్న శ్రీలలిత తాతయ్యను చూసి నవ్వింది. ఏడ్చి ఏడ్చి వాడిపోయిన ఆ మొఖం చూసి

ఆయన ప్రాణం కలుక్కుమంది. దగ్గర కూర్చుని తల నిమిరాడు. "అన్నం తినమ్మా" అన్నాడు. ఆకలిగా తినసాగింది పాప.

"అమ్మలూ! నిన్ను డాక్టర్ దగ్గరకు తీసు కెళతారు."

"డాక్టర్ దగ్గరకా, ఎందుకు తాతయ్యా? నాకు బాగానే ఉందిగా!"

"కాదమ్మా.. తీసుకెళ్ళాలి"

"ఇంజెక్షన్ ఇస్తారా తాతయ్యా? " భయంగా అడిగింది.

"ఇవ్వరులే, ఊరికే నీతో మాట్లాడతారు"

"ఏం మాట్లాడతారు? "

"ఇంత చిన్నవయసులో ఇలా ఎందుకు చే శావని అడిగి తెలుసుకుంటారు"

"ఈ మాత్రం దానికి డాక్టర్ ఎందుకు తాతయ్యా? మీరు అడిగినా చెప్తాగా" అంది.

"సరే అయితే అందరి ముందు చెప్పు" అంటూ పాపని హాలులోకి తీసుకు వచ్చాడు. అందరూ పాపను దోషిలా చూస్తున్నారు.

"చెప్పు" అన్నాడు మేనమామ.

"ఏం చెప్పాలి? " అంది.

"ఆ వస్తువులు ఎందుకు తీశావు? "

"అవసరం వచ్చింది. తీశాను"

"అవసరమైతే దొంగతనం చేస్తావా? "

"దొంగతనమా? అవి నా వస్తువులు. 'అవి నావేనా? ' అని తాతయ్యని, బామ్మని అడిగాను. 'అవేం ఖర్మ..ఇంట్లో అన్నీ నీవే' అన్నారు కదా తాతయ్యా? "

"అవును" అన్నాడు శేఖరం.

"మరి నా వస్తువులు నేను తీసుకుంటే దొంగతనం ఎలా అవుతుంది? ఓ సారి తాతయ్య కొబ్బరితోట అమ్మి అత్తయ్యలకు ఇస్తే.. అమ్మ గొడవ చేస్తుంటే నాన్నగారు అమ్మను కోప్పడ్డారు. 'ఆయన తోట, ఆయన ఇష్టం. అమ్ముకుని ఇష్టం వచ్చిన వాళ్ళకు ఇస్తారు. మధ్యలో నీకేం కష్టం? ' అన్నారు. కాదా? "

విద్య తలవంచుకుంది. శేఖరం, సుమిత్ర ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. శశాంక్ ఇబ్బందిగా కదిలాడు.

మేనమామ కలగచేసుకున్నాడు "వేలె డంత లేవు. నీకిన్ని తెలివితేటలా? అవి అమ్మి ఎవరికిద్దామనుకున్నావ్.. అదైనా చెప్తావా? "

"అసలు చెప్పను. చెప్పగూడదు. అప్పుడె ప్పుడో అమ్మ నీకు చాటుగా డబ్బు ఇవ్వ లేదా? నేను చూశానని 'అమ్మలూ! ఈ విషయం నాన్నతో చెప్పకు' అంది. 'ఎందు కమ్మా? ' అంటే 'పాపం.. మావయ్యకు అర్జంట్‌గా డబ్బవసరం వచ్చింది. అడిగేం దుకు మొహమాటపడుతున్నాడు. నా దగ్గ రేమో డబ్బు ఉంది. సాయం చేస్తున్నాను. వాడికి డబ్బు అందగానే తిరిగి ఇచ్చేస్తాడు. అవసరం ఉన్నవాళ్లకు ఇలా గుట్టుగానే సాయం చేయాలి. అందరికీ తెలిస్తే వాళ్ళకు చిన్నతనం' అందిగా అమ్మ"

మేనమామ ఖంగుతిన్నాడు. విద్య తెల్ల బోయింది. మిగిలిన వాళ్లంతా బొమ్మల్లా కూర్చున్నారు.

"ఓరి దేవుడో! ఇది పిల్ల కాదు, పిడుగు. మా రోజుల్లో పిల్లల్ని ఓ దెబ్బేసి పిల్లల్లా పెంచేవాళ్లం. వాళ్ళేమో పెద్దలంటే భయభ క్తులతో పిల్లల్లాగే ఉండేవారు. ఇప్పటివాళ్ళు ఒకటడిగితే పది విషయాలు చెపుతున్నారు. పిల్లల్ని పసితనంలోనే పండితులను చేయా లని చూస్తున్నారు తల్లిదండ్రులు. ఇదిగో ఇదీ దాని ఫలితం" అని మొత్తుకుంది అమ్మమ్మ.

నోరు మూసుకో" అని కసిరాడు ఆవిడ భర్త.

"చూడమ్మా, ఇవన్నీ పెద్ద వాళ్ళ సమ స్యలు. పసిపిల్లవు నీకెందుకు? ' అన్నాడు మేనమామ.

"అవుననుకో మావయ్యా, కానీ నాకు అవసరం వచ్చింది కదా!" అంది.

"నాతో చెప్పు, ఆ వస్తువులు అమ్మకుండానే నీకు కావల్సిన డబ్బు నేనిస్తాను" అన్నాడు శేఖరం.

పాప కళ్ళు మెరిశాయి. "ప్రామిస్" అడిగింది.

"ప్రామిస్" అన్నాడు.

వెంటనే వెళ్ళి తాతగారి పక్కన కూర్చుని చెప్పటం మొదలు పెట్టింది శ్రీలలిత.

వాళ్ళింటి దగ్గర ఓ పార్కుంది. ఆ పార్కు వాచ్‌మాన్ పేరు మొగిలయ్య. అతని కూతురు మాధవి. ఆ అమ్మాయితో శ్రీలలితకు మంచి స్నేహం కుదిరింది. తన ఇంటి గురించి, తన స్కూలు గురించి ఆ అమ్మాయి చెప్తుంది. తన వివరాలు లలిత చెప్తుంది. ఇద్దరికీ ఆర్థికంగా చాలా తేడా ఉన్నా, కుటుంబ విషయాల్లో పోలికలు ఉన్నాయి. మాధవికి ఓ తాతయ్య ఉన్నాడు. ఆయనకీ ఊళ్లో కొంత పొలముంది. ఈ సారి టమాటో పంట వేశాడు. కొంత అప్పున్నా తీర్చవచ్చునుకునే తరుణంలో, ధర పడిపోయి కిలో పావలాకి ఇస్తామన్నా ఎవరూ కొనలేదు. అప్పులిచ్చినవాళ్ళు ఇంటిమీదకొచ్చి, 'వారం రోజుల్లోగా అప్పు తీర్చకపోతే పంట భూమి స్వాధీనం చేసుకుంటామ'ని బెదిరించారు. 'ఉన్న ఈ కాస్త పొలం కూడా పోతే బతకడం ఎలా? ఏ పురుగుల మందో తాగి చస్తాన'న్నాడట మాధవి తాత. ఇదంతా శ్రీలలిత దగ్గర చెపుతూ, తన తాతని తల్చుకుని ఏడ్చిందట మాధవి.

పురుగులమందు తాగి ఆత్మహత్య చేసుకునే దారుణమైన దృశ్యాలు టీవీలో తరచూ చూస్తూ ఉండే శ్రీలలితకు చాలా భయం వేసింది. ఏదైనా చెయ్యాలని నిర్ణయించుకుంది. గతంలో అమ్మ వెంట నగల షాపుకి వెళ్ళినప్పుడు ఎవరో వెండి బంగారాలు అమ్మడం గుర్తుకొచ్చింది. ఈ వస్తువులు నావేగా అని అందర్నీ అడిగి రూఢి చేసుకుంది. తను ఏం అడిగినా విసుక్కోకుండా సమాధానం చెప్పే తండ్రిని అడిగి వెండి బంగారం ధరలు తెలుసుకుంది. కాలిక్యులేటర్ మీద లెక్కలు వేసి చూసుకుంది. అయిన వాళ్ళకు సహాయం చేసేటప్పుడూ గుట్టుగా చెయ్యాలి కాబట్టి ఎవరికి చెప్పలేదు.

..విషయం అంతా పూసగుచ్చినట్లు చెప్పేసింది శ్రీలలిత. ఆఖర్న తాతగారి దగ్గరగా జరిగి ఆయన భుజంమీద తల వాల్చుకుంది. "మాధవి తాతయ్య కూడా నీలాగా చాలా మంచివాడుట. మాధవికి అన్నీ కొనిపెడతాడట. ఎన్నో కథలు చెప్తాడట. 'నువ్వు బాగా చదువుకొని టీచరమ్మవి అవ్వాలి' అంటాడట. మరి అలాంటి తాతయ్య ఆత్మహత్య చేసేసుకుంటే మాధవికి తాతయ్య ఉండడు కదా! నా దగ్గరేమో డబ్బుంది కదా అని సాయం చెయ్యాలనుకున్నాను. తప్పా తాతయ్యా? " అంటూ బావురుమని ఏడ్చింది.

శేఖరానికి దుఃఖం ఆగలేదు. వింటున్న వారంతా కూడా కంటతడి పెట్టుకున్నారు.

అప్పటిదాకా దోషిలా కనిపించిన ఆ చిన్న పాప ఎంతో ఎత్తుకి ఎదిగి పోయింది వారి కళ్లకి.

మర్నాడు సాయంత్రం శ్రీలలిత ఇంటి నుండి వాళ్ళ ఇన్నోవా కారు బయలుదేరింది.

డ్రైవింగ్ సీట్లో శశాంక్, పక్క సీట్లో మొగిలయ్య. వెనక సీట్లో శేఖరం పక్కనే శ్రీలలిత, మాధవి. ఉత్సాహంగా ఉన్నారు.

వాళ్ళ ఊరు గురించి, తాతయ్య గురించి ఒకటే కబుర్లు చెబుతోంది మాధవి. "ఇక్కడిలాగా అక్కడ కాసిని కాసిని చిక్కుడు కాయలు కొనుక్కోం. తాత పొలం నుంచి తువ్వాళ్లో మూట కట్టి తెస్తాడు, తెలుసా!" అని ..

వాళ్లను చూసి ఆనందిస్తున్నాడు శేఖరం. ఆయన జేబులో పదిహేను వేలున్నాయి. మాధవి తాతయ్య కోసం!! V

నేపాలీ కథ

**-శరద్ ఛత్రీ**

# చేతులు

**అనువాదం : కొండా కోటిరెడ్డి**

అదొక కల, పీడకల. నిజ జీవితంలో ఎన్నడూ అంత పెద్ద ప్రమాదం ఎదురైనట్లు గుర్తులేదు. ఆ కలలో.. ఎంతో ముద్దుగా పెంచిన పక్షే నా కళ్ళు పొడవాలని యత్నించటం కనిపించింది!

సరే, అదే నిజమైతే.. అట్లాంటి చచ్చు తరహా ప్రయత్నానికి నేను దడిసేవాడిని కాదు. కానీ అది కల, పీడకల. దానిష్టమొచ్చినట్లు వస్తుంది, మనిషిని అసహాయుణ్ణి చేస్తుంది, అనాథగా వదిలేస్తుంది. ఏదేమైనా ఓ విస్ఫోట ప్రతిధ్వనిలా, ఓ గొప్ప సవాలులా అనిపించిందా కల.

నేనసలే ఆరోగ్యకర వాతావరణంలో పెరిగిన మనిషిని. అలాంటి నన్ను ఎవరైనా 'ఆ' విషయంతో, దానితో ఎలా పోల్చగలరు? నేను స్వచ్ఛతకు ప్రతీకను. ఇక ఆ పిల్లవాడంటారా? ఎంతో కృత్రిమత్వం నుండి పుట్టుకొచ్చినవాడు, నామమాత్రపు సహజ కలయిక నుండి వచ్చిన ఒక ఉత్పాదన! మరి, మాకు పోలికా? నాకు మాత్రం వంశ పరంపర అంటే ఎంతో గౌరవం.

కలలో.. మా అబ్బాయి కొండంత ఉన్నాడు! నలుమూలలా ఆవరించి వుండే వర్తమానంతో వాడిని కట్టిపడెయ్యాలని చూశాను. కానీ, కలలో వర్తమానమొక చుక్క, ఒక కణం. మా అబ్బాయేమో విశ్వాన్నంతా ఆవరించినట్లున్నాడు. ఇంత చిన్ని కణం అంత పెద్ద దాంతో ఎట్లా పోటీ చెయ్యగలదు?

ఆ కల నా నమ్మకాల్ని వమ్ముచేసింది. నిజానికది మామూలుగానే మొదలైంది. వినయంగా ఎప్పుడూ మాట్లాడే మా అబ్బాయి కంఠధ్వని నాకు ఆశ్చర్యం కలిగించింది. తలొంచుకుని మాట్లాడే పిల్లాడు కాస్తా నన్ను గుర్రుగా చూస్తూ "నా చేతులిచ్చెయ్యి, నాకవసరం" అని దబాయించాడు.

"ఏం మాట్లాడుతున్నావ్? నా దగ్గర ఎవరి చేతులూ లేవు" కోపంతో నేనూ ఉరిమి చూస్తూ జవాబిచ్చాను.

వాడు నా అహాన్ని దెబ్బకొట్టాడు. భవిష్యత్తన్నా, దాని ప్రభావమన్నా లెక్కలేనట్లు మాట్లాడాడు.

మేం ఎదురుపడ్డప్పుడు, వాడు ఎప్పటిలానే.. అగ్నిజ్వాలకెదురైన మనిషిలాగా నన్ను చూసి పక్కకు తప్పుకుంటాడనుకున్నాను. కానీ ఆశ్చర్యం.. వాడి కళ్ల మంటల్లా మండుతున్నట్లున్నాయి. పట్టుమని ఇరవై ఏళ్లయినా దాటని పిల్లవాడి కళ్ళల్లో ఆ ఏహ్యత, ఆ విముఖత ఎక్కడినుండి వచ్చింది?

అయిష్టంతో మొహంచిట్లించిన వాడు బిగ్గరగా అరిచాడు "సిగ్గుపడాలి! నా చేతుల్ని నాకివ్వటానికి నువ్వెందుకు ఇష్టపడవు? నువ్వే వాటిని నరికేసి దాచిపెట్టావ్! ఇహ నీ అన్యాయాన్ని సహించను. అవి కావాలి.. నా చేతులు, నా అరచేతులు.. ఇప్పుడే! ఇంతకీ అవి ఎక్కడున్నాయి? "

వాడు పెద్ద శాలువా కప్పుకున్నాడు. వాడి చేతుల్ని నేను చూడలేను. అయినా, వాడి ఈ ఘోరమైన ఆరోపణ నన్ను తీవ్ర ఆలోచనలో పడేసింది. వింతేంటంటే, వాడు చేతుల్తో పుట్టాడో చేతుల్లేకుండా పుట్టాడో

నాకు బాగా గుర్తులేదు. వాడు తన చేతుల గురించి నన్నెప్పుడూ అడిగిన గుర్తూ లేదు. వాడి చేతులు తీసేసినట్లూ నాకు గుర్తురావడం లేదు. దాంతో కాస్త మెత్తబడి అన్నాను "చేతులు నరికేయడమనే ఆ పరం పర, ఆ క్రూరమైన శిక్ష ఏనాటిదో? దాన్ని చరిత్రలో ఎప్పుడో ఏ క్రూరమైన నియంతో మొదలుపెట్టి ఉండొచ్చు. అదంతా మర్చిపో యిన వాటిని ఇప్పుడు తవ్వితీయటం లాంటిది, చరిత్రని గుర్తుచేసుకోవటం లాంటిది. అవేవీ వర్తమానపు క్షణాల్ని వివ రించలేవు, వెలుగు అందించలేవు. అయినా నేను నీ తండ్రిననే సంగతి మర్చిపోకు. నీ చక్కటి చేతుల్ని నీ నుండి నేనెందుకు విడ దీస్తాను చెప్పు? "

"ఓ నాన్నగారూ! నియంతృత్వాలు అప్పు డెప్పుడో ఉండేవనుకుంటున్నారా! అది సరైన మాట కాదు. గతంలో అధికారం సుస్థిరం చేసుకునేందుకు చేతులు నరికేసేవారు. ఇప్పుడూ అవే క్రూర పనులు అవే కారణాలతో జరిగిపోతున్నాయి. అధి కారాలు నిలుపుకొనేందుకే అవన్నీ. అందుకే తండ్రులు అదిలించీ బెదిరించీ తమ కొడు కుల్ని అంగవిహీనుల్ని చేస్తున్నారని జనా నికి తెలుసు! నాన్నగారూ, దయచేసి నన్ను మోసం చెయ్యటానికి ప్రయత్నించకండి. కాలం నాకెన్నో నిజాలు చెప్పింది. సరి సరి.. నా చేతులు నాకు తిరిగి ఇచ్చేయండి. వాటితో చాలా పనివుంది నాకు. వాటిని మీకిచ్చి, ఎటువంటి పరిస్థితుల్లోనూ నా బతుకునీ నా యవ్వనాన్నీ నాశనం చేసుకో లేను" అంటూ కోపంతో అరిచాడు వాడు.

అక్కడే దగ్గరగా కూర్చుని ఉన్న వాడి తల్లి ఏడవసాగింది. కొడుకు ఉద్రేకం చూసి, ఆ తర్వాత ఎలాగైనా వాడిని శాంతపరచాలని ప్రయత్నించింది. "మన పిల్లవాడి మాటే రైటేమో. వాడూ పెద్దోడ య్యాడు. వాడికి వాడి చేతులు ఇవ్వకపో వడం అన్యాయం. వాడికి అవి ఎందుకు ఇవ్వరు? "

నాకు పెద్ద ఇరకాటం! కొడుకు చూడ బోతే చేతులు పోయాయని తప్పుడు కూతలు కూస్తున్నాడు. వాడి తల్లేమో వాడి మీద సానుభూతి కురిపిస్తోంది. అదంతా నాకంత పెద్ద ఆశ్చర్యం కలిగించకపోయినా, ఆ చేతులు నేను తీసుకుని దాచిపెట్టానన్న ఆరోపణే నా అహాన్ని దెబ్బతీసింది! "వీడేమో పిల్లాడు. తన చేతుల్ని తను ఎట్లా జాగ్రత్త చేసుకోగలడు? తల కాస్తంత కూడా పండలేదు. అయినా తండ్రి గురించి ఇలా మాట్లాడే ధైర్యం చేస్తున్నాడు" అన్నాను విసుగ్గా.

ఆ మాటే నా కుమారుడి గుండెల్లో గుచ్చుకుంది. "మీరు సిగ్గుపడాలి నాన్న గారూ! మీరు పట్టపగలు గబ్బిలం లాంటి వాళ్లు. గుడ్డివాళ్ళు. నా ఎదుగుదలని మీరు చూడలేరు. నాది కళ్ళు చెదరగొట్టే యవ్వన ప్రాయం. ఇలాగే ఉండాలనుకుం టున్నా. ఇదే వెలుగుని దోసిట పట్టి ఇతరు లతో పంచుకోవాలనుకుంటున్నా. అందుకే నా చేతులు నాకు కావాలి, దయచేసి ఇవ్వండి" అన్నాడు ఇంకా బిగ్గరగా.

"ఆ చేతులు నా దగ్గర ఉన్నాయా అని" నెమ్మదిగా అన్నాను.

నా జవాబు విని వాడింకా మండిప డ్డాడు. "నన్ను మోసం చెయ్యబోకు. పనికి మాలిన అధికారం కోసమేనా ఈ ఎత్తు లన్నీ? ఈ రకం నియంతృత్వం ఇప్పుడు చెల్లదు. నా చేతులు తిరిగి ఇచ్చేసే సంగతి ఆలోచించు. ఈ పట్టపగలు వెలుతుర్లో నువ్వు నా చెయ్యిపట్టుకు నడిపించక్కర్లా. నీ స్వార్థం కోసమే అలా చేస్తే, అది నీ తెలి వితక్కువ కూడా. తెలిసిందా? ఆ చేతులు వెంటనే ఇచ్చెయ్యి. లేదా.."

ఆ అరుపుల్ని, బెదిరింపుల్ని చూసి మరింత భయపడిన తల్లి.. మధ్యలో జోక్యం చేసుకుంది. "చూడు నాన్నా, ఇంత చిన్న వయసులోనే ఆ చేతుల్ని రక్షించుకునే

బరువు నీకెందుకు? వాటిని రక్షించుకో వటం అంత తేలికైన పనికాదు. వాటిని మీ నాన్నదగ్గరే ఉండనియ్యి"

"తల్లీ! ఆపవే. నీ గారాంతో చావొచ్చి పడింది. నన్ను మోసం చెయ్యకు. మళ్లీ నాకు నా చేతులు కావాలి. బల్లగుద్ది మరీ చెబుతా. ఆ అరచేతులు పట్టుకోలేనిది ఏముంటుంది? నా తల, నా గుండె, నా బతుకు, నా అదృష్టం అంతా ఆ రేఖల్లోనే.. నా అరచేతుల్లోనే ఉంది. అంతేకాదు.. అందులోనే, ఆ ఎత్తుపల్లాల్లోనే సూర్యుడు, చంద్రుడు, బుధుడు, శుక్రుడు, శని గ్రహాలు. అవి నిర్ధారించలేనివి ఈ భూమ్మీద ఏముంటాయ్? " అంటూ ఉద్రేకంగా మాట్లాడసాగాడు మా అబ్బాయి. "అందుకే నాకు నా చేతులు కావాలి, నేను మార్పు కోరుతున్నా" అని తేల్చి చెప్పేశాడు.

ఈ లోపలే.. తల్లి.. బిడ్డకు దూరమవుతాననే భయంతో ఏడవటం మొదలుపెట్టింది. అతను మాట్లాడటం ఆపగానే అదే దుఃఖంతో అందామె "బుజ్జికొండా! ఎంతోమంది తల్లిదండ్రుల కంటే ఎక్కువగా మేం నీకోసం కష్టాల్ని భరించాం. నిన్ను పెంచటంలో మాకు ఎన్నో ప్రమాదాలు ఎదురయ్యాయి. కేవలం నీకోసం ఎంతో కాలంగా కష్టపడ్డాడు నాన్న. ఆయనే నీ చేతుల్ని కాపాడతానంటే ఇంకా నీకెందుకు బాధ? అంతా నీ మంచి కోసమే. అయినా నీకు నీ ఒంటిమీద ఇంత కొత్త శ్రద్ధ ఎప్పుడొచ్చిందో కాస్త చెప్పయ్యా? " అంది.

పిల్లవాడు కాస్త శాంతించాడు. నెమ్మదిగా అన్నాడు "అమ్మా! నేనొక అమ్మాయి ప్రేమలో పడ్డాను. పెళ్ళి చేసుకోమని ఆమెని అడిగాను. కానీ ఆమె నా చేతుల గురించే చింతిస్తోంది. నేనా.. ఆమెనే కోరుకుంటున్నా. కాబట్టి.."

వాడి మాటల్ని మధ్యలోనే తుంచేస్తూ ఎగతాళిగా అడిగాను "ఏం.. ఆమెకు కూడా చేతులున్నాయా? "

వాడి మొహం జేవురించింది, ముక్కు ఎఱ్రబడింది, పళ్ళు పటపటా కొరుకుతూ ఒక్క అరుపు అరిచాడు "ఆమె అరచేతుల్తో నీకు ఏమాత్రం సంబంధంలేదు. నువ్వు నా చేతుల గురించి మాట్లాడు. అసలు మేమంటే ఏమనుకుంటున్నావ్? ఆమెకూ నాలాగే చేతులు లేవు. వాటిని తిరిగి ఇచ్చే యమని తనూ తండ్రిని గట్టిగా అడుగు తోంది. అంతా అయ్యాకే మేమిద్దరం చేయీ చేయీ కలిపి కొత్త ప్రపంచం నిర్మించడానికి బయల్దేరతాం. ఇదంతా మాకు సంబంధించిన విషయం. ఇలాంటి మా కలలు నీ వంటి నియంత తండ్రికి కల్లలుగానే కనిపిస్తాయిలే. అయినా సరే, ఎలాగైనా అంగీకారం పొంది తీరతాం."

అబ్బాయి మంకుపట్టు చూసి ఇంకా భయపడింది వాళ్లమ్మ. "పిల్లాడి చేతుల్ని వాడికి తిరిగిచ్చేసే సమయం వచ్చింది. వాటిని వాడి కిచ్చేయండి. దయచేసి నాకోసం వాటిని వాడికిచ్చేయండ"ని ప్రాధే యపడింది.

సీరియస్‌గా మొహంపెట్టి, ఇంత కుముందన్న మాటనే మళ్ళీ అప్పగించా. "వాడి చేతులు నా దగ్గర ఉంటే కదా"

"అయితే ఎక్కడున్నాయ్ నా చేతులు? " బెదిరింపు ధోరణిలో ప్రశ్నించాడు మావాడు. తను కప్పుకొన్న శాలువాను తీసి విదిల్చి, మణికట్టుదాకా నరికిఉన్న తన చేతుల్ని చూపించాడు!

పిల్లాడి మొండిచేతుల్ని చూసిన తల్లి మరుక్షణంలో నావైపు చూస్తూ పెద్దగా ఏడ్చింది "అయ్యో, నా బిడ్డ కష్టాన్ని చూడ లేను. వాడి గాయాలు అలాగే ఉన్నాయి. ఇప్పటికైనా.. మీరు దాచిపెట్టిన పెట్టె తాళం చెవిని దయచేసి ఇచ్చేయండి"

అదే, ఆ దయనీయ దృశ్యమే నన్నింకా కదిలించేసింది. 'నేను నిజంగా మా అబ్బాయి చేతులు నరికేశానా? అదేమీ లేదే? ' అనుకుంటూ కలత చెందిన మనసు తోనే ముందుకొచ్చాను. రహస్యంగా దాచి పెట్టిన సందూకుపెట్టె తాళంచెవిని మా ఆవిడ చేతికిచ్చాను. ఆ పెట్టె తెరవడానికి ఆమెకు ఒక్క నిమిషం కూడా పట్టలేదు. నన్ను దిగ్భ్రాంతిపరుస్తూ అందులో రెండు చేతులున్నాయి! తెగిన ఆ చేతుల చివర్లలో రక్తం!! అప్పుడే నరికేసినట్లు కనిపిస్తోంది!!! ఇంకా అక్కడెలాఉందో తెలుసా? గాయాలు మానే అవకాశమే లేనట్లు ఉంద క్కడ. విధి మాటిమాటికీ వాడి బాహు వుల్ని ఛేదించినట్లు ఉంది.

విడదీసిన ఆ చేతుల్ని చూశాడు నా కుమారుడు. నెగ్గానన్న సంతోషంతో తన మొండి బాహువుల్ని ఆ చేతులపై ఉంచాడు. ఆ చేతులు, అరచేతులు వెంటనే తిరిగి అతుక్కున్నాయ్! చూస్తుండగానే, అవి మునుపటి రూపానికి వచ్చేశాయ్!

మా వాడు ఉబ్బి తబ్బిబ్బైపోయాడు. తన చేతుల్ని స్వేచ్ఛగా ఎగరేస్తూ, పట్టపగ్గాల్లే కుండా డ్యాన్సు చేశాడు. ఆ దృశ్యం చూసి సంతోషం పట్టలేకపోయింది తల్లి. ఆ నవ్వులోనూ ఆమె కళ్లనుంచి నీళ్లు! అప్పుడు నాకేమయిందో చెప్పలేను. భరించలేనంత బాధ నా మనసంతా నిండిపోయింది.

అదో కల, జటిలంగా అనిపించిన కల. మా అబ్బాయి చేతులకి మొండితనం పోయింది. చేతులు యథాస్థితికి రాగానే, వాడికి రెక్కలు పుట్టుకొచ్చి మేఘాల్లోకి ఎగి రిపోయినట్లు కనిపించాడు. అవే మేఘాల మాటునుండి మరెన్నో పసిడిచేతులు వచ్చి మావాడి చేతుల్ని పట్టుకుని తమ వైపుకి లాక్కున్నాయి. ఆ చేతులు.. బహుశా.. నేనెరగని ఆ బాలిక చేతులై ఉండొచ్చు!

వాళ్ళిద్దరూ చేతిలో చెయ్యేసుకుని సంతో షంతో నాట్యంచేశారు. అదే, ఆ పీడకల లోనే.. నాకు, నా భార్యకు దూరంగా సుదూరంగా.. ఆ అందమైన అమ్మాయి మాఅబ్బాయితో కలిసి ఎగిరిపోయింది. V

కొంకణి కథ

-ప్రకాశ్ పర్యేంకర్

# తాగునీరు



అనువాదం :
కాలిపు వీరభద్రుడు



ఈరోజు.. కాప్సేం ఊరి కొళాయిల్లో నీళ్ళు రాలేదు. ప్రతిరోజు ఉదయం పది గంటలకే నీళ్ళు వస్తూంటాయి. ఇప్పుడు మధ్యాహ్నం రెండయింది. ఇంతవరకూ కొళాయి రాలేదు. ఊళ్ళోని ఆడవాళ్ళంతా నీళ్ళకోసం ఎదురు చూస్తున్నారు. ఏడుకొండల ఘాటీలో పైప్‌లైన్ బద్దలయి లీకయింది. దాన్ని బాగుచేయాలంటే కనీసం రెండ్రోజులు పడుతుంది.

కొళాయిలకి నీళ్ళు వదిలే శంకరం ఒక్కసారి ఊళ్ళోకొచ్చి తిరిగి వెళ్ళిపోయాడు. ఈ వార్త కాప్సేం లోని రెండు పేటలకీ పాకిపోయింది. ఏ ఇంట్లో విన్నా నీళ్ళ గురించే చర్చ.

మొదట్లో గ్రామంలో రెండు పబ్లిక్ కొళాయిలుండేవి. ఒకటి ఎగువ పేటకి. రెండోది దిగువ పేటకి. కొళాయిల్లో నీళ్ళు రాగానే సందడి మొదలవుతుంది. అంతా అక్కడికి చేరతారు. అందరికీ నీళ్ళు అవసరమే. ఇక ఆడవాళ్ళ ప్రేలాపనలు, తగ

వులు, ఆ తర్వాత తిట్ల పురాణం. ఈ తగవులు, తిట్లు భరించలేక చాలామంది తమ ఇళ్లలోనే కొళాయిలు వేయించుకు న్నారు. అలా వేయించుకోలేని వాళ్ళు పబ్లిక్ కొళాయినుంచే పట్టుకుంటున్నారు.

ఇప్పుడు ముఖ్యమైన పైపులైనుకే చిల్లుప డింది. పైపులైను అడవిలోంచి కొండమీద ట్యాంకు వరకు వెళ్తుంది. ట్యాంకులోంచే నీటిని గ్రామానికి వదులుతారు.

గత కొన్నేళ్ళనుంచే పైప్‌లైను తరచూ లీకవుతూనే ఉంది. దాంతో గ్రామంలోని ప్రజలు ఎంతగానో విసిగి వేసారిపోతు న్నారు. ఇవ్వాళ కూడా మళ్ళీ అదే పరిస్థితి ఎదురయింది. మే నెల కావడంతో ఎండలు మండిపోతున్నాయి. ఏ వస్తువును తాకినా చురుక్కుమంటోంది. వాతావరణం మహా వేడిగావుంది. వర్షాకా లపు రోజుల్లో దేవాలయం దగ్గరున్న కొళాయి లోంచి నీరు దబదబా పడు తుంది. బట్టలు ఉతకడాలు, స్నానాలు, అంట్లు తోమడాలు వగైరా పనులన్నీ ఆ కొళాయి దగ్గరే చేసుకుంటారు. దీపావళి నాటికల్లా ఈ కొళాయిలలో మరి నీళ్ళు రావు. కాస్సేం గ్రామస్తులకి ఈ కొళాయి తప్ప మరో దారి లేదు.

ఓ అరగంటసేపు నడిచి వెళ్ళేంత దూరంలో కల్టీ నది ప్రవహిస్తుంది.

సఖారామ్, ఉదయ్, గోకుల్‌దాస్, బాతూ, షాబో.. వీళ్ళంతా మోటారు సైకిళ్ళు, సైకిళ్ళు తీసేరు. మగాళ్ళంతా ప్లాస్టిక్ డ్రమ్ములు పట్టుకొన్నారు. ఆడవాళ్లు బిందెలు, చిన్నపిల్లలు తపేలాలు పట్టుకు న్నారు. ప్రతి ఇంటి నుంచి ఇద్దరేసి ముగ్గు రేసి ఆ మండే ఎండలో కల్టీనదివైపు బయ లుదేరేరు. అటునుంచి నీళ్ళు మోసుకొస్తు న్నప్పుడయితే అందరూ చెమటతో తడిసి ముద్దయిపోవాల్సిందే. పిల్లల పరిస్థితి చెప్పనక్కర్లేదు. మగవాళ్ళు, ఆడవాళ్ళు ఉస్సూరుమంటూ అలసిపోతూంటారు.

నీళ్ళు రాని రెండోరోజున గ్రామస్తు లంతా మండిపడ్డారు. శంకరం సైకిల్ మీద వెళ్తూ గ్రామస్తుల కంటబడ్డాడు. ఆడ వాళ్ళు నిలదీసేరు. అది చూసి చాలా మంది ఆడవాళ్ళు అక్కడ పోగయ్యేరు.

"నీళ్ళొదలరేం? " అని ఆడవాళ్లంతా అతనిచుట్టూ కందిరీగల్లాగా ముసురుకొని విరుచుకుపడ్డారు.

"నీళ్ళకోసం ఇంకెన్ని రోజులు ఎదురు చూడాలి? ఏటికి వెళ్ళి నీళ్ళు తెచ్చుకోవా లంటే ప్రాణాలుపోతున్నాయి."

"మీ పేటకి మాత్రమే కాదమ్మా. ఊరంతా ఇలాగే ఉంది. పైపు ఇవాళ కూడా బాగవలేదు. అది బాగై నీళ్ళు రాగానే వెంటనే వదుల్తాగా" శంకరం

కోపంతో అన్నాడు.
"ఎప్పుడొస్తాయి నీళ్ళు ఆс...? వంటకి కూడా చుక్కలేదు"
"స్నానాలకి నీళ్ళు లేవు"
"బట్టలుతకడానికి లేవు"
"నీళ్ళులేక మొక్కలు ఎండుతున్నాయి"
"ఆవులకి, గేదెలకీ కూడా తాగడానికి నీళ్ళు లేవు"
ఆడవాళ్లంతా తమ తమ కష్టాల్ని శంకరం ముందు ఏకరువు పెట్టారు.
"నాతో చెబితే లాభమేమిటి? ఇంజనీరు గారి ఆఫీసుకి వెళ్ళి గోడు వెళ్ళబుచ్చుకోండి"
తన మీద ఆడవాళ్ళంతా అక్కసు వెళ్ళ గక్కడంతో శంకరానికి చిర్రెత్తుకొచ్చింది. అతనా పక్క గ్రామంలో ఉంటున్నాడు. నాలుగేళ్ళ నుంచి ఆ చుట్టుపక్కల ఊళ్ళకి కొళాయిలు వదలడం అతని పని.
"మీరంతా ఇతనిమీద కళ్ళెర్రచేస్తారే మిటి? ఇతనేమన్నా పగిలిన పైపుని బాగు చేస్తాడా? పైపులోంచి నీళ్ళొస్తే కొళాయి ల్లోకి వదులుతాడు" ఆ సమయానికి దత్తా అక్కడికి వచ్చి ఆడవాళ్ళకి సర్దిచెప్పాడు. శంకరంకి ప్రాణం కుదుటపడింది. ఈ లోగా ఊళ్ళోవున్న మిగతా వాళ్ళంతా అక్క డికి చేరుకున్నారు.
"అవును శంకరం చెప్పినట్టుగానే మేమంతా ఇంజనీర్ దగ్గరికి వెళ్తాం. అంతే గాని సర్పంచి దగ్గరికి మాత్రం వెళ్ళేది లేదు. నీళ్ళ కోసం ఊరి జనం ఎన్ని అవస్థలు పడుతున్నారో అనే ఆలోచన ఆయనగారికే వుంటే మన పేటకి వచ్చి మంచిచెడ్డలు వాకబు చేసివుండేవాడు" తులసీదాస్ అన్నాడు.
"ఇంజనీర్ మనం చెప్పేది ఎందుకు వినడు? వింటాడు. నీటి పన్ను కడుతూ నేవున్నాంగా" కస్తూరిబాయి అనేసింది కోపంతో.
ఆ మర్నాడే అందరూ వెళ్ళి ఇంజనీ ర్ని కలిశారు కూడా.
"చూడండీ.. పగిలిన పైపుని బాగుచే యాలంటే ఇంకా రెండు రోజులు పడు తుంది. రేపు ఉదయం మీ ఊళ్ళోకి నీళ్ళ టాంకర్ పంపుతాన్లే" అంటూ ఇంజనీర్ అందర్నీ పంపించేసేడు.
మర్నాడు ఉదయం పదికల్లా ఆ ఊరికి వాటర్‌టాంకరు వచ్చింది. కుండలు, బిందెలు, బాల్చీలు, అన్ని రకాల పాత్రలు పట్టుకొని అంతా టాంకర్ చుట్టూ మూగారు. ఆడవాళ్ళంతా.. నేను ముందంటే నేను ముందని ఒకర్నొకరు తోసుకున్నారు. "మిగిలిన పేటల వాళ్ళకి కూడా నీళ్ళు ఇవ్వాలిగదా" అంటూ ట్యాంక ర్‌వాడు అక్కడున్నవాళ్ళకి కొంచె కొంచెమే నీళ్ళిచ్చి మరోచోటకి బయలుదేరేడు. చాలా పాత్రలు ఖాళీగా ఉండిపోయాయి. ఆడవా ళ్ళకి చిర్రెత్తుకొచ్చింది. టాంకర్‌వాడ్ని నానా తిట్లతో సాగనంపేరు.
"సచ్చినోడు.. మనకేమిస్తాడు నీళ్ళు! ఒక్క బిందె నీళ్ళు ఏం చేసుకుంటాం" ఎగు వపేటలోని ఓ మహిళ కోపంతో ఊగి పోతూ టాంకర్‌వాడ్ని 'దీవించింది'
"మనం ఇక్కడే ట్యాంకర్ టైర్‌లోంచి గాలి తీసేయాల్సింది. అలాగయితే మనం దరికీ నీళ్ళు దొరికేవి" కొందరు కుర్రాళ్ళు కోపాన్ని చూపించారు.
"ఒక్క బిందెకంటే ఎక్కువివ్వలేదు... వీడ్ని పులెత్తుకుపోను. రేపు వస్తాడుగదా చూపిస్తాను తడాఖా" దిగువపేటకుచెందిన ఆవడూ పళ్ళు పటపటలాడించింది.
మర్నాడు టాంకర్ రాలేదు. మళ్ళీ అదే గోల. జనం ఇటూ అటూ పరుగులు. అంతా కల్టీనదివైపు బయలుదేరేరు. రెండు రోజులయినా నీళ్ళు రాలేదు. రెండురోజులనే ఇంజనీర్ అన్నాడు. ఇవా ల్టికి అయిదు రోజులయింది. నీళ్ళు లేవు. అనుకున్నారంతా.
"నీళ్ళపైపు బాగయింది. రాత్రికి కొళా యిలు ఏ వేళకయినా రావచ్చు" శంకరం

వార్త తెచ్చేడు. అందరికీ చెప్పేసి వెళ్ళిపోయేడు. అంతా ఆనందంతో ఊగిపోయేరు.

అంతా తమ తమ కొళాయిల మూతులు విప్పి ఉంచుకున్నారు. కొందరు ఆడవాళ్ళయితే తడవ తడవకీ కొళాయిల దగ్గరకెళ్ళి చూసొస్తున్నారు. నీళ్ళే వస్తే కొళాయి మూతుల్లోంచి చుంయ్.. చుంయ్ శబ్దం వస్తుందని వాళ్ళకి తెలిసివున్నా వెళ్తున్నారు, చూస్తున్నారు. వెనక్కి వచ్చేస్తున్నారు. కొళాయిల్లోంచి అలాంటి ధ్వని ఏమాత్రం వినిపించలేదు.

నీళ్లొస్తాయని చూస్తూ చూస్తూ.. అర్ధరాత్రి గడిచింది. చంద్రుడి గుడ్డివెలుగు పరుచుకుంది. కాప్సెం గ్రామం మేల్కొనే ఉంది. అది వేసవి కాలమవటంతో, జనాలు వీధుల్లోనే మంచాలు వేసుకొని సాగిలపడ్డారు. మాటా మంతీ సాగుతోంది. రాత్రి ఏ సమయంలోనో నీళ్ళు వచ్చిపోయినట్టయితే మర్నాడుదయం మళ్ళీ శంకరం నీళ్ళొదలడు. ఈ ఆలోచనతోనే తలలు పట్టుకొని ఎగువ దిగువ పేటల జనాలంతా కునుకు లేకుండా జాగరణ చేస్తున్నారు.

గోకలమ్మ ఇల్లు దిగువ పేటలో ఉంది. ఆమె కొళాయి కనెక్షన్ తీసుకోలేదు. తన ఇంటికి కొంచెం దూరంలోనే ఉండే పబ్లిక్ కొళాయినుంచే నీళ్ళు పట్టుకుంటుంది. దాంతో ఆమె కూడా అందరితోబాటుగా మేల్కొనే ఉంది. ఆమె భర్త చనిపోయి అయిదేళ్ళు దాటింది. ఆమెకు ముగ్గురు పిల్లలు. ముగ్గురూ అమ్మాయిలే. గోకలమ్మ వాళ్లకి పక్కలు వేసి, తాను అక్కడే వున్న అరుగుమీద కూర్చుంది. పాన్ డబ్బా తెరిచి వక్కపొడి పలుకులు తీసి నోట్లో వేసుకుంది.

"కొళాయిలోంచి ఇంతవరకూ నీళ్ళు రాలేదు. ముందు నుంచే కొళాయి దగ్గర కుండలు పెట్టుకుంటే మంచిదేమో" అనుకుంది గోకలమ్మ. రెండు కుండలు పట్టుకొని కొళాయి దగ్గరికెళ్ళింది. అప్పటికే ఆవడూ తన కుండల్ని వరుసక్రమంలో పెట్టడాన్ని చూసింది. మిగతావాళ్ళు కూడా కుండల్ని వరసలో పెట్టేసే ఉంచారు.

"ఈ కొళాయిలకేం రోగమొచ్చిందో! అయిదు రోజులుగా నీళ్ళు లేవు. ఇంట్లో చుక్క నీళ్లు లేవు. నీళ్ళు లేనిదే ఎలా ఉండగలం? ప్రభుత్వం ఏ వరదలో కొట్టుకుపోయిందో! ఒక్క రోజు ట్యాంకర్ పంపి మన మొఖాన ఇన్ని నీళ్ళు చల్లారు. ఆ తర్వాత మరి కనిపించలేదు" గోకలమ్మని చూసి ఆవడూ గొణుక్కుంటున్నట్టుగా అంది.

"కొళాయిని తిట్టి ఏం లాభం? నీళ్ళొస్తే సరే. ఇంతకీ మనల్ని మనం నిందించుకోవాలి. కొళాయిలు రాకముందు నూతి నీళ్ళు తాగిన వాళ్ళమేగదా"

"అవును గోకల పిన్నీ.. నువ్వు చెప్పిందీ నిజమే. వానలు పడకపోతే నూతులన్నీ ఎండిపోతాయి. అయినా మన కడపీ చెరువు మాత్రం ఏనాడూ ఎండిపోదు. ఏడాది పొడుగునా నీరే నీరు. పొరుగూరువాళ్ళు కూడా వచ్చి నీళ్ళు పట్టుకుపోతారు" ఆవడూ గతాన్ని గుర్తుచేసుకుంది.

"ఇదిగో రోడ్డు వచ్చి చెరువుని మింగేసింది. ఇప్పుడా చెరువుమీదనుంచే అన్ని బళ్ళూ వచ్చీపోతున్నాయి. చెరువు పూడ్చొద్దని నేనెంతగా నెత్తినోరూ మొత్తుకున్నా నా మాట ఎవ్వరూ పట్టించుకోలేదు. ఆఖరికి తెగించి నేనొక్కదాన్నే ఆ విషయమై పోరాడిన సంగతి మీ అందరికీ తెలిసిందే" గోకలమ్మ ఆనాటి తన అక్కసు వెళ్ళగక్కింది.

★ ★ ★

కాప్సెం గ్రామంలో ఆ చెరువు చాలా పురాతనమైంది. వేసవిలోనూ ఎండదు. దేవాలయంలోని బావి కూడా వేసవిలో ఎండిపోతుంది. పొడవైన కొబ్బరితాడుతో ఓ చేదెడు నీళ్ళు పైకి తీయాలంటే ఎంతో



కష్టపడాలి. ఎక్కడెక్కడ్నుంచో ఊళ్ళోకి చాలా కుటుంబాలు వచ్చాయి. మంచి నీళ్ళకిప్పుడు మరింత కటకట, మరింత ఇబ్బంది ఏర్పడింది. ఇప్పుడీ ఊరికి తాగు నీటి సమస్య వచ్చిపడింది. పెద్దలంతా ఒకచోట చేరి నీటి సమస్య గురించి మాట్లాడుకున్నారు. చెరువునే బాగుచేయా లనుకున్నారు. వీలయినంతవరకు బాగుచే శారు కూడా. అయినా నీటి ఎద్దడి తీర లేదు. మళ్ళీ పంచాయితీ సమావేశమ యింది. ఊళ్ళోవాళ్ళంతా అక్కడికి వచ్చారు. నీళ్ళు లేవు. నిజమే, ఇప్పుడేం చేయాలి? ..... అందరి ఆలోచనా ఇదే.

పశువులకాపరి సోమా లేచి అన్నాడు "గోవులుండే జాగాకి దగ్గర్లో అత్తిచెట్టుంది. దానికి దగ్గర్లో బావి తవ్వితే పదిహేను మూరల్లోపే నీళ్ళు బయటికి తన్నుకొస్తా యని నా నమ్మకం" అతని మాటకి అంతా అంగీకరించారు. నుయ్యి తవ్వే రోజు కూడా నిర్ణయించుకున్నారు. పలుగూ పార లూ తట్టా బుట్టలు పట్టుకొని ఊళ్ళోవా ళ్ళంతా గోస్థలం దగ్గరికి చేరుకున్నారు. నుయ్యి తవ్వే చోటుని నిర్ధారించుకొని తవ్వడం ఆరంభించారు. ఇరవై రోజులు కావస్తూంది. పని జరుగుతూనే ఉంది. గునపం నేలలోకి దిగడంలేదు. కింద రాయి పడింది.. అంతా నిరాశతో కూలబడిపోయారు.

'ముసలాడి మాటలు పొల్లు అయ్యేయి' అంటూ ఊరంతా అతన్ని దోషిగా నిలబెట్టింది. పౌరుషంతో సోమా నూతిలోకి దిగేడు. గునపంతో రాతిని పొడవసాగేడు. మిగతావాళ్ళు కూడా అతనితో చేతులు కలిపారు. అంతే.. అక్కడొక అద్భుతం జరిగింది. రాతిని చీల్చుకుంటూ నీరు పైకి ఎగజిమ్మింది. ఇంకేముంది, అంతా ఆనందంతో కేకలు పెట్టారు. గంతులు వేశారు.... సోమా మాటలు నిజమయ్యేయి. అంతా కలసి మంచినీటి బావి నిర్మించుకున్నారు. అక్కడ్నుంచి చూస్తే సాతేరి మందిరం కనిపిస్తుంది. బావి దగ్గర్నుంచి మందిరానికి కాలిబాట ఉంది. వర్షాకాలంలో బావిలో చేతికి అందేంత పైకి నీరుంటుంది. అప్పుడు చేత్తోనే నీళ్లు తోడుకుంటారు. వేసవి కాలంలో నీటి మట్టం పడిపోయి అడుగు భాగం కనిపిస్తూ ఉంటుంది. అయితే ఆ బావిలో నీళ్ళు చల్లగా ఉంటాయి. ముఖం మీద, కళ్ళమీద దోసిళ్ళతో నీళ్లు పోసుకుంటే హాయిగా ఉంటుంది. ఆ దారిన వచ్చేపోయేవాళ్ళు ఆ నీళ్ళు తాగితే వాళ్ళ వంట్లోకి జీవశక్తి వస్తుంది. ఊళ్ళోవాళ్ళు ఆ నూతి దగ్గరే స్నానాలు చేయాలని ఉబలాటపడతారు.

నూతికి దగ్గర్లో ఉన్న పనసచెట్ల నీడలో ఆవులు విశ్రమిస్తాయి. పశువుల కాపర్లు నీళ్ళుతోడి ఆవుల ముందు పెడతారు. పశువుల పండుగ సందర్భంగా కాపర్లు నూతిచుట్టూ మొలిచిన తుప్పలూ పిచ్చిమొక్కలూ తీసేసి శుభ్రంగా చదును చేస్తారు. పండుగ ఇంకా మూడు నాలుగు రోజులుండగా ఈ పన్లన్నీ చేస్తారు. కొబ్బరి కమ్మల్లాంటివాటితో మండపాలు కడతారు. నూతి చుట్టూ వున్న ప్రదేశాన్ని వేడుకకు సిద్ధం చేస్తారు. పశువుల్ని కడిగి వాటి కొమ్ములకి రంగులు పూసి పూలతోరణాలు కడతారు. మెడలో పూలహారాలు వేస్తారు. మండపంలో బాలకృష్ణుడి విగ్రహం పెట్టి, భజనకార్యక్రమాలు నిర్వహిస్తారు.

కొన్నేళ్ళకి కాప్సేం గ్రామంలోకి కొళాయి నీళ్ళు వచ్చాయి. ఆడజనమంతా తలా ఓ మాట అన్నారు. 'నీళ్ళు మందు వాసన' అని ఒకామె అంది. 'వంటకి కానీ తాగడానికి కానీ ఈ నీళ్ళు పనికిరావ'ని ఇంకో ఆమె అంది. దాంతో ఊళ్ళోవాళ్ళంతా ఆ నీటి వాడకం మానేశారు. బట్టలు ఉతకడానికి, అంట్లు తోమడానికి మాత్రమే కొళాయి నీళ్ళు వాడసాగారు. వంటకి, తాగడానికి బావి నీళ్ళు ఉండనే ఉన్నాయి. ఇలా రెండేళ్ళు గడిచింది. ఆ తర్వాత పరిస్థితి పూర్తిగా మారిపోయింది. నీళ్ళకోసమని బావి దగ్గరికి వెళ్ళడం తగ్గించేశారు. బావిలో అత్తిచెట్టు ఆకులు పడుతున్నాయి. కప్పలు చచ్చి తేల్తున్నాయి. ఊరిజనం బావినీళ్ళు వాడాలంటే ఇష్టపడటంలేదు.

గోకలమ్మ మాత్రం బావిని వదల్లేదు. వంటకి, తాగడానికి బట్టలు ఉతకడం వగైరా అన్నిటికీ ఆ నీరే. బావి దగ్గరికి వెళ్ళడమంటేనే ఆమెకెంతో ఇష్టం. ఒకనాడు గోకలమ్మ నీరు తోడుతుంటే, ఎగువపేటలో ఉండే కస్తూరి వచ్చి గట్టిగా అంది "ఏమిటి నీ చాదస్తం! ఒకానొకనాడు నువ్వే బావిలో పడి చస్తావో ఏమిటో? ఊళ్ళో మంచినీటి కుళాయిలు ఉన్నా రెండు ఝాముల మండుటెండలో నీటికోసం నీకెందుకీ ఆరాటం? " చనువుగా గదమాయించింది.

"కొళాయిలోంచి నీళ్ళు రాకపోతే మీ అందరికీ తెలిసొస్తది, మన బావి నీళ్ళే మంచివని" గోకలమ్మ అంది. కస్తూరి మాట్లాడకుండా వెళ్ళిపోయింది.

మరి కొన్నేళ్ళు గడిచాయి. బావి లోపలా బయటా పిచ్చిమొక్కలు మొలిచాయి. వాటి ఆకులు పడి నీళ్ళు కుళ్ళుతున్నాయి. బావి చుట్టూ కట్టిన రాతి పిట్టగోడ కూలిపోయింది. కొన్ని రాళ్ళు

బావిలో పడిపోతే, కొన్నింటిని ఊళ్ళో వాళ్లు ఎత్తుకుపోయారు. కాలక్రమేణా బావి ఎక్కడుందో తెలియని పరిస్థితి ఏర్పడింది.

'పాడుబడ్డ ఆ బావిలో పశువులు గానీ ఆడుకోడానికి వేళ్ళే పిల్లలుగానీ పడిపో వచ్చు'.. ఊళ్ళోవాళ్ళకీ చింత పట్టుకొంది.

అయితే గోకలమ్మ మాత్రం 'బావిని బాగుచేయాల'ని బతిమాలుతూ చాలా సార్లు చెప్పింది. కానీ ఆమె మాటల్ని ఎవరూ పట్టించుకోలేదు.

"దసరా, కాలో, సిగమోత్సవ సందర్భా లలో మందిరం వరకు ఉండే బాటలో వాహనాలు నడవాలి" అని ఊళ్ళోవా ళ్ళంతా కోరేరు.

ఆ ఏడాది పంచాయితీవాళ్ళు మందిరం వరకు రోడ్డు వేయించే పనికి పూనుకు న్నారు. "మందిరానికి వెళ్ళే రోడ్డు వెడ ల్పుగా ఉండాలి" సర్పంచి గారబ్బాయి నారాయణ్ తన అభిప్రాయాన్ని చెప్పేడు.

ఈ నేల బావి దారికి అడ్డంగా ఉంది. చుట్టూవున్న మొక్కలు, తుప్పలు బావిని కప్పేశాయి. దాన్ని పూడ్చివేయాలని అందరూ నిర్ణయించారు. బావి నామరూ పాల్లేకుండా పోయింది. ఇప్పుడు దారి వెడ ల్పయింది. వాహనాలన్నీ మందిరం వరకూ నిరాటంకంగా వచ్చిపోతున్నాయి.

★ ★ ★

గోకలమ్మకి తాగునీటికి సంబంధించిన సంఘటనలన్నీ ఇంతవరకూ ఆమె కళ్ళ ముందు సినిమా రీల్‌లాగ తిరిగాయి. పదమూడేళ్లకిందట జరిగిన విషయాలన్నీ ఆమెకు గుర్తొచ్చాయి. కొళాయిల్లోంచి నీళ్ళు రాడానికి ముందుగానే ఆమె కళ్ళల్లోంచి కన్నీటికాల్వలు ప్రవహించేయి.

"ఆవడూ బాయీ! కొళాయిలోంచి నీళ్ళు వచ్చేటట్టుగా అనిపించడం లేదు. బాగా రాత్రయింది. ఇళ్ళకి పోదాం పద. ఇంకెం తసేపని మేల్కొని ఉంటాం" అంటూ గోక లమ్మ కన్నీటిని ఆపుకోడానికి పైటకొంగు నోటికడ్డంగా పెట్టుకొని అంది.

"అంతా వెళ్లిపోయేరు. మనం మాత్రం ఎందుకిక్కడ? నాకూ నిద్రముంచు కొస్తోంది" అంటూ ఆవడూబాయి గోక లమ్మ వెనకే బయలుదేరింది.

అవాళ్టి రాత్రి కుళాయి నీళ్లు రాలేదు. తెల్లవారగానే రెండు ట్యాంకర్లతో నీళ్ళు వచ్చాయి. ఒక టాంకర్ ఎగువపేటకి, రెండోది దిగువపేటకి. మరికొంచెంసేప య్యాక ఎమ్మెల్యేగారు కారులో వచ్చారు. సర్పంచ్ స్కూటర్‌మీద వచ్చాడు. కార్యక ర్తలు, పెద్దలు అంతా పరుగెత్తుకొచ్చారు. ఊళ్ళోని ఆడవాళ్లంతా బిందెలు వగైరా పాత్రలతో ట్యాంకర్ వైపు పరుగెత్తేరు. ఎమ్మెల్యే బండి దిగారు. 'ఎమ్మెల్యేగారికి జిందాబాద్' అని ఎవరో అనడంతో అక్క డున్నవారంతా 'ఎమ్మెల్యేగారికి జిందాబాద్' అంటూ స్వరం కలిపారు. మేఘాల గర్జ నతో పాటు హోరున వర్షం కురుస్తున్న ట్టుగా నినాదాలు జోరందుకున్నాయి.

ఇవాళ ట్యాంకర్ నీళ్ళు తృప్తిగా దొరి కాయి. ఆడవాళ్లంతా నింపాదిగా నీళ్ళు పట్టుకుంటూ ఆనందిస్తున్నారు. చాలా మంది ఇళ్ళలో నీళ్ళు పోసుకొని, మళ్ళీ ఖాళీ పాత్రతో పరుగెత్తుకు వస్తున్నారు.

గోకలమ్మకి ఈ హడావుడి నచ్చలేదు. ఆమె పార, గునపం, పలుగు తీసింది. గమేలా పట్టుకుంది. వీధిలోంచి అలా.. పూడ్చివేసిన బావి వైపు బయలుదేరింది. అత్తిచెట్టు దగ్గరకి వచ్చింది. అక్కడ నిల్చొని చుట్టూ చూసింది. బావి ఉండే చోటు ఇదేనన్న నిశ్చయానికి వచ్చింది. నడుంచుట్టూ పైటచెంగుని బిగించింది.

"అవునవును, ఇదే చోటు. ఇదే నా బావి. దీన్ని మళ్ళీ తవ్వుతాను. చేతనయి నంతవరకు మట్టిని బయటికి తీస్తాను..." అనుకొంటూ గోకలమ్మ తన శక్తినంతట్నీ కూడదీసుకొని గడ్డపలుగుని పైకంతా ఎత్తి ఒక్కసారిగా భూమిలోకి దించింది. V

కన్నడ కథ

-ఎస్.బి. జోగుర్

అనువాదం :
పాణ్యం రామశేషశాస్త్రి

# స్వాభిమానం



**హు**బ్లీ నగరం బస్‌స్టేషన్. మెర్క్యురీ దీపాల కాంతితో అక్కడ పట్టపగల్లా వుంది. తూర్పు దిక్కు నుండి అప్పుడే సూర్యుని లేలేతకిరణాలు మబ్బులచాటునుండి తొంగి చూస్తున్నాయి. సూర్యోదయమయిందంటూ బస్‌స్టేషన్ ఆవరణ చివరవున్న చెట్లపై కాకులు అరిచి చెప్తున్నాయి. పిచ్చుకలు మరి కొన్ని పక్షులూ ధ్వనులు చేస్తూ తమ గూళ్లనుండి బయటకొచ్చి, బస్టాండులోని దూలాలు, దిమ్మెలపై కూర్చొని రెక్కలను సరిచేసుకుంటున్నాయి. రాతిబెంచీలు,

COLLEGE

సిమెంటు నేలపైన పడుకొన్న ప్రయాణీకులు మాత్రం ఇంకా నిద్ర లో జోగుతూనేవున్నారు. కొంత మంది గురకలుపెడుతున్నారు. బిచ్చగాళ్ళు, చిన్న చిన్న పనులు చేసి పొట్ట పోసుకొనేవారూ నిద్రలేచి తమ పనులకు వెళ్లాలని బద్ధకంగా కదులుతున్నారు. పేపర్ బాయ్స్ దినపత్రికలను అమ్మకానికి సిద్ధంచేస్తున్నారు. వేరే వూళ్లనుంచి వచ్చిన బస్సులు స్టాండులో రెండు మూడు నిమిషాలు మాత్రమే ఆగి అక్కడినుంచి కదిలివెళ్తున్నాయి. ముసలి ప్రయాణీకులు ఉదయం చలిగాలికి దగ్గుతూ లేచి ప్లాట్‌ఫారం అంచుకు వెళ్లి ఉమ్మివేస్తూ.. ఎండ ఎప్పుడు వస్తుందా అని తూర్పు దిక్కున పరీక్షగా చూస్తున్నారు. లగేజీతో వున్న ప్రయాణీకులు దొంగలభయంతో కళ్లు మూసుకొని నిద్రపోలేక, ముంచుకొస్తున్న నిద్రతో మేల్కొని వుండలేక అరగన్ను మాగన్నుగా అవస్థపడుతున్నారు. మంచువల్ల రాతిబెంచీలు తడిగా వున్నాయి. కొందరు చేతి రుమాళ్ళతో, తువాళ్ళతో బెంచీలు తుడిచి కూర్చుంటున్నారు. చాయ్‌లు అమ్మే కుర్రోడొకడు కెటిల్‌ను ఒకచేత్తో, పేపరు కప్పులు మరో చేత్తో పట్టుకుని, 'వేడివేడి చాయ్' అని అరుస్తూ పోతున్నాడు. చాయ్ వేడిగా వుందో లేదోగాని, 'చాయ్' అని అరచినప్పుడల్లా, అతని నోటినుంచి వేడి ఆవిరులు మబ్బుల్లాగ పైకి లేచి గాలిలో కలిసిపోతున్నాయి. తమ బస్సు వచ్చే వేళయిందని.. లేచి నిలబడ్డ వారందరూ చలికి పళ్లు బిగబట్టి అరచేతులు రుద్దుకుంటూ నిలబడ్డారు. వారిలో కొందరు 'హుబ్లీలో ఈ సంవత్సరం చలి ఎక్కువ' అని పక్కవాళ్ళతో చెప్తున్నారు.

బస్టాండుకు ఒక మూలలో.. చెక్కలతో చేసిన చిన్నపాటి బంకు. నలుమూలలా ఎత్తయిన రాళ్ళపై పెట్టివుంది. దాని ముందు కొంచెం ఖాళీ స్థలం, అందుచేత ఆ బంకు అడుగున ఖాళీ స్థలం ఏర్పడింది. కమ్మరి చంద్రప్ప ప్రతిరోజూ రాత్రిళ్లు తన సామాన్లు, సరంజామా నంతటినీ పొందికగా ఒక సంచీలో సర్ది ఆ బంకుకింద ఖాళీ స్థలంలో దూర్చిపెట్టి, తను ఆ బంకు ముందరే పడుకుంటాడు. అతని సరంజామా అంటే, ఒక చిరుగు కంబళి, ఒక చాప, దిండు, జత పాత దుస్తులు, చెంబు, పళ్ళెం- గ్లాసు. మూడు రోజుల క్రితమే అతను ఒక ప్లాస్టిక్ బకెట్, మగ్గు కొన్నాడు. తెల్లవారకము

నుపే లేచి కాలకృత్యాలు తీర్చుకుని బస్టాండుకు మరో మూలన వున్న నీళ్ళ పంపు దగ్గర స్నానంచేసి వస్తాడు. అర కప్పు చాయ్ తాగి, తన వ్యాపారం ప్రారం భిస్తాడు. నిజానికి చంద్రప్ప రోజూ ఆల స్యంగా నిద్రలేచేవాడు. అయితే కొన్నిరో జులకిందే, ఒక టి.వి. ఛానెల్ వాళ్లు ఇతని గురించి తెలుసుకుని బస్టాండుకు వచ్చి, ఇతని వ్యాపారం గురించి, ఇతని బస్టాండు నివాసం గురించి చిత్రించి, 'స్వాభిమాని చంద్రప్ప' కార్యక్రమం కింద ప్రసారం చేశారు. బస్టాండులో వేలాడదీ సిన టీవీలో నుంచి తన పేరు వినబడ గానే అటు వైపు తిరిగి కూర్చొని ఆ కార్య క్రమమంతా చూశాడు. టీవీలో తనని చూసిన వారెవరైనా చూడ్డానికి తన దగ్గ రకి రావచ్చునుకుని.. మరుసటి రోజు నుం చే తెల్లవారకముందే నిద్రలేచేవాడు. ఎవ్వరూ నీటిపంపు దగ్గరకు రాకముందే వెళ్ళి గబగబా స్నానం ముగించుకొని వచ్చి, తను రోజూ కూర్చొనే ఫుట్‌పాత్ మీద ఉదయం ఆరుగంటలకే సిద్ధంగా వుండసాగాడు.

ఇంతకీ చంద్రప్ప వ్యాపారం.. కాలిలో ముల్లు తీయడానికి పనికొచ్చే సూదిలాంటి పరికరం, చెవిలో గుబిలి తీయడానికి పనికొచ్చే కడ్డీ, పళ్ళు కుట్టుకునే సూది లాంటి రాగికడ్డీ. ఈ మూడూ కలిపి సెట్టుగా ఐదు రూపాయలకు అమ్ముతుం టాడు. ఈ సెట్లు రోజుకు ఒకటో, రెండో అమ్ముడుపోతే గొప్ప. ఒక్కటి కూడా అమ్ముడుపోని రోజులెన్నో వున్నాయి. అటువంటప్పుడు మంచి నీళ్లతోనే పొట్ట నింపుకొని పడుకున్న రాత్రిళ్ళూ వున్నాయి! టి.వి.లో అతని గురించి కార్యక్రమం ప్రసారమయిన తరువాత కొన్నిరోజులు అతన్ని చూడాలని వచ్చినవాళ్లు.. తమక వసరం లేకపోయినా చంద్రప్ప అమ్మే సెట్టును కొని తీసుకువెళ్లేవారు. కొందరు ఐదుకు బదులు పది రూపాయలు ఇచ్చి తీసుకెళ్లినవాళ్ళూ వున్నారు. ఇవన్నీ మాకెందుకు? ఈ పది రూపాయలు ఊర కనే తీసుకోమంటే స్వాభిమాని అయిన చంద్రప్ప తిరస్కరించడం, దాంతో వాళ్లు ఆ పరికరాల సెట్టు పట్టుకెళ్లడం జరిగింది.

చంద్రప్ప వయస్సు ఎనభై పైనే. అతని ఊరు 'సవదత్తి'. చేతనయింతకాలం ఆ ఊళ్లో కమ్మరి పనిచేస్తూ వుండేవాడు. భార్య, నలుగురు పిల్లలు- ఇద్దరు ఆడ, ఇద్దరు మగ. వచ్చిన అరకొర సంపాదన తో ఆ కుటుంబాన్ని పోషించాడు. ఆడపి ల్లలిద్దరికీ పెళ్లిళ్లు చేసి పంపించాడు. తన కొడుకులు తనలాగే కష్టపడరాదని.. చేత నయినంతలో మంచి చదువులే చదివిం చాడు. దాంతో ఒకడు ఉపాధ్యాయుడైతే, మరొకడు బ్యాంకు గుమాస్తా అయ్యాడు. వాళ్ళిద్దరికీ పెళ్లిళ్లు కావడమూ, చంద్రప్ప తాత కావడమూ జరిగిపోయాయి. అంతలో అతని భార్య కన్ను మూసింది.

వయస్సు పైబడడంతో, చంద్రప్ప కమ్మరి పనిచేయలేని స్థితికి చేరుకున్నాడు. అప్పటినుంచి కోడళ్ల సూటిపోటి మాటలు, ఈసడింపులూ మొదలయ్యాయి. 'తిండి దండుగ' అంటూ వాళ్లు తన వెనక గుసగుసలాడటం రెండు మూడుసార్లు అతని చెవిన పడింది. ఆ మాటలు పడలే కపోయాడు చంద్రప్ప. కట్టుబట్టల్తో సవ దత్తి వదిలి హుబ్లి చేరుకున్నాడు. అప్ప ట్నుంచి ఫుట్‌పాత్‌పైన ముల్లు సెట్ల వ్యాపారం మొదలుపెట్టాడు.

అయితే హుబ్లీనగరంలో ముళ్లకంపలు, ముళ్ళచెట్ల బాధే లేదు. అక్కడే పుట్టి పెరిగినవారికి 'ముల్లు' అనేదే తెలిసివుం డదు. అలాంటప్పుడు చంద్రప్ప అమ్మ జూపే 'ముల్లు తీసే' పరికరం ప్రయో జనం ఎంత మాత్రం? ఈ ప్రశ్న చంద్ర ప్పకు వేస్తే, "శ్రమజీవికి ఎన్నడూ ఉపవా సాలుండవు దొరా!" అంటాడు. రంగు వెలి

సిన రుమాలును తలకుచుట్టి సాధారణ పంచె, అంగీ ధరించి, కాళ్లకు టైరు చెప్పులతో వుంటాడు. ముల్లు సెట్లు తగిలించిన తీగ చుట్టను తన ముందుంచుకొని, హుబ్లీలో జనతా బజార్ పక్కన ఫుట్ పాత్ పైన కూర్చొని అమ్మేవాడు.

జనతాబజార్‌లో అన్ని రకాల కిరాణా సరుకులకు తోడు పూలు, పండ్లు, కూరగాయలు అమ్మే అంగళ్లూ ఉన్నాయి. ఆ వ్యాపారస్తులు తమ సరుకుల పేర్లు, వాటి ధరలు అరిచి చెప్తుంటారు. కాని అరిచి చెప్పేది ఒకటి, జనం కొనబోతే చెప్పేది మరొకటి. ధరల వరకే కాదు, తూకాల్లోనూ తేడాలే.

ఒకరోజు ఓ యువకుడు స్కూటర్‌పై వచ్చి, ఆపిల్ పండ్లు బేరంచేసి, కిలోకి తూకం వేయించి ప్యాక్ చెయ్యమన్నాడు. అంగడతను పళ్లను ప్యాక్ చేసేందుకు

కవర్లు వెదుకుతుంటే, ఆ యువకుడు డబ్బు తీసివ్వడానికి తన స్కూటర్‌వైపు తిరిగాడు. ఆ వ్యవధిలో వ్యాపారి పండ్ల ప్యాకెట్టు మార్చేశాడు. కొన్న పండ్ల ప్యాకెట్టు దాచేసి.. ఇంతకు ముందెప్పుడో కట్టివుంచిన తక్కువ వెలగల పండ్ల ప్యాకెట్టు ఆ యువకుడి చేతి సంచిలో వేశాడు. దీనిని గమనించని అతను సంచి తీసుకుని వెళుతుంటే చంద్రప్ప అతన్ని పిలిచి "బాబుగారూ, మీ సంచిలోని ఆపిల్ పళ్ళనోసారి చూసుకోండి" అన్నాడు. ఆ మాట అంతరార్థమేమిటో బోధపడకపోయినా, ఆ యువకుడు సంచిలోని పండ్ల కవరు తెరచి చూశాడు. అక్కడ కనబడినవి తాను బేరం చేసి కొన్న పండ్లు కావు! అవి తక్కువ ఖరీదువి. దీంతో కోపంతో ఆ యువకుడు పండ్ల అంగడి వాణ్ణి పట్టుకొని కొట్టబోయాడు. ఇరుగుపొరుగు అంగళ్ళవాళ్ళు అడ్డుపడి, "ఏదో పొరపాటు జరిగి ఉంటుందిలేండి. మీ ప్యాకెట్ వేరొకరికి, వారిది మీకు చేరివుంటుంది. పొరపాట్లు సహజమే. దానికి గొడవెందుకు? మీకు మంచివి మళ్ళీ తూచి ఇస్తాడు" అని సర్దిచెప్పి ఆ యువకుణ్ణి శాంతింపజేశారు.

అతను వెళ్లిపోగానే వారు చంద్రప్పపై పడ్డారు. "ఏయ్ ముసలోడా! పోన్లే అని ఇక్కడ కూర్చోనిస్తే అందరి వ్యాపారాల్లో తలదూరుస్తావెందుకు? వ్యాపారం అంటేనే మోసం. అందరూ సత్యహరిశ్చంద్రులే ఐతే పెళ్ళాం పిల్లల్ని రోడ్డుమీద అమ్ముకొని పోవాల్సిందే. నీ వ్యాపారమేదో నువ్వు చేసుకొని గమ్మునుండు" అని బెదిరించారు. అంతేగాదు మరుసటిరోజు చంద్రప్ప వచ్చేవేళకు వేరొక వ్యక్తి ఒక బుట్టలో పూలు పెట్టుకుని అతని స్థలంలో కూర్చున్నాడు. "నీకిక్కడ స్థలం లేదు. మరెక్కడికన్నా పో" అని కసిరారు అక్కడి అంగళ్ళవాళ్ళు. దాంతో ఆ స్థలం వదిలి చంద్రప్ప బస్టాండువైపుకు రావాల్సి వచ్చింది. .

టీవీ వాళ్ళ పుణ్యమా అని చంద్రప్ప ఫుట్‌పాత్ వ్యాపారం, అతని స్వాభిమానం అన్ని ప్రాంతాలకి తెలిసింది. గోకాక్‌లో వుండే పెద్దకూతురు, అల్లుడు కూడా ఆ కార్యక్రమం చూశారు. దాంతో బాధపడి, చంద్రప్పని తమ ఇంటికి తీసుకు పోదలచి హుబ్లీ వచ్చి కలిశారు. తమతో రమ్మని కోరారు. అల్లుడు బుక్‌షాపు నడుపుతున్నాడు. "మీకు వూరికే వుండబుద్ధి కాకుంటే మన అంగడికి వచ్చి గల్లాపెట్టె ముందు కూర్చోండి" అని అల్లుడు చంద్రప్పని ఒప్పించడానికి ప్రయత్నించాడు. కానీ అతను అంగీకరించలేదు. "ఏమిటిది నాన్నా! ఈ వయసులో నీకు ఈ మొండితనం తగదు. నువ్విక్కడ అవస్థలు పడుతూ వుంటే, మేమక్కడ నిమ్మళంగా ఉండగలమా? " అని కూతురు అడిగింది. "కాదమ్మా.. ఇద్దరు మగపిల్లలుండగా, నేను ఆడకూతురు ఇంట్లో వుంటే చూసిన వాళ్ళు నా మొహంమీద ఉమ్మివేయరూ? బిడ్డ యింట్లో వుండడం నావల్ల కాదు" అని సమాధానం చెప్పాడు. వాళ్ళిద్దర్నీ బస్టాండులోని గణేష్ హోటల్‌కు పిలుచుకెళ్ళి టిఫిన్ పెట్టించాడు. "మీరిక మీ వూరెళ్ళండి. నా గురించి తాపత్రయం వద్దు. నేనిక్కడ ఏ సిగ్గుమాలిన పనీ చేయట్లేదు, వ్యాపారమే చేస్తున్నా, నా పొట్ట గడవడానికి ఎంత కావాలో అంతే చేసుకుంటున్నా" అని చెప్పి వాళ్ళని బస్సెక్కించి పంపించేశాడు.

బస్సు ఎక్కేముందు అల్లుడు అన్నాడు "మామయ్యా.. టీవీలో మీ గురించి చెప్పినప్పటి నుంచీ, మీ కూతురు ఒకటే పోరు పెట్టింది. మా నాన్నను మనింటికి పిలుచుకువద్దాం అని. సవదత్తికి ఫోను చేసి మాట్లాడితే, 'మానాన్న సంగతి మాకేమీ తెలీద'ని మీ ఇద్దరబ్బాయిలూ చెప్పారు.




మీరు చెప్పాపెట్టకుండా ఇల్లు వదలి వచ్చే శారట కదా" అని అల్లుడు ఇంకా చెబుతుండగా "మీరదంతా మనసులో పెట్టుకోకుండా హాయిగా వుండండి. పదండి.. పదండి బస్సు బయల్దేరుతోంది" అంటూ వారిని బస్సు ఎక్కించి పంపాడు చంద్రప్ప.

కూతురు, అల్లుడు వచ్చి వెళ్లిన తరువాత ఓ రోజు చంద్రప్పకు బొత్తిగా వ్యాపారం కాలేదు. అతని పక్కన గులాబీలు అమ్మే పిల్లవాడూ, ఇటు పక్కన కూర్చొని కోడి గుడ్లు అమ్మే అవ్వ.. తాము తెచ్చుకున్న సరుకు త్వరగా అమ్మేసుకొని వెళ్ళిపోయారు. చంద్రప్ప ఇంకా ఆశతో సాయంకాలం మసక చీకటిని కూడా లక్ష్యపెట్టక అక్కడే ఉండిపోయాడు. చీకటిలో అతనికి కళ్ళు సరిగా కనబడవు. 'ఈ రోజు ఇంతే, ఈ రాత్రికి పంపు నీళ్ళతోనే కడుపు

నింపుకోవాల'ని నిట్టూర్చుతూ తన సరం జామా వుండే చెక్కబంకు దగ్గరకొచ్చాడు. అక్కడ అంతకు ముందు నుంచే తన పెద్ద కొడుకు హనుమంతప్ప వచ్చి ముఖం మాడ్చుకొని నిలబడివున్నాడు. తండ్రి రాగానే, "ఎవరి పరువు తీసేందుకు ఇక్కడకొచ్చి పడివున్నావ్? అర్ధరాత్రి వేళ ఇల్లువదిలి వచ్చేశావ్. అక్కడ చూస్తే నేమో నీ పేరన వున్న పొలం బీడుప డింది. దాన్ని అమ్మి ఆ డబ్బు మాకిద్దరికి ఇచ్చివుంటే, ఆ పాత ఇంటిని పడగొట్టి కొత్త ఇల్లు కట్టుకునేవాళ్ళంకదా..? ఇలా బస్టాండులో పడివుంటూ మా పరువు తీస్తున్నావు కదా, అక్కా, బావ వచ్చినపుడు ఏం చెప్పి పంపావ్? కొడుకులు సరిగా చూసుకోలేదని మాపై నిందలు మోపి చెప్పావట కదా? ఇంత వయసొచ్చినా కూడా ఎవరి దగ్గర ఏం మాట్లాడాలో తెలీదా నీకు" అంటూ అరవసాగాడు.

చుట్టుపక్కల పడుకున్న వారందరూ లేచికూర్చుని తండ్రి కొడుకుల్ని వింతగా చూడసాగారు. "నేనేమీ ఇక్కడ అడుక్కుని తినడం లేదే. కష్టపడి సంపాదించుకుంటున్నా, ఇక పొలం అమ్మి డబ్బులివ్వాలంటున్నావా? అది ఎవరి తాత ఆస్తని? నా సంపాదనతో నేను కొనుకున్న భూమి అది. మీరు గుడ్డోళ్ళా, కుంటోళ్ళా? ఇద్దరికీ ఉద్యోగాలూ ఉన్నాయి. ఇల్లు కట్టుకోవాలంటే మీ సంపాదనలో కూడబెట్టుకుని ఇల్లు కట్టుకోండి. అంతేగాని నా పొలం వైపు కన్నెత్తి చూడకండి? " అని పుల్ల విరిచినట్లు అనేశాడు. తండ్రితో ఇంకేం మాట్లాడాలో అర్థంకాక హనుమంతప్ప బస్సెక్కి వెళ్ళిపోయాడు.

కొద్దిరోజులు గడిచాయి. ఒకరోజు ఉదయమే తన ఊరు బస్సు ఎక్కాడు చంద్రప్ప. ఊళ్ళో దిగగానే చుట్టూ కలయ చూశాడు. అప్పటికే ఆ ఊరి వకీలు ఒకాయన బస్టాండుకు వచ్చి వేచి వున్నాడు. చంద్రప్పను చూడగానే దగ్గరకొచ్చి మాట్లాడి తన టి.వి.ఎస్. బండిమీద ఎక్కించుకొని ఆ వూళ్ళో వున్న మల్లికార్జున హైస్కూల్‌కి తీసుకెళ్ళాడు. ఆ స్కూలు కరస్పాండెంట్‌తో ఇద్దరూ కొంతసేపు మాట్లాడారు. తరువాత ఇద్దరూ మళ్ళీ బస్టాపుకొచ్చారు. వకీలు చంద్రప్పని హుబ్లీ బస్సు ఎక్కించాడు.

చంద్రప్ప ఎక్కిన బస్సు హుబ్లీ వైపు పరుగుపెడుతోంది. అతను రోడ్డు పక్కన పొలాలవైపే చూస్తూ కూర్చున్నాడు. ఓ కిలోమీటర్ దాటగానే అతని కంటపడింది.. అక్కడి రోడ్డు పక్కనే హనుమంతరాయడి గుడి. దాని పక్కనేవుంది తన నాలుగు ఎకరాల భూమి. తన రెండు కళ్లు వెడల్పు చేసుకుని దాన్నే చూస్తున్నాడు. ఆ పొలం కంటికి కానరానంత దూరం వరకూ చూసి రెండు కళ్లూ మూసుకున్నాడు తృప్తిగా.

అతని మనసులో భార్య రుకుమాబాయి రూపం మెదిలింది. ఆమె బతికుండి వుంటే! అనే ఆలోచన కలిగింది. దీర్ఘంగా నిట్టూర్చి కళ్ళు తెరిచాడు. బస్సు హుబ్లీ బస్టాండు వచ్చింది. చంద్రప్ప బస్సు దిగాడు.

మరుసటిరోజు ఎప్పటిలాగే తెల్లారింది చంద్రయ్యకు. మామూలుగానే కాలకృత్యాలు, స్నానాదులు ముగించుకుని వచ్చి.. ముల్లు సెట్లు తగలించిన తీగె చుట్టను చేతబట్టి ఎప్పటిలాగే తన వ్యాపారం సాగే ఫుట్‌పాత్ చేరుకున్నాడు. రోజూ కూర్చునే స్థలంలో తన టైరు చెప్పుల్నే ఆసనంగా చేసుకొని, ముల్లు సెట్ల తీగెచుట్టను తన ముందుంచుకొని కూర్చున్నాడు.

రోడ్డుకు అవతలవైపు అంగడి యజమాని.. చంద్రప్పని చూడగానే తను చదువుతున్న దినపత్రిక చేత్తో పట్టుకుని చంద్రప్ప దగ్గరకొచ్చి "ఏం చంద్రప్పా! ఇటు

చూడు. ఈ ఫోటో నీదే కదూ? అంటే మీ ఊరి కాలేజి కోసం నీ నాలుగెకరాల పొలం దానంగా ఇచ్చావని రాసి వుంది క్కడ! అది నిజమేనా? నిజమే అయ్యుం టుందిలే! బలే మంచి పనిచేశావు! పుణ్యం మూట కట్టుకున్నావులే!" అన్నాడు. అతని మాటలు విని ఆ చుట్టుపక్కల అంగళ్ళ వాళ్లూ, ఫుట్‌పాత్ వ్యాపార్లూ అందరూ చంద్రప్ప చుట్టూ గుమిగూడారు. అందరూ అతన్ని పొగిడేవాళ్ళే. చంద్రప్ప మౌనంగా వున్నాడు, ఎప్పటి చంద్రప్పలానే. అతని మదిలో తన ఊరు, రోడ్డు పక్కనేవున్న తన పొలం స్థానంలో 'రుకుమాబాయి స్మారక డిగ్రీ కళాశాల' మెదిలింది. కొద్దిరో జుల ముందు ఇతని గురించి టివీ ఛానె ల్‌లో కథనం ప్రసారం చేసిన విలేకరి దత్తు వచ్చాడు. చంద్రప్ప వినయంగా లేచి నిలబడి తన చేతులు అతని కెమెరాకు అడ్డుపెట్టి అన్నాడు "బాబ్బాబూ! నాగురిం చి ఏం అడక్కండి.. టీవీల్లో చూపించకండి. నా పొలాన్ని దానంగా ఇచ్చాను. కుడి చెయ్యి చేసిన దానం ఎడమచేతికి తెలియ రాదంటారు. అటువంటప్పుడు దీని గురించి గొప్పగా చెప్పుకొంటే నేనేమీ గొప్ప వాణ్ణి కాను. మరింత చిన్నవాణ్ణి అవు తాను" అని తన సామాగ్రి అంతా ఒక సంచిలో నింపి, అక్కడినుండి కదలి వడివడిగా వెళ్ళిపోయాడు. అక్కడి వాళ్ళందరికీ చంద్రప్ప ఎంతో వున్నతంగా కనిపించాడు.

'బద్ద ప్రాసాదము కన్నా
సొంత గుడిసె మేలు!
నిందించిపెట్టు భక్ష్యము కన్నా
చద్దిగూడే మేలు సర్వజ్ఞా'

తెలుగు కథ



-కె.కె.భాగ్యశ్రీ

# కొత్త చిగురు

'హలో.. మీరు సుధామయిగారేనా?' ఫోన్లో నన్ను పలకరించిందో అపరిచిత కంఠం.

"అవును, మీరెవరు?" విస్మయంగా అడిగాను.

"నా పేరు దేవకి.. బెంగళూరు నుండి మాట్లాడుతున్నాను"

'బెంగళూరు నుండి' అనగానే, మనసేదో కీడు శంకించింది. "చెప్పండి.. నాతో ఏం పని?" అదురుతున్న గుండెల్ని అరచేత్తో అదుముకుంటూ అడిగాను.

"మీరు కాస్త కూల్‌గా వింటే మంచిది" నన్ను మెంటల్‌గా ప్రిపేర్ చేస్తూ ఉపోద్ఘాతం ప్రారంభించింది దేవకి.

నాకు ముచ్చెమటలు పోస్తున్నాయి. "ప్లీజ్.. విషయం చెప్పండి. నాకు టెన్షన్‌గా ఉంది" అన్నాను బితుగ్గా.

"అక్కడికే వస్తున్నాను. మీ ఫ్రెండ్ సరోజగారు సూయిసైడ్ అటెంప్ట్ చేశారు"

"సూయిసైడా!".. నోరెళ్ళబెట్టాను.



"అవును.. పురుగుల మందు తాగేశారు, కానీ కంగారుపడాల్సిన పనేమీ లేదు లెండి.. ప్రమాదం తప్పింది" అనునయంగా అంది దేవకి.

"హమ్మయ్య.." బరువుతీరిన ఆనందంతో నిట్టూరుస్తూ "ఇప్పుడెలా ఉంది తనకి? " అడిగాను ఆదుర్దాగా.

"బాగానే ఉన్నారు, హాస్పిటల్ నుంచి ఈరోజే తీసుకొచ్చాం. మిమ్మల్ని చూడాలని ఉందని చెప్పి నాచేత మీకు ఫోన్ చేయించారు. వీలుంటే మీరోసారి రాగలరా? " అడిగిందామె అభ్యర్థనగా.

"నేనా!" అప్రయత్నంగా అనేశాను.

"అవును, ఈ లోకంలో తనకంటూ ఉన్న ఏకైక ఆత్మీయురాలు మీరేనని, మిమ్మల్ని చూస్తే చాలని కలవరిస్తున్నారు. అసలే తను డిప్రెషన్‌లో ఉన్నారు. ప్రాణస్నేహితురాలైన మీరొచ్చి, ఆమె బాధను పంచుకుంటే బాగుంటుందని నా అభిప్రాయం. తరువాత మీ ఇష్టం" సూచించిందామె.

ఆ మాటలు నన్ను ఆలోచనలో పడేశాయి. 'ఆప్తురాలు ఆపదలో ఉన్నప్పుడు సేదతీర్చలేని స్నేహమెందుకు? అసలు ఇప్పటికిప్పుడు ప్రయాణమంటే సతీష్ ఎలా రియాక్టవుతాడో? అదీ దరీ దగ్గరా కాదు. ఇద్దరు చిన్నపిల్లల్ని, ఇంటిని వదిలేసి ఉన్నపళంగా చిన్ననాటి స్నేహితురాలి దగ్గరికి పరుగుతీస్తానంటే తను ఆమోదిస్తాడా? '

ఇలా పరిపరి విధాల ఆలోచిస్తున్న నేను "హలో.. హలో.. సుధామయిగారూ! ఫోన్ పెట్టేశారా? " అట్నుంచి దేవకి కంఠం కంగారుగా వినబడుతూంటే ఉలిక్కిపడ్డాను. "నో.. నో.. వింటున్నాను. నేను వీలు చూసుకుని వస్తాను. ఒకవేళ రాలేకపోయినా, తను తేరుకున్నాక ఫోన్లో మాట్లాడతాను. మీరే తనని జాగ్రత్తగా చూసుకోండి" అని చెప్పి ఫోన్ పెట్టేశాను.

'ఆత్మహత్యకి ప్రయత్నించేంత కష్టం సరోజకు ఏమొచ్చింది? కోరి వచ్చిన భర్త, ముత్యాల్లాంటి పిల్లలు, ముచ్చటైన సంసారం, పూల రథం లాంటి జీవితం.. ప్రియ మిత్రురాలైన నేనే అసూయపడేంత సిరిసంపదలు' ఆలోచిస్తూనే వంటపని పూర్తిచేశాను.

ఇంతలో సతీష్ వచ్చాడు, స్నానంచేసి డైనింగ్ టేబుల్ దగ్గరికి వచ్చాడు. ఎలా ప్రారంభించాలో, ఏమని చెప్పాలో తెలక

నాలో ఒకటే తర్జనభర్జన. ఏదైతే అదైందని.. ఊపిరి బిగబట్టి విషయం మొత్తం చెప్పేసి, అతడి ముఖంలోకి చూశాను. నేనంత టకటకా మాట్లాడడం అదే మొదటిసారి.

"అయితే ఇప్పుడు నువ్వెళ్ళాలంటావ్!" భోజనం పళ్ళెం ముందుకు లాక్కుంటూ అడిగాడు సతీష్.

అవునన్నట్లు తలాడిస్తూ "మీరొప్పుకుంటేనే.." అని ఆగిపోయాను.

"తప్పకుండా వెళ్లు. ఆపదలో ధైర్యం చెప్పని స్నేహానికి అర్థమేముంది? వెళ్ళి నాలుగు రోజులుండి వచ్చేసేయ్. అవసరం అనుకుంటే నాకు ఫోన్ చెయ్, నేనూ వస్తాను. ఆవిడని నీతో తీసుకురా. తనకి మనమున్నామని భరోసా ఇవ్వు. ఏ సాయం కావలసినా మనం చేస్తామని చెప్పు" కూర కలుపుకుంటూ చెప్పాడు సతీష్ పొడిగా.

నా చెవుల్ని నేనే నమ్మలేకపోయాను. 'సతీషేనా.. నాతో ఇన్ని మాటలు మాట్లాడింది? అతను ఇంత తొందరగా ఒప్పుకుంటాడని నేను అస్సలు అనుకోలేదు. నేను ఏ విషయమన్నా అతడిముందు ప్రస్తావిస్తే కదా.. అతడి స్పందన తెలిసేది? గంభీరంగా, భావశూన్యంగా కనిపించే అతని ముఖం చూస్తే నా మనసులో మాట అక్కడే నిలిచిపోతుంది, గొంతులోకి రానని భీష్మించేస్తుంది. అటువంటిది ఇవాళ.. ఇంత ధైర్యంగా..నేనేనా!'

పిల్లల్ని పక్కింటి సుభద్రత్తకి అప్పచెప్పి, బ్యాగ్‌లో నాలుగు చీరలు సర్దుకొని బయలుదేరాను.

తత్కాల్‌లో టికెట్ బుక్‌చేసి, నన్ను దగ్గరుండి ట్రైన్ ఎక్కించాడు సతీష్. "ఏ అవసరం వచ్చినా నాకు కాల్ చెయ్. ఆవిడకి ధైర్యం చెప్పి, నీతో తీసుకురా" ట్రైన్ కదిలే ముందు మళ్ళీ చెప్పాడు.

రైలు ప్రయాణంలా నా ఆలోచనలు కూడా పరుగులు తీస్తున్నాయి. నాలుగు నెలల క్రితం మా ఇంటికొచ్చినప్పుడు, సరోజ నాతో మాట్లాడినవి గుర్తుకొస్తున్నాయి. కనీసం అప్పుడైనా.. ఆమెకి ఏమైనా సమస్యలున్నాయేమోనన్న అనుమానమైనా కలగలేదు నాకు.

ఆ రోజు.. మా ఇద్దరి సంభాషణా నా మదిలో మెదిలింది.

"నా మాటకి బదులుచెప్పలేదు." సరోజ రెట్టించింది.

సమాధానంగా నవ్వేశాను.

"నువ్వు చాలా లోతు మనిషివి" అంది తదేకంగా నా కళ్ళల్లోకి చూస్తూ.

అప్పుడు గమనించాను.. ఆమె వదనంలోని నైరాశ్యాన్ని. సరోజకేం లోటు? ఆ చూపుకి అర్థాలు వెతకడం మానేయాలి. పచ్చకామెర్ల వాడికి లోకమంతా పచ్చగానే కనబడుతుందట.. నా మనసులో పూడ్చలేనంత అగాధం ఉంది కాబట్టి అందరి జీవితాలూ అలాగే ఉంటాయన్న అనుమానం.. అన్నీ పిచ్చి భ్రమలు..

"చూపులకి మంచి బాలుడల్లే కనిపిస్తున్నారు మీ శ్రీవారు. మరేంటి నీ ప్రాబ్లమ్" కనుబొమ్మలెగరేసింది సరోజ అదోలా నవ్వుతూ.

"నాకు నేనే ఓ పెద్ద ప్రాబ్లమ్" నవ్వేశాను.

"సతీష్‌తో నీ జీవితం సంతోషంగా లేదా? " మళ్ళీ అదే ప్రశ్న.

లాభం లేదు, ఏదో ఒకటి చెప్పకపోతే ఈ సరోజ వదిలేలా లేదు! "నీ దృష్టిలో సంతోషమంటే ఏమిటి? నెలకొక సినిమా, సంవత్సరానికో విహారయాత్ర, నాలుగు కట్టుడు చీరలు, రెండు ఖరీదైన చీరలు, అప్పుడప్పుడు బంగారు నగలు.. అంతేనా? నాకా సంతోషానికి లోటు లేదు" చెప్పాను ముభావంగా.

"అయితే నీ వివాహ జీవితం సజావుగా సాగడంలేదన్నమాట! సతీష్ నిన్ను బాగా

చూడడం లేదా? " నా కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగింది సరోజ.

మళ్ళీ అదే ప్రశ్న! ఈ ప్రశ్నకి సమాధానం నా దగ్గర ఉందా? బాగా చూడడం లేదా..! అసలు మామూలుగా నన్ను చూస్తే కదా.. బాగో ఓగో తెలియడానికి? కలర్ టి.వి., ఫ్రిజ్, కంప్యూటర్, మైక్రో వేవ్ ఒవెన్, వాషింగ్ మిషన్.. వీటిలాగే నేను కూడా ఓ యంత్రాన్ని. ఇంటిపని చేయడానికి ఉపయోగపడే యంత్రాలకీ, జీవిత భాగస్వామికీ తేడా తెలియని భర్త అతను. అతనో పెద్ద యంత్రం అని భావించడానికి నేనేమీ సంకోచించనక్కర లేదు.

సరోజ, నేను డిగ్రీ వరకు కలసి చదువుకున్నాం. ఇద్దరిదీ అరమరికలు లేని ప్రాణ స్నేహం. మా చేతుల్లోకి డిగ్రీ వచ్చి చేరేసరికి, సరోజ ప్రేమ వ్యవహారం కూడా ఓ కొలిక్కి వచ్చింది. తనకి దూరపు బంధువైన ఆనంద్‌తో పీకల్లోతు ప్రేమలో కూరుకుపోయిన ఆమె.. ఇంట్లో వాళ్ళని ఎదిరించి అతడిని రిజిస్టర్ మ్యారేజ్ చేసుకుంది. ఆ వివాహనికి నేనూ సాక్షి సంతకం చేశాను.

ఆనంద్ హైదరాబాద్‌లో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. రెండు చేతులా సంపాదిస్తున్నవాడు, ఆరడుగుల అందగాడు. ప్రియ మిత్రురాలే అయినా, సరోజ అదృష్టానికి అసూయ చెందకుండా ఉండలేకపోయాను. ఆనంద్‌తో హైదరాబాద్ వెళ్ళబోయే ముందు నన్ను కౌగిలించుకుని కన్నీళ్ళు పెట్టుకుంది. "నీ పెళ్ళికి పిలవడం మరచిపోకే.. తప్పక వస్తాను" చెప్పింది సరోజ గద్గదమైన స్వరంతో.

"అలాగే" అన్నాను కానీ, నా పెళ్ళికి సరోజని పిలవడం కుదరలేదు. అసలు నా పెళ్ళి నా ప్రమేయంతో జరిగిందా? తలచుకుంటేనే ఏదోలా అనిపిస్తూ ఉంటుంది. నాకు వేలువిడిచిన మేనత్త ఒకావిడ నన్ను తన కొడుక్కు చేసుకోవాలని ఉందని.. మధ్యవర్తులద్వారా కబురుపెట్టింది. మేం అందరం ఎంతో ఆశ్చర్యపోయాం. ఎందుకంటే, గతంలో నాన్నగారు ఆవిడను ఈ సంబంధం గురించే అడిగి భంగపడ్డారు.

"నువ్వేం అనుకోకు తమ్ముడూ! నా కొడుక్కి చిన్నప్పటి నుండీ నీ కూతురిమీద అలాంటి భావం లేదట" అంది ఆవిడ నసుగుతూ.

'పోతేపోనీ, ఇది కాకపోతే మరొకటి' అని ఆలోచించిన నాన్నగారు ఏ మాత్రం బాధను వ్యక్తపరచలేదు. అలా అప్పుడు వద్దన్నవాళ్ళు ఇప్పుడు మళ్ళీ చేసుకుంటామంటే ఆశ్చర్యం కాక మరేం కలుగుతుంది!

"అప్పుడు అలాంటి భావం లేదని చెప్పినవాడు ఇప్పుడెలా ఇష్టపడుతున్నాడయ్యా? " కబురుతెచ్చిన మధ్యవర్తిని ప్రశ్నించారు నాన్నగారు చిరాగ్గా.

"అలా జరగకూడదని రూలేమన్నా ఉందేమిటయ్యా" లాజిక్ లాగాడాయన.. తన తెలివితేటల్ని ప్రదర్శిస్తూ.

ఏం చేయాలో తోచని స్థితిలో నాన్నగారు ఊగిసలాడుతున్న తరుణంలో "ఏమిట్రా గోపాలం.. ఇంకా ఆలోచిస్తావ్.. అంత మంచి సంబంధం కాళ్ళ దగ్గరికి వస్తూంటే. పైగా తల్లిలేని పిల్ల. నువ్వు మాత్రం సంబంధం కోసం దేశాలంట ఏం తిరుగుతావు? ఈ పెళ్ళి చేస్తే నీ బాధ్యత తీరిపోతుంది" సూచించాడు మేనమామ వరుసయ్యే ఓ పెద్దాయన.

నాన్న ఎందుకో సమాధానపడలేదనే అనిపించింది, ఆయన ముఖంలో కనిపించే భావాలు చూస్తూంటే.

"ఏమ్మా సుధా! బావని చేసుకుంటావా? " లాలనగా నా తల నిమురుతూ అడిగారు.

తల్లిలేని నన్ను ఎంతో అపురూపంగా చూసుకున్నారాయన. ఆ కళ్ళలో నా భవి



ష్యత్తు పట్ల ఆదుర్దా, ఆశావహ దృక్పథం.. రెండూ కలగలిసి కనిపించాయి. జీవన సమరంలో తోడుని కోల్పోయి ఇప్పటివ రకూ ఒంటరి పోరాటం చేశారాయన. ఎంతో అలసిపోయిన ఆయనకు ఇకనైనా విశ్రాంతి కల్పించాలని అనిపించింది.. ఎందుకో. 'ఇష్టమే' అన్నట్లు తలాడించాను.

మొదట నన్ను కాదని.. ఆ తర్వాత మళ్ళీ.. చేపడతానని ముందుకొచ్చిన వ్యక్తి అతను! నన్నెలా ట్రీట్ చేస్తాడోనన్న బెంగ ఆ క్షణంలో అస్సలు కలగలేదు. నాన్నకి బాధ్యతల నుంచి భారాల నుంచి వెసులు బాటు కలిగించాలి.. అదే నా లక్ష్యంగా మారిందా క్షణం!

మరి నెలరోజులకే మా పెళ్లి జరిగిపో యింది. సరోజని పెళ్ళికి ఆహ్వానించాలని ఎందుకో నాకు అనిపించలేదు. ఆ తరు వాత ఉత్తరం రాసి నా పెళ్ళి సంగతి తెలి యపరిచాను. నిష్ఠూరంగా ఉత్తరం రాసింది సరోజ అటువైపునుంచి.

సినిమాల్లో తొలిరాత్రి సన్నివేశాలు చూసి ఎన్నో కలలు కన్నాను. కానీ



అలాంటివి సినిమాల్లో మాత్రమే సాధ్యమనిపించింది.. నా మొదటి రాత్రి అనుభవం జరిగాక!

చూపులు కలసి గుండె ఝల్లుమనడాలూ, స్పర్శించగానే ఒళ్ళు చివురుటాకులా కంపించడాలూ, ఒకరి కళ్ళల్లోకి ఇంకొకరు చూసుకుంటూ మైమరచిపోవడాలూ.. ఇలాంటి స్పందనలేవీ లేకుండానే మా ప్రథమ సమాగమం జరిగిపోయింది.. అత్యంత యాంత్రికంగా.

తెల్లవారగానే గదిలోంచి బయటకొచ్చిన నన్ను మా నాయనమ్మ పట్టి పట్టి చూసి తృప్తిగా నిట్టూర్చి అడిగింది "అబ్బాయి నీతో సరిగా ఉన్నాడా? " అని. అవునన్నట్లుగా తలూపి అక్కడనుంచి పారిపోయాను. "నువ్వు ఆ అబ్బాయితో సరిగ్గా ఉన్నావా? " అని నన్నెవరూ ప్రశ్నించలేదు. మన సమాజంలో మగవాడి ఇష్టాయిష్టాలకి ఉన్నంత ప్రాధాన్యత ఆడదానికి ఉండదని నేను అప్పుడే తెలుసుకున్నాను.

నేను కాపురానికి వెళ్ళాకే తెలిసింది.. మొదట కాదని ఆ తరువాత నన్ను చేపట్టడం వెనకున్న అసలు రహస్యం! మా అత్తగారికి పేరు తెలియని ఏదో మాయ రోగం.. ఎన్నాళ్ళు బతుకుతుందో తెలియదు. తన తరువాత ఆ ఇంటి బాధ్యతల్ని సమర్థంగా నిర్వర్తించడానికి ఓ గానుగెద్దు కావాలి. అప్పుడు నేను గుర్తొచ్చాను వాళ్ళకి! నాకు తల్లి లేకపోవడం, నాన్న అసహాయత.. ఇవన్నీ వాళ్ళకి కలిసొచ్చిన అంశాలు. నాలాంటి నోరూ వాయీ లేని ఒక బకరా అయితేనే ఆ ఇంటి వాతావరణానికి సరిపోతుందని భావించారో ఏమో.. కొడుకుని ఒప్పించి మరీ నన్ను ఆ ఇంటికి కోడల్ని చేశారు!!

సతీష్ మంచివాడు కాదని చెప్పలేం. కానీ నేనో మనసున్న మనిషినన్న సత్యం అతను గుర్తించడు! ఇంట్లో.. కారు, కంప్యూటర్, ఏసీ, టీవీ.. వీటిల్లాగే నేనూ ఒక యంత్రాన్ని అనుకుంటాడు. మీట నొక్కితే మరలు పనిచేసినట్లు.. తనకు మూడ్ వస్తే నేను యాంత్రికంగా సహకరించాలన్నమాట!

యంత్రసామగ్రిని అప్పుడప్పుడు సర్వీసింగ్ చేయించినట్లుగా.. 'స్త్రీని రంజింపచేయడానికి ఆమెకూ కాస్తంత ప్రేమ అనే ఇంధనం అవసరం, అనురాగమనే కందెన అవసరం' అని విస్మరించాడతను. ఒక ప్రేమపూరిత పలకరింపు, ఆహ్లాదకరమైన

చిరునవ్వు, సున్నితమైన స్పర్శ.. ఇలాంటివన్నీ ఆడదాన్ని ఉత్తేజపరచడానికి ఉపయోగపడేవే కానీ.. ఖర్చులేసి ఇంధ నాలు.

దురదృష్టవశాత్తూ నా స్తబ్ధతను గమ నించే స్థితిలో సతీష్ లేడు. అతని దృష్టిలో జీవరహిత పరికరాలు, నేనూ ఒకటే. మా పెళ్ళైన ఆరు నెలలకి మా అత్తగారు కాలం చేశారు.

సతీష్‌కీ నాకూ మధ్యన మమేకమయ్యే మానసిక బంధం లేదన్న విషయం అప్పు డప్పుడు తలపుకొచ్చేది. ములుకులా అది నా మది కెలికి నన్ను బాధపెడుతున్నా, వెంటనే పుట్టుకొచ్చిన ఇద్దరు పిల్లల ఆలనా పాలనా చూడ్డంతో నాకు బాగానే కాల క్షేపం అయ్యేది. అయినా మనసులో ఏ మూలో.. ఖాళీ! సరోజ రాసే ఉత్తరాలు, ఫోన్లలో ఆమె చెప్పే కబుర్లు.. ఇవే నా నేస్తాలు. ఒకటి రెండుసార్లు నన్ను చూడ డానికి వచ్చింది సరోజ. నా అదృష్టమో ఏమో.. ఆమె రాకపట్ల ఎటువంటి అభ్యం తరాలూ చెప్పలేదు సతీష్.

"ఏమిటే మళ్లీ ఆలోచనలు? మీ శ్రీవారు మంచివారిలాగానే కనిపిస్తున్నా రంటున్నా.. వినిపించిందా?" సరోజ మాటలతో ఈ లోకంలోకి వచ్చిపడ్డాను.

మంచివాడే.. కానీ ఆ మంచితనం వల్ల ఎవరికి ప్రయోజనం? సముద్రంలో అపా రమైన జలరాశి ఉంటుంది. కానీ దాహార్తి తీర్చుకోవడానికి ఆ నీళ్ళు ఎందుకూ పనికి రావు. నా పరిస్థితీ అంతే! చనువుగా మాట్లాడడు, మనసుకి చేరువగా రాడు. అందుకే కాబోలు.. జీవితం ఇంత నిస్సా రంగా తోస్తోంది.

అసహనంగా తల విదిలిస్తూ "తల్లీ! ఆయన మహా మంచివాడు. నేను చాలా హాయిగా ఉన్నాను. చాలా.." అన్నాను నవ్వేస్తూ.

సరోజ నవ్వింది. ఆ నవ్వులో ఏదో వెలితి. మళ్ళీ భ్రమలో మునిగిపోతున్న మనసుని మందలించాను. అప్పుడు వెళ్లిన సరోజ నుండి ఉత్తరం పత్తరం లేదు. ఇదుగో.. ఇప్పుడీ పిడుగులాంటి వార్త. సరోజకెలా ఉందో.. ఏమో? పది దాట గానే బెర్త్ వాల్చి నిద్రకుపక్రమించాను కానీ నిద్రాదేవత కరుణిస్తే కదా! ఏదో తెలియని వేదనతో తెల్లార్లూ జాగారం చేశాను.

★ ★ ★

"మీరు, సరోజ క్లోజ్ ఫ్రెండ్స్ అను కుంటా" కారు డ్రైవ్ చేస్తున్న దేవకిభర్త అడిగారు. అవునన్నట్లు తలూపాను. నన్ను రిసీవ్ చేసుకునేందుకు ఆయన స్టేష న్‌కి వచ్చారు.

మరేం మాట్లాడకుండా కూర్చున్నాను.

మనససలే కలత చెంది ఉంది. వారి ఇల్లు ఊరికి కాస్త దూరంలో ప్రశాంతమైన వాతావరణంలో ఉంది. నన్ను చూస్తూనే ఆదరంగా పలకరించింది దేవకి.

"సరోజ.." ఆతృతగా అడిగాను.

"నిద్రపోతోంది. మీరు ఫ్రెష్ అయి కాఫీ టిఫిన్ కానిస్తే, అప్పుడు లేపుదాం" అందావిడ మర్యాదపూర్వకంగా.

నేను రెడీ అయి వచ్చాక, కొసరి కొసరి టిఫిన్ పెట్టిందావిడ. ఆ ఆప్యాయత చూస్తే చిన్నతనంలోనే నేను పోగొట్టుకున్న అమ్మ గుర్తొచ్చింది. అప్రయత్నంగా కళ్లలో నీళ్ళు తిరిగాయి. "సరోజ పిల్లలేరీ? " చేయి కడుక్కుంటూ అడిగాను.

"వాళ్ళమ్మ ఇలా చేయడంతో బెదిరిపో యారు. బుజ్జగించి ఇవాళే స్కూల్‌కి పంపించాను" సమాధానమిచ్చింది దేవకి.

మెల్లగా సరోజ ఉన్న గది తలుపు తెరు చుకుని వెళ్ళాను. కళ్ళు మూసుకుని బెడ్ మీద పడుకుని ఉంది సరోజ. నిద్రిస్తున్నప్పటి ఆ వదనం ఆమె మానసిక సంక్షోభానికి దర్పణంలా ఉంది. తలమీద చేయివేసి మృదువుగా నిమిరాను. ఆ స్పర్శకి నెమ్మదిగా కళ్ళు తెరిచింది సరోజ."సుధా!" అంది హీనస్వరంతో.

"రెస్ట్ తీసుకో, తర్వాత మాట్లాడు కుందాం" అన్నాను తను కప్పుకున్న దుప్పటి సరిచేస్తూ.

"మళ్లీ నిన్ను చూస్తాననుకోలేదు.." బావురుమంది ఒక్కసారిగా.నేను వద్దని వారించినా, అప్పుడామె ఉగ్గబట్టుకునేలా లేదు. "ఎందుకు చేశావీ పిచ్చిపని? " మృదువుగా అడిగాను చేయిపట్టుకుని.

"జీవితంమీద ఆశ నశించి" నిర్లిప్తంగా చెప్పింది సరోజ.

"అంత కష్టం ఏమొచ్చింది? "

అప్పుడు బైటపెట్టింది సరోజ.. తన మనసుని తొలిసారిగా. "ఆనంద్ ఈమధ్య వేరే అమ్మాయితో ఉంటున్నాడు"

ఆశ్చర్యంగా నా కళ్లు పెద్దవయ్యాయి. తను చెప్పేది నమ్మబుద్ధి కాలేదు. కానీ ఆమె ఆత్మహత్యా ప్రయత్నం నిజమేనని రూఢీ చేసిందా మాట. సరోజని ప్రాణాధి కంగా ప్రేమించే ఆనందే అలా చేశా డంటే.. ఆశ్చర్యమే మరి!

"అందుకని నువ్వు పురుగులమందు తాగి ప్రాణం తీసుకోవాలనుకున్నావా? " అన్నాను కాస్త మందలింపుగా.

"అందుకని కాదు. ఆనంద్ చేరదీసిన అమ్మాయి వయసెంతనుకున్నావు? .. జస్ట్ ట్వెంటీ ఫోర్. అతనికీ ఆమెకీ పధ్నాలు గేళ్లు తేడా.." చెప్పింది సరోజ నెమ్మదిగా.

మళ్లీ షాక్! ఆనంద్ ఇంత పనిచేశా డంటే నమ్మశక్యంగా లేదు. "పోతే పోనీ, నీకు అన్యాయం చేసిన తర్వాత వాళ్లెలా తగలడితే నీకెందుకు? " కాస్త పరుషం గానే అన్నాను.

"అంత చిన్న అమ్మాయికి అన్యాయం జరుగుతూంటే చూస్తూ ఉండలేకపో యాను. సహించలేకపోయాను. ఆనంద్‌కి మెత్తగా నచ్చచెప్పాలని విశ్వప్రయత్నం చేశాను. వినలేదు, డైవోర్స్ ఇస్తానని బెది రించారు. నాకు డైవోర్స్ ఇచ్చినా ఫరవా లేదు.. అంత చిన్న మ్మాయి జీవితంతో ఆటలాడద్దని బతిమాలాను. ఫలితం లేక పోయింది. ఆఖరి ప్రయత్నంగా వెళ్లి ఆ అమ్మాయిని కలిశాను. ఆనంద్‌ని పెళ్లి చేసుకుంటే ఆమె తన జీవితాన్నే నష్టపోవాల్సి వస్తుందని హెచ్చరించాను. ఆమె కూడా మొదట నా మాట లక్ష్యపెట్ట లేదు. ప్రేమించి పెళ్లి చేసుకున్న నన్నే కాదని తృణీకరించినప్పుడు.. తన పరిస్థితే మౌతుందో ఆలోచించమన్నాను. చదువు కున్న ఈ తరం అమ్మాయి కదా! నా మాటల్లో వాస్తవం గ్రహించిందో ఏమో.. ఆనంద్‌కి గుడ్‌బై చెప్పేసింది. అంతే.. అతను చిందులు తొక్కాడు. నా పిల్లల ముందే నన్ను దారుణంగా కొట్టాడు. ఇరు

గు పొరుగుల ముందు అవమానించాడు. అది తట్టుకోలేకపోయాను. అందుకే ఇలా..” సరోజ వెక్కివెక్కి ఏడవసాగింది. డొక్కలు ఎగిరెగిరి పడుతున్నాయి.

“పిచ్చి సరోజా.. నువ్విలా చేసుకుంటే అతడు మారతాడా? ఆమె కాకపోతే మరొ కరు! ఒకసారి నీకు అన్యాయం తలపెట్టిన వాడు మరోసారి అదే పని చేయడని గ్యారంటీ ఏముంది? నువ్వు బతికి అతనికి బుద్ధిచెప్పాలి. అంతే కానీ చచ్చి సాధించేది ఏదీ లేదు..” ఆమెకు ధైర్యం నూరిపోసే ప్రయత్నం చేశాను.

“ఏం సాధిస్తాను నా బొంద! చదివింది బోడి డిగ్రీ. ఊరుకాని ఊరు. అయినవా ళ్లతో తెగతెంపులు చేసుకుని మరీ ఈ మహానుభావుడిని కట్టుకున్నాను. ఇప్పుడు ఏ ముఖంపెట్టుకుని వాళ్ల దగ్గరికి వెళ్లను? ” అంది సరోజ నిరాశగా.

“అదిగో.. ఆ నిరాశే వద్దనేది. నీకెవరూ లేరని ఎందుకనుకుంటావు? మేమంద రమూ లేమా? భగవంతుడు మనకిచ్చిన అపురూప వరమే ఈ జీవితం. దీన్ని బల వంతంగా ముగించుకునే హక్కు మనకి లేదు. నువ్వు ఏ సహాయం కావాలన్నా మనస్ఫూర్తిగా చేస్తామని మాట ఇస్తు న్నాను” అంటూ దేవకి స్పందన కోసం ఆవిడ ముఖంలోకి చూశాను.

“అవును సరోజా! పిచ్చి ఊహాలేవీ పెట్టు కోకు. నీకు మేమందరమూ లేమా? ” అంది ఆవిడ కూడా.

నేను, దేవకి, ఆవిడ భర్త శతవిధాలా నచ్చచెప్పిన మీదట సరోజ కాస్త కుదుటప డింది. ఆమెలో కాస్త సాహసం, జీవితం మీద ఆశ చిగురించాయనిపించింది. రెండు రోజులుండి నేను బయలుదేరాను. ఈ రెండు రోజుల్లోనూ పిల్లలు నాకు బాగా చేరువయ్యారు. ‘అత్త.. అత్త’ అను కుంటూ నన్ను అంటిపెట్టుకునే తిరిగారు.



నాతో రమ్మని సరోజని బలవంతం చేశాను.

“ఇప్పుడు వద్దులేమ్మా, తనకి బాగా నీర సంగా ఉంది. నాలుగు రోజులాగి పంపు తాను. అయినా అతనికి భయపడి తను ఎక్కడో తల దాచుకోవడమేమిటి.. ఇక్కడే ఉండి అతని భరతం పట్టాలి కానీ! మేం ముందే చెప్పాం.. తనకి ఎటువంటి సహాయం కావాలన్నా చేస్తామని” అంది దేవకి.

ఆవిడ సరోజ పట్ల చూపిస్తున్న శ్రద్ధకి ముచ్చటేసింది నాకు. ఆడదానికి ఈపాటి భరోసా ఇచ్చేవాళ్లుంటే ఎలాంటి పరిస్థితి లోనూ ఆమె ఆత్మహత్యా ప్రయత్నాలు చేయదు. బయలుదేరేముందు మళ్లీ ధైర్యం చెప్పాను.

సరోజ మెల్లగా నవ్వి “మీ అందరూ నాకు పునర్జన్మ ప్రసాదించారు.. అంటే ఈ భూమ్మీద నా పాత్ర ఇంకా మిగిలుందనే కదా! ఈసారి నేను పరిస్థితుల నుండి పిరి కిదానిలా పారిపోను.. ఆనంద్ అంతు చూస్తాను” అంది నిబ్బరంగా. ఇప్పుడు ఆమె కళ్లలో ఒకలాంటి పట్టుదల కనిపి స్తోంది.

తిరుగు ప్రయాణంలో ఉన్న నాకు ఏదో స్ఫురణకు వచ్చింది. సరోజకిలా ధైర్యాన్ని నూరిపోయగలిగానంటే అందుకు కారణం ఎవరు?.. సతీషే కదా! అతనే కనక ఆ మాటలు చెప్పుండకపోతే నేనిలా మాట్లాడ గలిగేదాన్నా? నాకు తెలియకుండానే సతీష్ నాలో ధీమా పెంచాడు. జీవిత భాగస్వామి మీద అపారమైన నమ్మకంతో వైవాహిక జీవితంలోకి అడుగుపెట్టిన సరోజకు చివరికి ఏమైంది? ఆ కలలు భగ్నమై, ఆశలు అడియాసలై బతుకు మీద విరక్తితో ఆత్మహత్యా యత్నం చేసింది. మా అందరి ఓదార్పుతో కోలు కుని, తిరిగి జీవన పోరాటం చేసి గెలవా లన్న ఆలోచనకు ఇప్పుడొచ్చింది.

మరి నేను? నిజానికి లోకంలో కష్టా

లుగా చెప్పుకునేవేవీ నేననుభవించడం లేదు. పెళ్లినాటికి జీవితం ఇలాగే వుండి తీరాలన్న అంచనాలేమీ లేవు. అయినా సరే.. ఈ ఒంటరితనాన్ని భరించలేక అల్లాడిపోతున్నాను. సతీష్ నాకు చేరువవలేదని తల్లడిల్లిపోతున్నాను. కానీ ఇన్నాళ్లుగా నేనొక్క విషయం విస్మరించాను. అతడికి దగ్గరగా వెళ్లుండవచ్చు అనే కోణంలో నేనెప్పుడూ ఆలోచించలేదు. అతడు మారనీ, మారకపోనీ.. నా ప్రయత్నం నేను చేయాలన్న స్పృహే నాకు లేకపోయింది. మానవ ప్రయత్నం లేకపోతే ఆ దేవుడు కూడా సహకరించడట!.. మరి నేనెలా ఊరుకున్నాను? ఇప్పటికి కానీ నాకు జ్ఞానోదయం అవలేదేమిటి? 'పోనీ లే.. ఇప్పటికైనా అయింది.. సంతోషించు' అంది నా మనసు.

నా మనసుని పట్టుకుని వేలాడుతున్న అనుమానాన్ని బలవంతంగా వదిలించుకున్నాను. ఆ స్థానంలో ఇప్పుడు ఆశలనే కొత్త చిగుళ్లు మొలుచుకొస్తున్నాయి. అవి పెరిగి కొమ్మలు, రెమ్మలు అవుతాయనే నమ్మకం హృదయమంతా నిండిపోయింది. 'ఎంత వేగం వెళ్లి నా సతీష్‌ని చూస్తానా?' అని ఆతృత కలిగింది. నా పక్కనే కూర్చున్న టీనేజ్ అమ్మాయి సెల్ ఫోన్‌లోంచి 'ఆశలన్నీ రాలిన చోటే.. కొత్త చిగురు కనిపిస్తుంది' అంటూ వినిపించిందో పాట.. నన్ను కర్తవ్యం వైపు నడిపిస్తూ.

హిందీ కథ

-శ్యామ్ నారాయణ్

# ఆకలి

అనువాదం : పెరుకరాజు

అర్థరాత్రి పన్నెండు గంటలు. సరిగ్గా అదే సమయంలో, నిద్రనుండి ఒక్కసారిగా లేచాడు ఏడేళ్ల సూరి. ఆకలితో అల్లాడు తున్న వాడు అక్కడే ఓ దిండుమీద కూర్చొని "అన్నం కావాలీ..అన్నం కావాలీ" అంటూ ఏడుపు మొదలెట్టాడు. తల్లి విమల జోకొడ్తూ వాడిని మళ్లీ నిద్రపుచ్చడానికి ప్రయత్నించింది. కానీ ఆకలి మంటతో ఉన్న వాడు ఆమె చేయిని పక్కకు నెట్టి మరీ ఏడవసాగాడు.

అసలే ఇబ్బందికరమైన రోజులు. ఇంట్లో ఒక్క బియ్యపుగింజ కూడా లేదు. అలమటిస్తున్న కొడుకుని ఆమె ఎంతకీ సముదాయించలేకపోయింది. "నా బంగారుకొండా! ఏడవకు. పడుకో.. పడుకో. తెల్లారగానే నీకు అన్నంపెడతా"

"ఆకలేస్తోంది, ఇప్పుడే అన్నంపెట్టు" అంటూ మంకుపట్టు పట్టాడు వాడు.

"చూడు.. చూడు.. అటు చూడు.. పెద్ద పులి! కళ్లుమూసుకో! నిద్రపో. లేదంటే అది నిన్ను ఎత్తుకుపోతుంది. తెలిసిందా? "

"లేదు.. లేదు. నాకు అన్నమే కావాలీ"

"ఒరేయ్! ఆపు ఏడుపు! ఇంత రాత్రిపూట అన్నం నేనెలాతెచ్చేదీ" కోపంతో అంది.

"ఆకలేస్తోందే.. అన్నం పెట్టవే" అంటూ వాడు ఆ కోపంతోనే మంచం దిగాడు. అక్కడి ఖాళీ గిన్నెల్ని ఆ చీకట్లోనే అటూ ఇటూ విసిరి పారేయసాగాడు.

విమలకు దిక్కుతోచకుండా పోయింది. సూరిని దగ్గరికి తీసుకోవాలని ప్రయత్నించింది. ఈలోగా వాడు విసిరేసిన చెంబు ఆమె తలను గట్టిగా తాకింది! కెవ్వున అరిచిందామె. రెండు రోజులనుండి తను ఒక్క మెతుకైనా తినలేదన్న సంగతీ మరచిపోయి.. వాడి చెంప ఛెళ్లుమనిపించింది.

ఒకవైపు ఆకలి మంట, మరోవైపు దెబ్బల మంటతో వాడు ఇంకా ఏడవసాగాడు.

"అరెరే.. ఏంటది? పిల్లాడిని ఎందుకలా కొడ్తున్నావు? " బైటినుండే అరిచాడు భర్త గోపాల్. వాకిట్లో పడుకున్న అతనికి సూరి ఏడుపుతో నిద్రాభంగం కలిగింది.

"కొట్టకపోతే ముద్దుపెట్టుకోవాలా? ఇంత రాత్రిపూట లేచి అన్నం కావాలంటున్నాడు. ఇష్టమొచ్చినట్లు ఇంట్లో గిన్నెలు విసిరేస్తున్నాడు. చూడు చూడు.. చెంబుని నా తలమీద విసిరాడు. తల బొప్పి కట్టింది చూడు"

గోపాల్ లేచి ఇంట్లోకి వచ్చి, ఆ చీకట్లోనే ఆమె తల నిమిరి చూశాడు. అక్కడంతా గాయమై ఉంది. "వదిలేయ్, పిల్లాడు కదా! అంతగా అర్థంచేసుకునే వయసు వాడికెక్కడిది? తెలిసుంటే ఇదంతా చేస్తాడా? " అంటూనే సూరిని ఎత్తుకొని బయటికి వచ్చాడతను. వచ్చి వాకిట్లో అటూ ఇటూ నడవడం ప్రారంభించాడు. భుజంమీదున్న సూరి కాసేపటికి అలాగే నిద్రపోయాడు. తర్వాత వాడిని తీసుకెళ్లి ఇంట్లో పడుకోబెట్టాడు తండ్రి.

అంతలోనే దీపం వెలిగించిన విమల మంచంమీద కూర్చుని రోదించసాగింది.

పరిస్థితిని చూసి లోలోపల బాధపడ్డాడు

గోపాల్. ఆమె పక్కనే కూర్చొని అన్నాడు "విమలా! నువ్వే ఇలా అయిపోతే ఎలా? నేనిక ఎవరి సహాయం తీసుకోవాలో నువ్వే చెప్పు"

"ఇంకా ఎన్నాళ్లీ పరిస్థితి? మూడురోజుల నుండి పొయ్యి ముట్టించలేదు. మనం ఇంకా ఎన్నాళ్లు ఆకలితో ఉండాలి? "

"నువ్వే చెప్పు విమలా! నేను ఏం చేయాలి? నాకైతే ఏదీ తోచడం లేదు"

"ఇంకెప్పుడు అర్థంచేసుకుంటావ్ నువ్వు? మనం ఆకలితో చచ్చిపోతా మేమో? "

"విమలా! అలాంటి మాటలు నీ నోటి నుంచి రాకూడదు. ధైర్యం తెచ్చుకో , రేపో మాపో మనకు ఏదైనా దారి దొరక్క పోదు"

"ఇంకెన్ని రోజులుంటుంది ధైర్యం? పిల్లాడు.. ఆకలితో నకనకలాడుతున్నాడు. నువ్వేమో రేపటి సంగతి మాట్లాడు తున్నావు. ఇప్పుడేం చేయాలో అది ఆలో చించవేమిటి? "

"విమలా! నీకూ తెలుసు. సత్తిరెడ్డి దాదాగిరీతో, మనకు పని ఇవ్వడానికి ఎవ్వరూ ముందుకు రావడం లేదు"

"అలాగైతే నన్నే సత్తిరెడ్డి దగ్గరికి పంపించు! పంపించవా? ఎందుకు పంపించవు నువ్వు? చివరికి అతనూ కావా లనుకునేది అదే కదా!"

"విమలా! నోర్ముయ్! అలా మాట్లాడటా నికి నీకు సిగ్గుగా లేదూ? "

"ఎందుకు లేదూ? ఉంది.. నాకు సిగ్గుగానే వుంది. ఆకలితో కొడుకు అలమ టించిపోతున్నాడు. కానీ వాడికి నేను అబ ద్ధంమీద అబద్ధం చెబుతూనే ఉన్నాను! ఎందుకిదంతా? అమ్మగా నా పని నేను చేస్తున్నానంటావా? లేదు. అలాంటప్పుడు ఈ శరీరాన్ని ఏం చేసుకోమంటావో చెప్పు? "

"విమలా! ఇప్పుడు ప్రశ్న శరీరం గురించి కాదు, విలువ గురించి"

"హు.. విలువ! అది మనలాంటి వాళ్ళకా? నాకైతే నవ్వొస్తోంది. విలువలూ ప్రతిష్టలూ ఉండేది సత్తిరెడ్డిలాంటి వాళ్ల కేగా? వాళ్లు పెద్ద వాళ్ళు కదూ! పేదల రక్తాన్ని పీల్చి పీల్చి బలిసిపోయిన వాళ్లు. పెద్ద పెద్ద బంగళాల్లో ఉంటుంటారు. పోలీసులూ వాళ్ళవైపే. అసలు సర్కారంతా సత్తిరెడ్డిలాంటివాళ్లదేగా!"

"ఏం చేయమంటావ్? మనలాంటి పేద వాళ్ళు ఎందుకు పుడతారో తెలుసా? అవ మానం భరించడానికే! ఈ పరిస్థితి ఇప్ప టిది కాదు, ఇది పురాణ కాలం నుండీ వున్నదే"

"ఇప్పుడూ అంతేనంటావా? పరిస్థితి మారదా? మనమేమీ చేయలేమా? " "ఏం చేస్తానంటావ్ నువ్వు? అంతా మార్చేస్తావా? ఆ సత్తిరెడ్డితో వాదనకు దిగుతావా? "

"తప్పకుండా దిగుతా. అతను నన్నింకా చెడు దృష్టితోనే చూశాడంటే .. పోలీస్స్టే షన్కి వెళ్తా, కోర్టుకెక్కుతా"

"ఇంతకుముందు కూడా కోర్టుకెక్కలేదా మనం? అతనేం చేశాడో గుర్తుందిగా. మన రెండెకరాల పొలాన్నీ కాజేశాడు. అప్పుడు ఏమయ్యారు పోలీసులు? అప్పుడు ఏం చేశాయ్ కోర్టులు? ఇకముందూ జరిగేది అంతే!

"కోర్టులు ఎందుకు చేయవు? పోలీసులు ఎందుకు చేయరు? జరగాల్సిన మంచే జరుగుతుంది. లేదంటే ఊరుకుంటానా? ఈసారి కోర్టు ముందే ప్రాణం తీసు కుంటా" అంది విమల మళ్లీ ఏడుపు మొదలెట్టాడు సూరి. "ఆకలి, ఆకలి" అంటూనే ఉన్నాడు. "చిన్నా! బంగారు కన్నా!" అంటూ వాడిని మరింత దగ్గరికి తీసుకుంది విమల. వాడి ఖాళీ పొట్టను చేతితో నిమరసాగింది. నిమురుతూనే గోపాల్తో అంది "నా బిడ్డకి ఏమైనా అయితే, నేను కూడా బతకను. నేనూ

ప్రాణం తీసుకుంటాను"

"అలా కానివ్వను విమలా! అలా కానివ్వను" అంటూనేగోపాల్ గబగబా బైటికి నడిచాడు.

ఉలిక్కిపడింది విమల. అతనేమైనా చేసుకుంటాడేమోనని భయపడింది. వెంటనే కొడుకుని ఎత్తుకొని అరుస్తూ అతని వెనకే వచ్చింది " ఎక్కడికెళ్తున్నావు? .. చెప్పు.. నిన్నే అడిగేది!"

"ఎక్కడికీ లేదు. నువ్వు కాసేపు కూర్చో, నేను ఇప్పుడే వస్తా" అన్నాడతను. వాకిట్లో పడున్న ఓ ఖాళీ సంచీని తీసుకుని హడావుడిగా వెళ్లిపోయాడు.

విమల వాకిట్లో తలపట్టుకు కూర్చుంది. మనసేదో కీడు శంకిస్తోంది. అతనికోసం అరగంట పైగా ఎదురుచూస్తూనే వుంది. భర్త క్షేమంగా తిరిగి రావాలని పదేపదే అనుకుంటున్న సమయంలో.. ముగ్గురు వ్యక్తులు తన ఇంటివైపే వస్తుండటం గమనించింది. వాళ్లలో ఒకతను తెలిసిన వాడిలా వున్నాడు. కానీ.. తలకు గుడ్డ చుట్టుకున్నాడు.

మిగతా ఇద్దరిలో ఒకడు.. సత్తిరెడ్డిలా ఉన్నాడే? అవును.. అతనే.. ఆ ఎత్తైన మనిషే.. అనుకుంటుంటే గుండె గుభేల్ మంది విమలకి.

ముగ్గురూ వచ్చి వాకిట్లో ఆగారు. విమల అనుమానమే నిజమైంది. వచ్చిన వాళ్లలో సత్తిరెడ్డి ఉన్నాడు!

"విమలా! ఎంత పని చేశావ్? నీ భర్తని చివరికి దొంగతనానికి పంపించావా? నా స్టోర్‌రూమ్ నుండి బియ్యం దొంగిలించడానికి వచ్చాడతను. అలా చేయించాల్సిన అవసరమేమిటి నీకు? ఏ సహాయం కావాలన్నా నన్నే అడగొచ్చు కదా. నీకు ఉపకారం చేయడానికి నేనెప్పుడూ సిద్ధమే. నేనున్నా కాబట్టి, నువ్వు ఏ విషయంలోనూ భయపడాల్సిన పనే లేదు. అన్నట్లు, నీ భర్త క్షేమంగానే ఉన్నాడు. ఏవో నాలుగు చిన్న దెబ్బలు తగిలాయంతే! తెల్లారేటప్పటికి నీ దగ్గరికి చేరుకుంటాడులే. అప్పటి దాకా, రాత్రంతా నీ రక్షణ కోసం నేను ఇక్కడే వుంటా" అంటూనే విమల దగ్గరికి వచ్చాడు సత్తిరెడ్డి. పక్కనే ఉన్న ఇద్దరికీ సైగలతో ఏదో చెప్పాడు.

అంతే. ఒకతను తన చేతిలోని బియ్యపు సంచీని తలుపు దగ్గర ఉంచి, ఇంటి వెనక నుండి వెళ్లిపోయాడు. రెండో అతను పిల్లాడిని విమల దగ్గర నుండి గుంజుకున్నాడు.

ఆమె నోట మాట రాలేదు. అదే అదనుగా సత్తిరెడ్డి ఆమె చేయి పట్టుకుని లోనికి లాక్కెళ్లాడు, ఇంట్లో వెలుగుతున్న దీపాన్ని ఆర్పాడు.

బంగ్లాదేశ్ కథ

-ఉస్మాన్

# బహుమానం

## అనువాదం : రోహిత్

నేనీ కథ మొదలుపెట్టేముందు మీకో విషయం చెప్పాలి. మీ స్కూల్లో ఏమన్నా ఫ్యాన్సీడ్రెస్ పోటీలవంటివి జరుపుతుంటారా? మీరు తమాషా దుస్తులేసుకుని, అంటే వీధుల్లో రకరకాల వస్తువులమ్మే వాళ్ళలా, చెప్పులు కుట్టేవానిలా దుస్తులు ధరించి అభినయిస్తారా? కేవలం స్కూల్లోనే కాక బైట కూడా చిన్నపిల్లలకి ఇలాంటి పోటీలు నిర్వహిస్తారా? సరే.. ఇక కథ ప్రారంభించనా!

అది అందమైన పార్కు. వరుసల్లో ఉన్న పెద్ద చెట్లు! రకరకాల పూలచెట్లు, మొక్కలు పచ్చనితివాచీ పరిచినట్టు పచ్చ గడ్డి. పిల్లలకి ఆ పార్కులో ఫ్యాన్సీ డ్రెస్ కాంపిటీషన్స్ అప్పుడప్పుడూ నిర్వహిస్తారు!

ఆరోజు బాగా ఎండగా ఉంది. మధ్యాహ్నం కావడంతో మరింత ఎండ మండుతోంది. ఇజాద్ హాయిగా ఒక పెద్ద చెట్టు మొదట్లో నిద్రలో జోగుతున్నాడు. పార్కులో చల్లదనానికి ఎవరైనా సరే నిద్రలో జోగుతారు సుమా! ఇజాద్‌కి మెలుకువ వచ్చేటప్పటికి అతనికి అంతా కొత్త కొత్తగా అన్పించింది. "ఒరేయ్.. ఇజా నేను బయటకెళ్ళి వస్తాగాని నీవిక్కడే ఉండు. అదిగో అక్కడున్న పిల్లల్తోఆడుకుంటూ వుండు నేను త్వరగానే వస్తాలే.." అని అతని తల్లి చెప్పేసి పోయింది కానీ ఇంతవరకూ పత్తా లేదామె! పూల పొదల దగ్గర కుర్చీలు, బల్లలు కనపడుతున్నాయి వాడికి. అందమైన చీరెల్లో చక్కగా ముస్తాబైన స్త్రీలు, పరుగులు తీస్తున్న చిన్నారి బాలబాలికలు కనపడ్డారు. ఇజాద్‌కీ ఆడుకోవాలనిపించింది కానీ ఎందుకో తటపటాయించాడు. "మా అమ్మ ఉంటే ఎంత బాగుండు?" ...అనుకున్నాడు. హార్మోనియం, ఫ్లూట్, పాటలు పాడుతున్న శబ్దాలు వినబడుతున్నాయి. వాడు లేచి అప్రయత్నంగా అటువైపు అడుగు వేశాడు. వాడి ఈడున్న పిల్లలంతా అక్కడ గుమిగూడారు. ఓహ్! అంతా తమాషా ఫ్యాన్సీ డ్రెస్సుల్లో కళకళలాడ్తున్నారు.

ఒక పిల్ల చైనీస్ డ్రెస్, ఇంకో పాప అడవిమనిషి డ్రెస్సులో ఉంటే, ఓ కుర్రాడు పిల్లి మాస్కుని ధరించాడు. ఇంకొకడు నడుంకి పిస్తోలు తగిలించి పోజు కొడ్తున్నాడు.

ఇజాద్ ఇంకాస్త ముందుకు కదిలాడు.

ఒక కుర్రాడు ఒక చేతిలో గన్‌తో, రెండో చేతిలో నిజం పక్షులా.. అని భ్రమింపచేసేలా ఉన్న బొమ్మ పక్షుల్తో నుంచున్నాడు. అక్కడున్న టేబుల్స్‌పై రకరకాల కేక్స్ స్వీట్స్... ఎన్నో ఎన్నెన్నో తినుబండారాలు. రంగురంగుల దుస్తులు, నవ్వులతో వెలిగి పోతున్న మొహాలు!

'అబ్బ! మా అమ్మ ఇప్పుడు ఇక్కడుంటే ఎంత బాగుండు!' ఇదే ఇజాద్ ఆలోచన.!

సీతాకోక చిలుకల్లా ఎగుర్తూ త్రుళ్ళుతున్నారు పిల్లలు. హాయిగా ఆడుతూ పాడుతున్నారు. లతలు, ఆకులున్న డిజైన్స్ సిల్క్ ఫ్రాక్‌లో ఉన్న ఓ పాప మౌత్ ఆర్గాన్ వాయిస్తోంది. పొద చుట్టూ తిరుగుతూ తాడాట ఆడుతోంది. వేటగాడి

వేషంలోని పిల్లాడు తన ఫ్రెండ్స్‌ందర్నీ తరుముతున్నాడు. అడవి జాతివారి దుస్తులు ధరించిన పిల్ల కాలిగజ్జెలు కట్టుకుని ఆడసాగింది. అవి ఘల్లు..ఘల్లు మంటున్నాయి. దాని కనుగుణంగా ఎవరో ఫ్లూట్ వాయించసాగారు. రంగు చీరల్లో ఉన్న స్త్రీలు వారిని వెన్నంటే ఉన్నారు. తనకి తెలియకుండానే ఇజాద్ కూడా వారి మధ్య దూరిపోయిడు. "వావ్! ఈబాబు ఎంత బాగా డ్రస్సు వేసుకున్నాడో? అన్నారందరూ ఇజాద్ వాలకం చూసి. పిల్లలంతా వాడిని అభినందిస్తున్నట్లు చుట్టూమూగారు. వాడికి అదోలా అన్పించింది కానీ ఏమాత్రం భయపడలేదు సుమా!

మిసెస్ మజుందార్, రూబీ చౌదరీ, లిల్లీఖాన్, హజేరా తాలూక్‌దార్ ఇంకా ఎంతో మంది గొప్పగా కనబడుతున్న ఆడాళ్లంతా అక్కడ చేరారు. "వాహ్! ఎంత బాగున్నాడో ఈ కుర్రాడు!" ఆంగ్లంలో కామెంట్ చేసి మెచ్చుకుంది మజుందార్. "ఎవరి కొడుకు వీడు? ఎంత బాగా ఈ కాంపిటీషన్స్‌కి మేకప్ అయి వచ్చాడు?!" తన కూతుర్ని అరేబియన్ డ్రెస్సులో ముస్తాబు చేసిన మిసెస్ కరిమా తాలూక్‌దార్ అంది, "బహుశాః ఈ కుర్రాడికే ఫస్ట్ ప్రైజ్ రావచ్చు. 250 టాకాలు వీడి స్వంతం అవుతాయి కాబోలు!" రూబీ చౌదరీ ప్రశంసాపూర్వకంగా చూస్తూ అంది, "అబ్బ! ఒళ్ళంతా దుమ్ము కొట్టుకున్నట్లుగా ఆ కుర్రాడెంత నేర్పుగా ఒళ్ళంతా పౌడరు పులిమాడో చూశారా? ఓ బిచ్చగత్తె కొడుకు ఏడ్చినట్లుగా, ఎంత చక్కగా అతని బుగ్గలపై కన్నీటి చారికలు ఎండినట్లుగా ఎంత బాగా మేకప్ చేసుకున్నాడు? "

కొత్తగా స్కూల్లో చేరిన టీచరు లిల్లీఖాన్ అంది. "మిసెస్ చౌదరీ! పిల్లలకి ముష్టివారుగా డ్రెస్, మేకప్ చేయకూడదు. వారి మనసులపై అది చెడ్డ ప్రభావం చూపుతుంది సుమా! అని. రెబాసర్కార్ తన కెమెరాతో రాగానే కరిమా తాలుకుదార్ అడిగింది, "ఏం చేస్తావు ఆ కెమెరాతో? "

"ఈ అబ్బాయి స్నాప్‌షాట్ తీసి న్యూస్ పేపర్‌కి పంపిస్తా. తప్పక సెకండ్ ప్రైజన్నా వచ్చి తీరుతుంది. కనీసం 250 టాకాలు వచ్చి తీరుతాయి"

రెబాసర్కార్ వివిధ కోణాల్లో ఇజాద్ ఫొటోలు తీసింది. కొద్ది నిమిషాల్లో ఆ పార్కంతా హడివిడి, సందడిగా మారింది. చాలామంది స్త్రీలు కూడా అక్కడ చేరి తమకు తోచిన వ్యాఖ్యానాలు చేయసాగారు. నలభై ఏళ్ల రోజెనా మాలిక్ అంది, "ఈ కుర్రాడి దగ్గరే మనమంతా మూగటం ఎందుకు? ఎవరు ప్రైజుకి అర్హులో వారికే దక్కుతుంది. ఆడపిల్లలు మగపిల్లలు అంతా ఆడతారిప్పుడు..."

లిల్లీఖాన్ ఇజాద్‌ని అడిగింది, "నీ పేరే మిటోయ్? "అని. "ఇజాద్". "మీ నాన్న పేరు? " లిల్లీ ప్రశ్నకి వాడు జవాబు చెప్పలేకపోయాడు. విషాదంగా చుట్టూ చూశాడు. ఆపద్బాంధవిలా రోజెనా వచ్చి"రెబా! పద పద. లిల్లీ! ఇంక ఆపవమ్మా నీ పోలీసు ఎంక్వైరీ, ప్రైజులిచ్చేటప్పుడు ఆ పని చేద్దువుగానీ... పిల్లల్ని ఆడుకోనివ్వు ఇప్పుడు..."

లిల్లీ ఇజాద్‌ని బుజ్జగిస్తున్నట్లుగా "వెళ్లి వారితో ఆడుకో బాబూ" అంది. వాడికి రిలీఫ్ అన్పించింది. కానీ ఆడుకోవటానికి వెళ్లకుండా పార్క్ ఫెన్సింగ్ దగ్గర కూలబడి నలువైపులా చూడసాగాడు. పార్టీ బ్రహ్మాండంగా, సందడిగా సాగుతోంది.

ఇజాద్ మనసులో..తనకి 250 టాకాలొస్తాయా? అని అంచనా వేసుకుంటున్నాడు. "అబ్బ! నిజంగా ఆ ప్రైజ్ వస్తే ఎంత బాగుండు? " అన్నది అతని ఆలోచన. పిల్లలు, పెద్దలు, అమ్మలు అక్కాచెల్లెళ్లు అంతా ఇంకా వస్తూనే ఉన్నారు పార్కులోకి. ఓ ముప్ఫై ఏళ్ల యువతి పిల్లలందర్నీ పిల్చి బిస్కెట్స్, కేక్స్

ఇచ్చింది. ఇజాద్ ఓ చిన్న కేక్ ముక్క తీసుకుని, చుట్టూ చూస్తున్నాడు. వాడికి ఆడాలన్పించడంలేదు. పార్కు మధ్యలో పిల్లలందరూ గుండ్రంగా కూచుని పద్యాలు చదవసాగారు. ఇజాద్ వారికి దగ్గరగా కూర్చుని శ్రద్ధగా వింటున్నాడు. ఓ చిన్న పాప బుల్లి కవిత చదివింది. ఓ కుర్రాడు తమాషా పద్యం ఇలా చదివాడు " నిన్న ఒక మంచి పిల్లవాడు, నేనడిగిన బిస్కెట్, స్వీట్, చాక్లెట్, స్పాంజికేక్ ఇస్తాడా" అంతా పడీపడీ నవ్వితే ఇజాద్ చిర్నవ్వుతో ఆలకించాడు. బాలికలంతా బ్రహ్మాండంగా డాన్సులు చేస్తున్నారు.

మరో మహిళా బృందం ఇజాద్‌ని గురించి రిసెర్చి ప్రారంభించింది.

హజేరా అంది, 'రెబా' నీ లిస్టుని ఒక సారి చెక్ చేయ్.. ఎవరబ్బాయి అతను? అచ్చు ముష్టాడిలానే ఉన్నాడు. వాడికే ఫస్ట్ ప్రైజ్ ఇవ్వాలి..."

"అవును" అంది మిసెస్ మజుందార్.

"సరేలే, జడ్జీల తీర్పు ఎలా ఉందో? అతనెవరి కొడుకో తెల్సుకుని తీరాలి..." రెబా తన బ్యాగ్‌లోంచి ఓ పేపరు తీసి చూస్తూ "ఇతను ఫిరోజాబాను కొడుకై ఉంటాడు" అంది.

"అవును" అన్నారు ఎవరో.

"ఆ చిన్నపిల్లాడ్ని ఒక్కడ్నే ఎందుకు పంపిందబ్బా? " లిల్లీఖాన్ ధర్మసందేహం!

"ఆ... ఆమెకి బోలెడంత మంది కదా? ఆమె కొడుకే వీడు" మిసెస్ మజుందార్ మాటలకు అందరూ సమ్మతించారు. ఇజాద్ హాయిగా డాన్సు చూస్తుంటే, ఓ పిల్ల అరిచింది, "ఏయ్! బబ్లూని ఇక్కడికి తీసుకుని రా..."అని ఓ పనిగత్తెని అదేశించింది. మధ్యవయసు దాటిన తెల్లని దుస్తుల్లో ఉన్న కొందరు స్త్రీలు డయాస్ ముందు కూర్చున్నారు. ఓ చిన్న బాబుని వళ్లో కూర్చోబెట్టుకుని ఒకామె అంది, "బాబూ! పద్యం చెప్పవూ? "అని.

"బబ్లూ ఎర్రచొక్కా బూట్లతో ఉన్నాడు" అంటూ ఆ చిన్నారి చెప్పిన పద్యానికి అంతా నవ్వారు. వాడు తన ఆయా దగ్గరకెళ్లిపోయాడు.

ఇజాద్ పిల్లల్తోపాటు భోజనం పూర్తిచేశాడు. సాయంత్రం ఐదు అయింది. కొంత మంది కాస్త వయసు పైబడిన స్త్రీలు పార్కు గేటుని దాటుకుంటూ వస్తున్నారు.

"ఆ... వస్తున్నారోయ్ జడ్జీలు...అని అక్కడున్న కొంత మంది ఉత్సాహం, ఉద్వేగంతో అరిచారు. ఆ ఐదుగురు స్త్రీలకి ఎంతో అతిథి మర్యాదలు చేసి ఫ్యాన్సీ డ్రెస్ కాంపిటీషన్స్‌కి న్యాయనిర్ణేతలుగా ప్రకటించారు. వారిని ప్రత్యేక టేబుల్ దగ్గరికి తీసుకెళ్లి టీ, బిస్కెట్స్ ఇచ్చారు.

వారికి దగ్గర్లో ఒక బల్లపై ఎన్నో బొమ్మల్ని అమర్చారు.

ఇజాద్ వాటినన్నిటినీ చూసి ఆశ్చర్యపో యాడు. పిల్లలూ! మీరంతా ఆ ఖాళీస్థలంలో క్యూ లో ఉండండి" పద్యాలు అప్పచెప్పించుకుంటున్న ఓ మహిళామణి ఆజ్ఞ జారీ చేసింది. పిల్లలంతా వెంటనే క్యూ పాటించారు. పిల్లల ఆటపాటలు డాన్సుల్తో హోరెత్తిపోతోంది పార్కు. రెబాసర్కార్ పోటీదార్ల పేర్లన్నీ రాస్తోంది. ఇజాద్ తన పేరు చెప్పి ఊరుకున్నాడు. నాన్న పేరు చెప్పలేదు. హజేరామాలిక్ అతని వైపు వంగి అడిగింది. 'ఏంటీ? ఈ చిన్నవాడు తన పేరు తప్ప ఇంకేమీ చెప్ప టంలేదా? సరే. వాళ్లమ్మను రానీయండి. వచ్చాక చూద్దాం..."

ఇంతలో ఒక జడ్జీ అంది, "మిస్ సర్కార్, త్వరగా కానివ్వాలి. సాయంత్రం నాకు వేరేచోట పనుంది"

"ఓ అలాగే... అంతా సిద్ధం అంది సర్కార్. పోటీలో పాల్గొనే పిల్లలంతా బుద్ధిగా కూర్చున్నారు.

"మిసెస్ బానూ మజుందార్ ఇంకా వచ్చినట్లు లేదే? ఆమెకోసం వేచి చూద్దాం. ఆమె రెండు వందల టాకాలు తక్కువ కాకుండా విరాళం ఇస్తూ ఉంటు ంది. అడుగడుగునా మనకి ఆమె సాయం అవసరం. అందుకే వెయిట్ చేద్దాం..."

కానీ న్యాయ నిర్ణేతలు తమ హడావి డిలో తామున్నారు. ఇంక వేచివుండే ప్రసక్తే లేదని చెప్పారు. మిసెస్ తాలూక్ దార్ అనేసింది, "ఎందుకు వెయిట్ చేయాలి మనం? అసలావిడ ఎప్పుడూ లేటుగానే వస్తుంది"

"అలాగా... ఇది దురదృష్టకరం" అందు కుంది మిసెస్ మల్లిక్.

"కానీ తన కొడుకుని మాత్రం సకాలానికి పంపిందే? !!" ఎవరో అన్నారు. చీకటి పడ్తుండడంతో అందరిలో అసహనం పెరి గిపోతోంది. భూమి బద్దలై అందులోంచి వచ్చిందా అన్నట్లు మిసెస్ ఫిరోజా బానూ పార్కులో ప్రత్యక్షమైంది. నలభై పైన ఉన్న ఆమె బాగా డబ్బున్న స్త్రీలానే కన్ప డ్తోంది. గబగబా ఆమె దగ్గరికి పరుగె త్తారు కొందరు మహిళలు.

"ఏమిటింత ఆలస్యం మేడం? " గౌరవం గానే ప్రశ్నించారు. రెబాసర్కార్ అంది,

"మేడం! మీ బాబుకే ఫస్ట్ ప్రైజ్ వచ్చి తీరాలి. మీరు కాస్త ముందు రావచ్చుగా? మీరు రాకుంటే, ఈ ఫంక్షన్‌కి కళాకాంతు లేముంటాయి? " ఎవరో అందుకున్నారు.

"మీరెంత బాగా బిచ్చగాడి వేషంలో మీ కొడుకుని అలంకరించారండీ? "

ఆమె దగ్గరికి ఇజాద్‌ని తెచ్చారెవరో. మిసెస్ ఖొండాకర్ వాడి తల నిమురుతూ అంది, "మేడం! మీలో ఇంత కళాహృ దయం ఉందని తెలీదు. అసలు మీరు అలాంటి విషయాలు మాట్లాడరు గదా? బాగా మేకప్ చేస్తారండీ మీరు" ఇలా అక్కడ చర్చలు సాగుతూనే ఉన్నాయి.

పాపం మిసెస్ బానూకి నోరెత్తే ఛాన్సే లేదు. అంతా ఆమె ఆర్టిస్టిక్ టాలెంట్‌ని పొగిడేవారే. ఆమె విసిగిపోయి ఒక్క అరుపు అరిచింది.

"అబ్బా... ఆపండమ్మా! నన్ను మాట్లాడనీయరేంటి? "

అంతా గప్‌చుప్! అయిపోయారు.

"మీరు చెప్తోందేంటో తలాతోకా లేకుండా ఉంది. అర్థం కావడంలేదు సుమా!"

"మీ బాబుకి ఫస్ట్ ప్రైజ్ వచ్చి తీరు తుంది. మరి మీరెందుకింత ఆలస్యంగా వచ్చారు మేడం? " రూబీ ప్రశ్నించింది.

"ఏంటీ? నా బాబా? నా కొడుకా? నివ్వెరపోయింది బానూ, "నా పిల్లల్తో ఏ ఫంక్షన్‌కైనా నేను రావడం మీరు చూశారా? ఏం మాట్లాడుతున్నారు? "

"అబ్బ! ఆర్టిస్టిక్ మైండ్ అంటే మీదే

నండీ! మీ బాబు నిజంగా వండర్‌ఫుల్”

బానూకి కోపం ఉవ్వెత్తున ఎగిసిపడింది. “ఎవరా పిల్లాడు? నా కొడుకు అని అంటారేంటి? ”

ఎవరో ఇజాద్‌ని ఆమె దగ్గరికి తీసుకొచ్చారు.

“అరే! వీడు నా కొడుకని మీకు ఎవరు చెప్పారు? ఎవరబ్బాయి? ” తెల్లబోతూ ప్రశ్నించింది బానూ మజుందార్.

“ఏంటీ? మీ అబ్బాయి కాదా? ”

ఎవరికీ నమ్మబుద్ధి కాక రెట్టించి మరీ అడిగారు. అంతే, మిసెస్ బానూ కోపంతో విరుచుకుపడింది.

“నన్నేమనుకుంటున్నారు? నా కొడుకుని ఓ ముష్టివాడి వేషంలో ఫ్యాన్సీడ్రెస్ కాంపిటీషన్‌కి పంపిస్తానని ఎలా భావించారు? నాకేం డబ్బు లేదా? ఈ సిటీలో ఐదు ఇళ్లు, నాల్గు కార్లున్న నేను ఓ ముష్టి కుర్రాడికి తల్లినా? ”

“ఐతే మీ బాబు కాదన్నమాట!! అని తన చేతిలోని లిస్టు చూస్తూ “ఏయ్ కుర్రాడా? నీ పేరేమిట్రా? ” కరిమా అడిగింది. వాడు కాస్త నెర్వస్‌గా ఫీలయినా ఠక్కున జవాబు చెప్పేశాడు. “ఇజాద్”

“మీ నాన్న పేరు? ”

“నాన్న లేడు, చచ్చిపోయాడు”

“అమ్మ? ”

“అమ్మ కూడా చచ్చిపోయింది”

“మరి నీవెవరి కొడుకువిరా? ”

“ప్రొద్దుట ఒకామెను నేను “అమ్మా” అని పిల్చాను. ఆమె వచ్చి నన్ను తీసికెళ్తానని, ఈ పార్క్‌లో ఉండమని చెప్పింది.

వాడి మాటలకి కొంతమంది స్త్రీలు విరగబడి నవ్వారు. “మరి మీ కొత్త అమ్మ ఎవర్రా? ”

“ఆమె ఒక బిచ్చగత్తె”

ఇజాద్ జవాబుకి కరిమా ఓర్పు నశించింది. ఇక ఎంక్వైరీ, ఇంటరాగేషన్ మొదలెట్టింది.

“నీవెక్కడుంటావు? ”

“నాకో స్థలం అంటూ లేదు”

“మరి నీవెవరివి? ”

“ఓ ముష్టి పిల్లాడ్ని”

“బిచ్చగాడివా? ” అంతే, వాడి దగ్గరున్నవారంతా దూరంగా పారిపోయి నిలబడ్డారు.

“నీవు నిజంగా బిచ్చగాడివేనా? ” కరిమా గొంతు బొంగురు పోయేలా అరిచింది.

“అవును’

“యూ బ్లడీ... నీవిక్కడికి ఎలా వచ్చావురా? ” ఆమె కోపంతో వణికిపోతూ ఇజాద్ చెంపపై ఒక్కటిచ్చింది. ఠప్‌మని చెంప పేలిపోయేలా.

రోజెనామాలిక్ అందుకుంది “వీడు ఓ వీధిలో అడుక్కునేవాడా? మనమంతా వాడు భలే మేకప్ వేసుకొచ్చాడు ఫ్యాన్సీ డ్రెస్ పోటీకి అని భ్రమపడ్డాం. ఆ బ్లడీ క్రీచర్ శరీరంపై నిజంగా మట్టి,దుమ్ము, బూడిదే!”

రెబా వాడ్ని పటాపటా చెంపలు వాయించింది. మిసెస్ ఖొండాకర్ వాడ్ని కాలితో బలంగా తన హైహీల్డ్ షూస్‌తో వీపుపై తన్నింది. ఇజాద్ బోర్లా పడ్డాడు.

మిసెస్ మల్లిక హిందీలో గొంతు చించుకుంటోంది. “ఏయ్! ఎవరే అక్కడ? సబ్బు, నీళ్ళూ తీసుకురావే ...”

ఆ గొడవకి ఖంగారుపడి బిత్తరపోయిన పిల్లలు ఏడ్పు లంకించుకున్నారు. ఇజాద్ ధైర్యమున్నవాడే. అన్ని తన్నులు తిన్న వాడు ఠక్కున లేచి ఆ జనం మధ్యలోంచి పరుగు లంకించుకున్నాడు. హైహీల్డ్ షూస్ ఇంకా గాలిలో తేలి వాడి తలపై పడ్తుంటే, సన్నని ఊచల్లాంటి కాళ్లతో వందలాది మంత్రగత్తెలు వాడిని తరుముతున్నంత ఫీలింగ్‌తో అలా పరుగు తీస్తూనే ఉన్నాడు. వాడి చెవిలో ఆ మాటలింకా గింగిర్లు తిరుగుతున్నాయి. “సబ్బు, నీళ్ళు తీసుకురావే.. సబ్బు.. నీళ్ళూ..” V




# మంటలు

అనువాదం : సిహెచ్. వెంకటేశ్వరరావు

**దు**మ్ముకొట్టుకున్న మొహాన్ని కర్చీఫుతో తుడుచుకున్నాడతను. కొండపైకి చేరుకుని ఆయాసం తీర్చుకుంటున్న అతనికి దూరంగా వున్న ఇళ్లు మసకగా కనబడుతున్నాయి. 'ఏదైనా చెయ్యాలి. అనేకమంది వూరేగింపుగా వెళ్తే, వాళ్లు తప్పకుండా లొంగుతారు' అనుకున్నాడు.

మళ్లీ నడక సాగించాడు. ఎదురెండకు వళ్లంతా తడిసి ముద్దయింది. కర్చీఫ్‌తో తుడుచుకున్నాడు. కింది లోయలో గుడిసెలు నిర్జీవంగా కనబడుతున్నాయి. తను జీవితమంతా వాళ్ల మధ్యే గడిపాడు. ప్రతి నీగ్రో మగ, ఆడ, పిల్లల్నికూడా పేరు పేరునా గుర్తు పట్టగలడు. ఆ అమాయకమయిన నల్లటి ముఖాలు కళ్లముందు కనబడుతూ ప్రశ్నిస్తున్నాయి.

"వాళ్లకేం సమాధానం చెప్పను? " గొణుక్కున్నాడు.

తలెత్తి చూశాడు. పచ్చని పొలాలు! కాని తన జనం ఆకలితో అలమటిస్తున్నారు.

'ఇలా జరగడానికి వీల్లేదు, దీనికేదో చెయ్యాలి' అనుకున్నాడు 'టైలర్'.

చెయ్యటానికి ఏముంది? నల్లవాళ్లందరికీ చెప్పాలి. తెల్లవాళ్లు తిండిపెట్టడానికి ఒప్పుకోలేదని- అంతే!'

'బహుశా ఆ కమ్యునిస్ట్ నాయకులు హేడ్లీ, గ్రీన్‌లు చెప్పేవి నిజమేనేమో! నల్లవాళ్లంతా పెద్ద వూరేగింపు తీస్తే, తెల్లవాళ్లు చచ్చినట్టు లొంగి వస్తారని! అనుకుంటూ చర్చి ఫాదర్ టైలర్ సన్నని కాలిబాటలోకి వచ్చి గుడిసెల వైపుకి నడిచాడు. నీగ్రో జనాలు గుంపులుగా కూర్చుని వున్నారు.

"హలో ఫాదర్!"అంటూ అందరూ ఆప్యాయంగా పలకరించసాగారు. అందర్నీ పరామర్శిస్తూ ముందుకుసాగాడు.

వీధి చివర తన ఇంటిని సమీపించాడు.

చర్చి వద్దకు రాగానే, దూరంగా ఆయన కొడుకు జిమ్మీ పరుగెత్తుకొస్తున్నాడు" నాన్నా! అంటూ.

టైలర్ ఆగిపోయి అడిగాడు "ఏం జరిగింది జిమ్మీ? "అని.

"ఇంటి దగ్గర మేయర్ నీకోసం ఎదురు చూస్తున్నాడు"

"మేయరా? "

"అవున్నాన్నా! ఆయనతోబాటు ఇద్దరు తెల్లవాళ్లున్నారు, వాళ్లలోఒకాయన పోలీసు ఇన్‌స్పెక్టర్!"

"ఎంతసేపటి నుంచీ వున్నారు? "

"ఇప్పుడే, అయిదు నిమిషాలయింది- నాన్నా, శామ్ కూడా వచ్చిపోయాడు, తెల్లవాళ్లు కార్లలో తిరుగుతూ వార్నింగ్‌లు ఇస్తున్నారుట, నల్లవాళ్లు ఇళ్లల్లో వుండకుండా వీధుల్లోకి వొస్తే గొడవ తప్పదని, మైకుల్లో అరుస్తున్నారని శామ్ చెప్పాడు!"

"నిజమా? "

"నాన్నా! నేను వెళ్ళి శామ్, పీట్, బాబ్, జాక్- వాళ్లందర్నీ కలుస్తా!"

టైలర్ కొడుకును గట్టిగా పట్టుకున్నాడు.

"నామాట విను. పిచ్చిపనులు చెయ్యకు. మనం ఏదో చెయ్యబోతున్నట్లు వూహించారంటే ఆ తెల్లవాళ్లు రెచ్చిపోయి మనపైన పడతారు. చిక్కుల్లో పడతాం!"

"మరి, వాళ్లిష్టమొచ్చినట్లు తిరుగుతూ వాగుతుంటే మనం నోరు మూసుకుని పడుండాలా? "

"నేను చెప్పినట్టు వింటావా లేదా జిమ్మీ? "

"మనం ఎదురు తిరిగినా తిరక్కపోయినా, వాళ్లు ఎట్లాగో మనల్ని చంపుతారు' ' జిమ్మీ మొహం వాడిపోయింది.

"ఏం కాదులే.. నేను పోయి మేయర్ని కలుస్తా"

"నాన్నా..వూరేగింపు గురించి మాట్లాడటానికే మేయర్ వాళ్ళొంచ్చింది"

"నీకెలా తెలుసు? "

"ఫాదర్ స్మిత్! మిగతా ఫాదర్లందరికీ చర్చిలో చెబుతున్నాడు- వూరేగింపు నీ చేత ఆపుచేయించాలని మేయర్ పట్టు పడుతున్నాట్ట" అన్నాడు జిమ్మీ.

"పైగా నువు కమ్యూనిస్టులలో కలిసిపోయావని అంటున్నాట్ట!"

"స్మిత్ ఇంకా చర్చిలోనే వున్నాడా? "

"ఆ, ఆయనా మిగతావాళ్లూ అరగంట నుంచీ నీ కోసం ఎదురుచూస్తున్నారు. హేడ్లీ, గ్రేన్ కూడా- అందరూ బేస్‌మెంట్‌లో వున్నారు"

టైలర్ భయంతో వొణికిపోయాడు.

"వాళ్లు అక్కడున్నట్లు మేయర్ కనిపెట్టాడా? "

"లేదు లేదు, ఎవరూ చూళ్లేదు. వాళ్లని వెనక గుమ్మం నుంచి రప్పించి బైబుల్ రూములో కూర్చోబెట్టా.. పోలీసాయనా, మేయరూ హాల్లో వున్నారు! నాన్నా, నాకు భయంగా వుంది!"

టైలర్ ఆలోచనలో పడ్డాడు.

"ఏం చేద్దాం నాన్నా? " అడిగాడు జిమ్మీ

"నువ్వయితే మీ ఫ్రెండ్సుకి చెప్పు ఏమాత్రం తొందరపడవద్దని-"

జిమ్మీ వీధిలోకి పరుగెత్తాడు.

"గ్రేన్, హేడ్లీ బైబుల్ రూములో- ఇన్

స్పెక్టరూ, మేయరూ హాల్లో! ఈ తెల్లవాళ్లు ఆ కమ్యూనిస్టుల్ని నా ఇంట్లో చూశారంటే ఏమన్నా వుందా? అయినా ఫాదర్ స్మిత్ ఈ విషయం తెల్లవాళ్లకు చేరవేసాడా కొంప దీసి.-అలా జరిగితే తెల్లవాళ్ళు నన్ను ముక్కలుగా నరికేస్తారు! జీసస్, నువ్వే కాపాడాలి!"టైలర్ అనుకున్నాడు.

★ ★ ★

చర్చి తలుపు తెరుచుకోగానే, లోపల హాల్లో చాలామంది మాట్లాడుకుంటు న్నారు. అంతా గందరగోళంగా వుంది.

వాళ్ళందరి ముఖాలు ఆతృతగా టైలర్ వైపు చూశాయి.

"రెవరెండ్ టైలర్! ఆ మేయరు మమ్మల్ని బూతులు తిట్టి గెంటేశాడు"

ఆడా, మగా అంతా టైలర్‌ను చుట్టుము ట్టారు.

ఒక బక్కచిక్కిన ఆడ మనిషి టైలర్ చేయి పట్టుకుని ఏడవసాగింది. "కొంపలో ఒక్క రొట్టిముక్క కూడా లేదు. ఎట్లా చావను? "

"బ్రదర్స్, సిస్టర్స్! కొంచెం శాంతంగా ఆలోచిద్దాం. ముందుగా మేయర్ ఏమ న్నారో చెప్పండి నాకు..."

"మనతిండి సంగతి తనకేం సంబంధం లేదన్నాడు. మళ్లీ కనబడితే జైల్లో పెట్టిస్తా నన్నాడు."

"అవును, వూరేగింపు తీస్తే వూరుకునేది లేదన్నాడు."

"ఊరేగింపు సంగతి అతనికెలా తెలి సింది? "టైలర్ అడిగాడు.

బక్కచిక్కిన ఆడ మనిషి మళ్ళీ ముందు కొచ్చింది.

"నా కోసంగాదు, నా బిడ్డలు- నా బిడ్డలు మలమలా మాడిపోతున్నారు-" అంటూ ఏడవసాగింది.

టైలర్ తన కోటు జేబులోంచి కొంచెం చిల్లర డబ్బులు తీశాడు. "నా దగ్గరున్న దింతే. అందరూ పంచుకోండి" టేబుల్ పైన పెట్టాడు.

"ఏం చేయాలి ఫాదర్? "

"ఈ తెల్లవాళ్లు మనపైన కొంచెం దయ చూపితే-"

"ఆకలికి తట్టుకోవడం మహా కష్టం."

"నా పిల్లకి పాలు పోసి రెండ్రోజుల యింది."

"మాట్లాడరేం రెవరెండ్? "అందరూ తమ బాధని వెళ్ళగక్కారు. టైలర్ తను నిస్సహాయ పరిస్థితికి సిగ్గుతో తల వంచుకున్నాడు. "ఏం చెయ్యగలం? ఆ కరుణామయుణ్ణి ప్రార్థించడం తప్ప-? "

అంతా మోకరిల్లి ప్రార్థించి లేచారు.

"ఫాదర్, ఇప్పుడేం చేయాలి? "

"అందరం పెద్దెత్తున వూరేగింపు

చేయాలి, ఓర్చుకోండి.. భగవంతుడు మనల్ని రక్షిస్తాడు" టైలర్ వాళ్ళందర్నీ తప్పించుకుని బయటకు నడిచాడు.

"హెల్లో, రెవరెండ్ టైలర్" అంటూ పల కరించాడు హేడ్లీ. అతనొక తెల్లవాడు.

"హెల్లో, బ్రదర్ హేడ్లీ!"

"హౌ ఆర్ యూ, రెవరెండ్!"పలకరిం చాడు గ్రేన్. అతను ఒక నీగ్రో.

"ఫైన్"

"ఈ గొడవంతా-" గ్రేన్ మాట్లాడబో యాడు.

"ష్, గట్టిగా మాట్లాడకు.. మేయర్, పోలీస్ ఇన్‌స్పెక్టరూ హాల్లో వున్నారు"

ఆ నీగ్రో, తెల్లవాడు నిశ్శబ్దంగా వుండిపో యారు.

"మేమిక్కడున్నామని వాళ్లకితెల్సిందా? " చిన్నగా అడిగాడు గ్రేన్.

"వాళ్ళకేం తెలీదు, వూరేగింపు గురించి నాతో మాట్లాడ్డానికి వచ్చినట్లున్నారు."

హేడ్లీ గ్రేన్ ముఖముఖాలు చూసుకు న్నారు.

టైలర్ వెళ్లి కిటికీ తెరలు దగ్గరగా లాగాడు

"ఇప్పుడు చెప్పండి"

"నేను చెప్పేదేముంది? మీకంతా తెలుసు-" అన్నాడు టైలర్.

"ఏమీలేదు, వాళ్లు మిమ్మల్ని భయపెట్టా లని చూస్తున్నారు" అన్నాడు హేడ్లీ.

"నాకు భగవంతుడి పైన నమ్మక ముంది" అన్నాడు టైలర్.

హెడ్లీ నవ్వాడు. " వూరేగింపుకు ఎంత మంది జనం రావొచ్చు? "టైలర్ అడిగాడు.

"ఎందుకలా అడిగారు? "

"నాకు! తెలియాలి. ఎక్కువమంది జనం లేకపోతే ఆ కొద్దిమందినీ పిట్టల్ని కాల్చినట్లు కాలుస్తారు-"

"కరపత్రాలను మీ పేరుమీద అచ్చు వేస్తే, కనీసం అయిదువేలమందన్నా వూరే గింపుకి వస్తారు"

టైలర్, కటువుగా అన్నాడు "చూడు బ్రదర్, అది వీలుపడదు. నేను ఒక ప్రీచ ర్‌'ను నేనే జనాన్ని రెచ్చకొట్టటం సమం జసం కాదు."

"అది మీ డ్యూటీ రెవరెండ్" అన్నాడు గ్రీన్.

"భగవంతుడికి సేవచేయడమే నా డ్యూటీ" అన్నాడు టైలర్.

"ఆల్‌రైట్ రెవరెండ్! మేమే చేయగలిగి నంతా చేశాం. పదిహేనువేల కరపత్రాల్ని పంచాం. అన్ని ప్రజాసంఘాలకు, తెల్లవా ళ్లనీ, నల్లవాళ్లనీ- విజ్ఞప్తి చేశాం. జనం ఎక్కువ సంఖ్యలో ఊరేగింపుకొస్తే ఏ సమస్యా వుండదు. మనల్ని అధికారులేమీ చెయ్యలేరు. మరొక కరపత్రం మీ పేరుతో వస్తేమంచిదికదా? "

అలా వద్దన్నట్టు టైలర్ తలతిప్పుతూ ఆందోళనగా మోహం తుడుచుకున్నాడు. హేడ్లీ, గ్రేన్‌లు అతన్నే పరిశీలిస్తున్నారు.

"నేను భయపడుతున్నాననుకోవద్దు. జనాల్ని మూర్ఖంగా పోలీసుల చేతుల్లోకి నెట్టవద్దు-"అన్నాడు టైలర్.

గ్రేన్ లేచాడు. "రెవరెండ్, కొంచెం ఆలో చించండి. మీరు పూర్వం ఇంతకంటే పెద్ద కార్యక్రమమే చేశారు. పోని ఇప్పుడు ఊరే గింపు ఆపివేస్తే జనం అంతా ఆకలికి మాడి చావడం ఖాయం"

"అలా వీల్లేదు" అన్నాడు టైలర్.

"అలాంటప్పుడు ఊరేగింపుకు మీరే ముఖ్యం, కాబట్టి ఒక విషయం అర్థం చేసు కొండి. మీరు తెల్లవాళ్లకు, మీ వాళ్లకు మధ్య వారధిగా వున్నారు. పేదరికంలో మగ్గుతున్న తెల్లవాళ్లు కూడా మీకు అండగా వుంటారు."గ్రేన్ అన్నాడు.

"బ్రదర్, నేను క్రిస్టియన్ని. రక్తపాతాన్ని నేను ప్రోత్సాహించను" అన్నాడు టైలర్ తీవ్రంగా.

"ఓకే రెవరెండ్, ఇప్పుడా మేయర్‌కు ఏం చెప్పాలనుకుంటున్నారు? " అని అడిగారు.

"నా ప్రజలు తిండికి మాడుతున్నారని, వూరేగింపు చేయదల్చుకున్నారని చెబుతాను"

"మేయరూ, ఇన్‌స్పెక్టరూ భయపడుతున్నారు. అందుకే మీ వద్దకొచ్చారు, వాళ్లకి స్పష్టంగా చెప్పండి. అయిదు వేలమంది తిండిలేని ప్రజల గురించి చెప్పండి, గంజి కేంద్రాలు పెట్టాలని చెప్పండి. లేదా వూరేగింపు తప్పదని, మరి మేయర్, పోలీస్ ఏ మాట్లాడారో మాకెలా తెలుస్తుంది? "

టైలర్ వాచి చూసుకున్నాడు.

"ఇప్పుడు ఆరయింది. ఆరున్నరకు కలుద్దాం..."

"ఓకే, వస్తాం"

ఇద్దరూ దొడ్డిదారిన బైటకు వెళ్లిపోయారు.

టైలర్ ఆలోచనలోపడి "జీసస్.. నేను చేస్తున్నది మంచిపనేనా? " అనుకున్నాడు మేయర్ వాళ్ళున్న హాల్ వైపు నడుస్తూ.

"హెల్లో టైలర్"

"గుడీవినెంగ్ మిస్టర్ మేయర్"

"హెల్లో, హౌ ఆర్ యూ? "

"భగవంతుడి దయసార్"

"నిన్ను చూసి చాలా రోజులైంది"

"అవును సార్"

"జిమ్మీ ఎలా వున్నాడు"

"బావున్నాడు సార్"

"మంచి కుర్రాడు. వాడిని బాగా చదివించు. ఒకనాటికి చాలా పేరు సంపాదిస్తాడు. నీకు వొంట్లో బాగాలేదని నీ భార్య చెప్పింది. బాగా లేకపోతే మరొకసారి కలుద్దాం"

"లేదు సార్, ఏదో కొంచెం జలుబు, అంతే"

"మాలాంటి దున్నపోతులకు ఏ జలుబు ఇబ్బంది పెట్టదు ఏమంటావ్ టైలర్‌డాన్- హహ్హాహ్హా..." మేయర్ అట్టహాసంగా నవ్వాడు.

"అన్నట్టు ఈయన ఇన్‌స్పెక్టర్ బ్యూడెన్. ఇతనే టైలర్.. చెప్పాగదా ఇన్‌స్పెక్టర్"

"హెల్లో ఇన్‌స్పెక్టర్" అన్నాడు టైలర్.

ఒక నల్లటి చుట్ట ఎర్రగా కాలుతోంది ఇన్‌స్పెక్టర్ నోట్లో.

"ఇతను మిస్టర్ లోవ్, ఇండస్ట్రియల్ సెక్యూరిటీ స్క్వాడ్ ఛీఫ్"అని మరో తెల్ల వ్యక్తిని పరిచయం చేసాడు మేయర్. లోవ్ మత్తెక్కిన కళ్లతో నిశ్శబ్దంగా వుండిపోయాడు.

"మేం రావడం చూసి ఆశ్చర్యపడ్డారా? " అడిగాడు మేయర్.

"కాదు సార్. నా వల్ల మీకే సహాయం కావలసినా-"

"గుడ్.. నువ్వు బాధ్యత గల మనిషివి. మేం ఎందుకొచ్చామో నువ్వు వూహించు"

"యస్సార్"

మేయర్ ఒక చుట్ట తీసి ఇచ్చాడు. టైలర్ వొద్దని వినయంగా తిరస్కరించాడు.

"చూడు..మైడియర్ టైలర్ నిన్ను నమ్మినట్లుగా ప్రతి నల్లవాడినీ నమ్మను. నువ్వు నాకు పాతికేళ్లుగా తెలుసు. అయితే మిస్టర్ లోవ్, ఇన్‌స్పెక్టర్ వేరే ప్లాను ఆలోచించారు. కాని నేను వొప్పుకోలేదు. పూర్వం ఎన్నోసార్లు మనిద్దరం కలిసి పనిచేశాం. అలాగే ఈసారి కూడా ఈ గొడవను సర్దుబాటు చేయగలం. మీ నల్లవాళ్లకు ఏ సమస్యలున్నా నా ఆఫీసు ఎప్పుడూ తెరిచే వుంటుంది. ఏ సహాయానికైనా సరే"

"థ్యాంక్యూ సర్"

"నేను స్పష్టంగా చెప్పదలచుకున్నాను. ఆ కమ్యూనిస్టు గూండాలు రేపు ఒక వూరేగింపు తీస్తారుట. నీకు తెలుసా? "

టైలర్ గుటకలు మింగి,"అందరూ అనుకుంటున్నారు"అన్నాడు. హఠాత్తుగా బ్యూడెన్ వేలు చూపుతూ.

"ఏయ్, నే చెప్పేది విను. ఈ కమ్యూనిస్టులు మనుష్యులు కాదు- దేశాన్ని నాశనం చేయాలనుకుంటున్నారు. తెల్లవాళ్లకూ, నీగ్రోగాళ్లకూ మధ్య పేచీలు పెడు

తున్నది వీళ్లే"
మేయర్ అందుకున్నాడు.
"ఆగండి మిస్టర్ బ్ర్యాడెన్, టైలర్ చాలా మంచివాడు. అతన్ని అనుమానించకండి"
మేయర్ని పట్టించుకోకుండా "మీ నీగ్రోలు ఈ కమ్యూనిస్టులను ఎంత దూరంగా వుంచితే అంత మంచిదని తెలుసుకోవాలి. అర్థమయిందా? " అని గర్జించాడు.
టైలర్ ముఖం వేడెక్కింది.
"మాట్లాడు- ఎందుకలా సైలెంట్‌గా వున్నావు? నీకూ ఆ 'రెడ్సు'కూ ఏ సంబంధం లేదుగదా? " అన్నాడు మేయర్.
"సార్, మీకూ మాకూ మధ్య పేచీలు పెట్టేవాళ్లెవరో నాకు తెలియదు. వూరేగింపు సంగతి మాత్రం విన్నా సార్. మా వాళ్లంతా తిండిలేక మాడిపోతున్నారు. ఊరేగింపు తీయటం తప్ప మరేం చేయాలో వాళ్లకు తెలియదు వాళ్ళ ఆకలి తీర్చాలి".
"అదంతా నాకు తెలుసు డాన్" అన్నాడు మేయర్.
"ఏయ్..ఆకలి లేనిదెవరికి.. మీవాళ్ళేనా తిండిలేక మాడుతోంది? ఇనస్పెక్టర్ విసురుగా అన్నాడు.
"టైలర్.. అన్ని ఏర్పాట్లూ మేం చూసు కుంటాం... ఆకలిచావులు లేకుండా ..."
"సార్, నాలుగు రోజుల క్రితం ఒక మనిషి ఆకలితో చచ్చాడు..."
"వీడు మిమ్మల్ని నమ్మడంలేదు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ మేయర్‌తో.
"లేదు సార్, జరిగిన విషయం చెప్పా"
"మాకన్నీ తెలుసు..."
"మేయర్ సార్, నా ప్రజల ఆకలి బాధ..." అన్నాడు టైలర్ బలహీనంగా.
మేయర్ ముందుకు వంగాడు.
"చూడు టైలర్.. ఈ విషయం మనల్నం దర్నీ బాధిస్తున్నది. కాని నీకు నల్లవాళ్లంతా గౌరవమిస్తారు. అందుకే చెబుతున్నా- వాళ్లతో చెప్పి ఈ వూరేగింపు ఆపించు"
"వాళ్లు ఆకలిమీద వున్నారు సార్, ఆకలి మీద వున్నవాడు ఎవరు చెప్పిన మాటా వినడు"
లోవ్ లేచాడు. "ఈ నీగ్రో వెధవ కమ్యూ నిస్టులలాగే మాట్లాడుతున్నాడు- వీడి వాగుడు ఇంక నేను వినదల్చుకోలేదు. రేయ్.. నిన్ను చెట్టుకి కట్టి వురిదీస్తే తప్ప మా మాటలు నీకు అర్థం కావు"
మేయరూ లేచాడు.
"నామాట వినవన్నమాట? "
"నేను భగవంతుడి మాట వింటాను సార్"
బ్ర్యాడెన్ కూడా లేచాడు.
"మేమే నీకు భగవంతులంరా - నేను ఇక్కడ పోలీస్ ఇన్‌స్పెక్టర్ని. మూడవందల

మంది పోలీసులు- ఒకొక్క నల్లపందినీ వూచకోత కోస్తారు"

"సార్, ఒక గంజి కేంద్రం..." అన్నాడు టైలర్ మేయర్‌తో. మేయర్ సమాధానమివ్వలేదు.

లోవ్ దగ్గరగా వచ్చాడు.

"అరేయ్ 'నిగ్గర్', ఈమధ్య నువ్వు హేడ్లీగ్రేన్‌లనూ కలుస్తున్నావని మాకు తెలుసు. కొంచెం వళ్లు దగ్గర పెట్టుకో..." ఆముగ్గురూ బైటకు వెళ్లిపోయారు. వాళ్ల కారు దుమ్ము లేపుకుంటూ దూసుకుపోయింది. టైలర్ నిస్సహాయంగా చీకట్లోకి చూస్తున్నాడు.

★ ★ ★

చర్చి ప్రార్థన గదిలో ఫాదర్లు ఎదురుచూస్తున్నారు.

టైలర్ లోపలకు అడుగుపెట్టగానే అందరూ ఒక్కసారిగా ప్రశ్నల వర్షం కురిపించారు.

"మేయరూ, ఇన్‌స్పెక్టర్, సెక్యూరిటీ స్క్వాడ్ ఛీఫూ వచ్చారు"టైలర్ చెప్పాడు.

ఫాదర్ స్మిత్ భయంగా, "అంటే లోవ్ కూడా వొచ్చాడా? " అని అడిగాడు.

"వాళ్లకు వూరేగింపు విషయం అంతా తెలిసిపోయింది. పోలీసులు రెడీగా వున్నారు విరుచుకుపడటానికి-"

టైలర్ బరువుగా వూపిరి వదిలాడు.

"మనం కమ్యూనిస్టులతో చేయి కలిపామని వాళ్లు అంటున్నారు"

"నేను ముందే చెప్పాను" అని గొణిగాడు ఫాదర్ స్మిత్.

"వాళ్లు మనల్ని భయపెడుతున్నారు" అన్నాడు టైలర్.

"వూరేగింపుకి పెద్ద సంఖ్యలో జనం వస్తే వాళ్లేమీ చెయ్యలేరు. కాదంటే మనల్ని కుక్కల్ని కాల్చినట్లు కాలుస్తారు"

"రెవరెండ్, ఈ తెల్లవాళ్లల్లోని బీదజనం మనతో కలుస్తారంటారా? " అని అడిగాడు ఫాదర్ జోన్స్.

"తప్పక కలుస్తారని చెప్పాడు హేడ్లీ"

"అయితే తప్పకుండా వూరేగింపులో వుంటా"

"నేను కూడానూ... మీ సంగతేమిటి రెవరెండ్? "

"నేనూ వుంటా... తెల్లవాళ్లూ మనతో కలిసి నడుస్తారు"

"ఆ మేయర్‌కు తెలిసేలా చేయాలి"

ఫాదర్ స్మిత్ అరిచాడు. "నాకిష్టంలేదు. నేను ఈ వూరేగింపులో వుండను"

హఠాత్తుగా జిమ్మీ తలుపు తోసుకుని వొచ్చాడు.

"నాన్నా, ఎవరో తెల్లవాళ్లు నీకోసం వొచ్చారు. బైట కారులో-"

"బ్రదర్స్, కొంచెం కూర్చోండి ఇప్పుడే వస్తాను- ఎక్కడకూ వెళ్లకండి"

టైలర్ బైటకొచ్చి మసక చీకట్లో పక్కగా ఆపివున్న కారు వద్దకు రాగానే, ఒక తెల్లవాడు బైటకు దిగాడు.

"నువ్వేనా టైలర్‌వి? "

"అవును సార్. ఏం కావాలి సార్? "

బిగించిన బలిష్టమైన పిడికిలి టైలర్ దవడపై తాకింది. ఒక్కసారిగా ఎగిరి వెనక్కు పడ్డాడు. పూలమొక్కల్లో లేవబోతున్న అతని గొంతు పట్టుకుని ఎవరో లేపారు.

"కార్లో ఎక్కరా, నల్ల గాడిదా? "

"సార్, నేను..."

"నోర్ మూయ్... కారెక్కరా"

కుడికంటిపైన ఇనప పిడికిలి బలంగా గుద్దింది. ముగ్గురు తెల్లవాళ్లు టైలర్‌ని ఎత్తి కారులో సీటు ముందు నేలపైన పడేశారు.

"ఏవిటి సార్ ఇదంతా? "

"గాడిద కొడకా, ముయ్ నోరు"

మొహంపైన బలమైన చేయి బాదింది. ఒక బండ బూటు గొంతుపైన తన్నింది. టైలర్ కాళ్లూ చేతులూ ఆడక మగతగా జరిగేదాన్ని చూస్తూ వుండిపోయాడు. చుట్టూ వున్న తెల్లమొహాలను గమనిస్తూ, కారు వేగం పుంజుకుంది.



★ ★ ★

కారు అతివేగంగా పోతూ మూడు మలుపులు తిరిగింది. టైలర్ కళ్లు మూసుకుని పడి వున్నాడు. కారు మెల్లగా పోతూ ఒక చోట ఆగింది. చెట్లలోంచి చల్లనిగాలి. 'బహుశా అడవిలోకి తీసుకొచ్చి వుంటారు' అనుకున్నాడు టైలర్. అంతలో "అరేయ్.. లేవరా అంటూ ఒకడు టైలర్ మొహంపై బలంగా గుద్దాడు.

లేచి నాలుగు అడుగులు వేశాడు.

"ఆగరా- ఇదేవిటో తెలుసా? "

"అదొక గుర్రాన్ని తోలే తోలు కొరడా."

"దీంతో గుర్రాన్ని కాదురా, నీ గ్రోగాడిద లని కూడా బాదొచ్చు"నలుగురి నవ్వులు.

"సార్..నేనేం తప్పు చేశాను? "

"నువ్వేం చేయలేదురా! కమ్యూనిస్టుల్తో కలిపి తెల్లవాళ్లని బెదిరిస్తావురా? ముందు ఆ షర్టు తీసెయ్యి."

కొరడా ఛెళ్లున మెడపైన తాకింది.

టైలర్ షర్టుతీసి పట్టుకున్నాడు. భయంతో వణికిపోతున్నాడు. నలుగురూ తన్నుకుంటూ లాక్కెళ్లారు. చెట్టు దగ్గరకు పోయి, టైలర్ రెండు చేతుల్నీవెనక్కి విరిచి తాళ్ళతో చెట్టుకి కట్టేశారు.

"అరే నువ్వు ఫాదరీవి కదా? ఇప్పుడు



ప్రార్థన చెయ్యరా వింటాం"అన్నారు. అతని వీపుపైన కొరడా భీభత్సంగా నాట్య మాడుతోంది.

"వెధవా, ప్రార్థన చెయ్యి"

"సార్, సార్, దయుంచండి. కొట్టకండి సార్"

కొరడా ఈసారి అతని మొహంపైన తాకింది. ఛెళ్లున వీపుపైన తగిలింది!

"నల్ల వెధవను దయతల్చకు బాబ్!"

"ఆ కొరడా నాకియ్యి"

టైలర్ బాధతో పళ్లు బిగించాడు. దెబ్బలు మరింత వేగాన్ని పుంజుకున్నాయి. కొరడా నలుగురి చేతుల్లోకీ మారు తోంది. దెబ్బలు మరింత వేగంగా పడుతు న్నాయి. టైలర్ శరీరం కారం పూసినట్లుగా మండిపోతోంది. ప్రతి దెబ్బతోనూ ప్రాణం పోతోంది. వేడి రక్తం కారుతూ పాంటు తడిసిపోతోంది. "బాబూ, నేను భరించ లేను- నేను ప్రార్థన చేస్తా, నన్ను కొట్టకండి సార్"

"చెయ్యి ప్రార్థన"

ఫాదర్, నీ రాజ్యం - జీసస్ రక్షించు- ఇంక నేను భరించలేను""సరిగ్గా ప్రార్థన చేయరా? "

ఇటువైపుకి తిరిగాడు, వీపుపైన దెబ్బలు తప్పించుకోవడానికి. పొట్టపైన కొరడా దెబ్బలు.

"ఏంరా, నీగ్రో! బాధ పెడుతున్నదా? "

"అరేయ్! నన్ను చంపెయ్యండ్రా! పిరికి వెధవల్లారా!టైలర్ కసిగా అన్నాడు.

"ఆగరా ఆగు! తప్పకుండా చంపుతాం. కొంచెం ఆగు" "తెల్ల వెధవల్లారా! మారోజూ వొస్తుందిరా? అప్పుడు చూద్దురుగాని- ఓ, ప్రభూ..."

కొట్టడం ఆపారు.

"ఏవిట్రా పేలుతున్నావ్? మళ్లా అను ఆ మాట? "

మళ్లా భయంకరంగా కొట్టారు.

టైలర్ కళ్లు మూసుకున్నాడు. అతని తల పక్కకి వాలిపోయింది.

వెన్నెల అతని కళ్లను కాల్చింది. చెట్ల ఆకుల చప్పుడు కర్ణభేరిని ఛేదించింది. కళ్లు తెరచుకున్నా ఏమీ కనబడటంలేదు. తీరని దాహం. మొహం తడుముకున్నాడు. చల్లని చెమట. కాదు రక్తం. నెమ్మదిగా చేతి కట్లూ, కాలికట్లూ విప్పుకున్నాడు. చెట్టుని పట్టుకుని నిలబడ్డాడు. చొక్కా తీసుకుని వేసుకుంటుంటే వీపు భగ్గున మండింది. తొడుక్కోలేక చంకన పెట్టుకున్నాడు. చుట్టూ చూశాడు. నడక సాగించాడు. ఒక చర్చి పక్కనే తెల్లవాళ్ల శ్మశానం. "చావు

కూడా నల్లవాళ్లనూ, తెల్లవాళ్లనూ కలప లేదు" అనుకున్నాడు.

ఆగి కష్టంగా షర్టు వేసుకున్నాడు. వీలై నంత నెమ్మదిగా నడవసాగాడు, తెల్లవాళ్ల ఇళ్ల మధ్యగా. 'వేగంగా నడిస్తే దొంగ అను కుని షూట్ చేసినా చేస్తారు.'

హఠాత్తుగా భయంతో ఆగి పోయాడు. ఒక నల్లని ఆకారం నీడలోంచి వెలుగులోకి వొచ్చింది. చేతిలో మెరుస్తున్న తుపాకి.

తెల్లని మొహం వెలుగులోకి వొచ్చింది. పోలీస్!

"చేతులెత్తి నిలబడు నీగ్రో"

"యస్సార్"

"పోలీసు జేబులు తడిమాడు

"ఎవరు నువ్వు? "

"నేను చర్చి ఫాదర్ని సార్"

"ఈ రాత్రివేళ ఏం చేస్తున్నావు? "

"ఒక జబ్బు మనిషిని చూసి ప్రార్థించి వొస్తున్నా సార్- అదుగో ఆ చెట్టుకవతల, మిసెస్ హార్డ్‌గారి నీగ్రో నౌకరు సార్"

పోలీసు ఎగాదిగా చూశాడు.

"మంచివాడిలా వున్నావు. సరే పో, ఎక్కడా తిరక్కుండా పో"

టైలర్ ముందుకు నడిచాడు. కొంతసేప టికి, తన చర్చి కనిపించింది. గాభరా తగ్గింది. చర్చి గేటు తెరుచుకుని మెల్లగా మెట్లెక్కి గదిలోకి వెళ్లాడు. షర్టు తీయబోతే ఒంటికి అతుక్కుని వున్నది. కిచెన్‌లోకి వెళ్లి ఒక తడిగుడ్డ తెచ్చుకుని బోర్లాపడుకుని వీపుపైన కప్పుకున్నాడు. ఒక్కసారిగా భోరున ఏడ్చేశాడు.

★ ★ ★

తలుపు కిర్రుమంది.

"నాన్నా..."

"జిమ్మీ, ఇలారా"

"ఎక్కడకెళ్లావు? అమ్మ చాలా భయప డింది"

"నన్ను కొట్టారు జిమ్మీ"

జిమ్మీ వులిక్కిపడి దగ్గరకు పరిగె త్తుకొచ్చాడు.

"ఎవరు, తెల్లవాళ్లేనా? "

టైలర్ వాచిపోయిన పెదవులు తడి చేసుకుని మాట్లాడడానికి ప్రయత్నించాడు.

"వాళ్లు నన్ను హంటర్‌తో చచ్చేట్టు కొట్టారు"

"అమ్మను పిలుచుకొస్తా"

"ఒద్దొద్దు-"

"ఆ తెల్ల లంజకొడుకులు-" జిమ్మీ ఏడవ సాగాడు. హఠాత్తుగా లేచాడు.' "తుపాకీ తీసుకుపోయి మనవాళ్లని లేపుతా."

"కూర్చో జిమ్మీ పిచ్చిపని చెయ్యకు"

"ఇలా ఎంత కాలం సహించాలి? "

టైలర్ దిండులో తల దూర్చి ఏడవసా గాడు.

"వూరుకో నాన్నా..."

తలుపు చప్పుడయింది. టైలర్ గబు క్కున లేచి కొడుకును పట్టుకున్నాడు.

"నన్నొదులు నాన్నా.. మనం పోరాడక పోతే ఎప్పటికీ మన బతుకింతే."

"కూర్చో జిమ్మీ, నా మాట విను. ఒంటి రిగా మనం ఏం చేయలేం. అదరం కలిసి పోరాడాలి. నాకు తగిలిన దెబ్బలు మనం దరికీ తగిలిన దెబ్బలు"

ఎవరో తలుపు తట్టారు.

జిమ్మీ వెళ్లి తలుపు తెరిచాడు.

తల్లి లోపలకు వచ్చింది.

"ఏం జరిగింది? అంటూ కంగారుగా పరు గెత్తుకుంటూ వచ్చి టైలర్‌ను పట్టుకుంది.

"వాళ్లు నాన్నను చావగొట్టారు!"జిమ్మీ చెప్పాడు.

"నాకు తెలుసు, ఇలా జరుగుతుందని" ఏడవసాగింది. టైలర్ లేవబోతుంటే వారిం చింది. లోపలకి పోయి వేడినీళ్లు తెచ్చి ఒళ్లు తుడిచింది.

"ఎలా వుందిప్పుడు? "

"నయమే"

జిమ్మి వైపు చూశాడు. ఏదో మాట్లాడాల నుకున్నాడు. కాని ఏం మాట్లాడాలో తట్ట

లేదు.

బైట గంట మోగింది. ముగ్గురూ ఒణికి పోయారు.

"తెల్లవాళ్లు గనక అయితే నాన్న యింట్లో లేడని చెప్పు జిమ్మి" అన్నది తల్లి రహస్యంగా. జిమ్మీ తలుపు తెరవడానికి వెళ్లాడు. వెంటనే పరుగెత్తుకు వొచ్చాడు. వెనకే 'బాండ్సు' వచ్చాడు. అతను వస్తూనే కూలబడి ఏడవసాగాడు. తలకు రక్తం మరకతో బాండేజి!

"నన్ను కొట్టారు. నా పెళ్లాం పిల్లల్ని చావబాదారు!"

"ఏం జరిగింది బ్రదర్? "టైలర్ అడిగాడు.

"అందర్నీ చావగొట్టారు. ఇద్దరు కమ్యూనిస్టుల్ని విపరీతంగా కొట్టి జైల్లో పెట్టారు. తెల్లవాళ్లంతా కార్లల్లో తిరుగుతూ కనిపించిన ప్రతి నీగ్రోని చావగొట్టేస్తున్నారు"

బైట మళ్లా గంట మోగింది.

"బ్రదర్ బాండ్సు, జిమ్మీ! మీఇద్దరూ క్రిందికి రండి." అంటూ టైలర్ క్రిందకి వెళ్ళాడు.

చర్చి హాలు పూర్తిగా నిండిపోయింది. నీగ్రోలు మగాళ్లూ, ఆడవాళ్లూ ఒంటినిండా గాయాలతో, కట్లతో నిశ్చలంగా వున్నారు.

"మీరు చేసిన పని చూడండి" అరిచాడు ఫాదర్ స్మిత్.

టైలర్ అందరి మొహాలూ చూశాడు.

"నాన్నా.. తెల్లవారుతోంది. ప్లేగ్రౌండులో జనం చేరుతున్నారు నీ కోసం"జిమ్మీ అన్నాడు.

టైలర్ బయటికి నడిచాడు. అతని వెనకే అందరూ, సూర్యుడు మెరిసిపోతున్నాడు. పగటి వెలుగు చీకటిని హరించింది. పురుషులు, స్త్రీలు చుట్టుముట్టారు.

'రెవరెండ్.. చూశారుగా ఏం జరిగిందో? వూరేగింపు సంగతేమిటి? " అని అడిగింది ఒక స్థూలకాయురాలు,

"నువ్వేమంటావ్? "

"ఇంత జరిగాక ఇంక ఆగటమెందుకు? "



"వాళ్లు ఇంతకంటే ఇంకేం చెయ్యగలరు? "

"ఏదో ఒకరోజు అందరూ చావవలసిన వాళ్ళే"

"పార్కులో తెల్లవాళ్లు మనలాంటి పేద వాళ్లు మన కోసం ఎదురుచూస్తున్నారు"

టైలర్ జిమ్మీని పిలిచాడు.

"వెళ్ళి అందరినీ పిలుచుకురా నేను చెప్పానని" భార్య టైలర్‌ని ఆపబోయింది. విదిలించుకున్నాడు. ఫాదర్ స్మిత్ ముందుకు వచ్చాడు.

"ఈ వూరేగింపు మీరు గనక నడిపిస్తే

ఈ చర్చిలో ఇంక ఎన్నటికీ మీరు అడుగు పెట్టలేరు" అని అరిచాడు.

గుంపులో కేకలు బైలుదేరాయి.

"మమ్మల్ని ఎవరూ నడపడం లేదు"

"ఈ వూరేగింపు మాది- రెవరెండ్! మీరు మాతో రారా?"

"అందరూ వస్తే..." అన్నాడు టైలర్.

"ఈ జనానికి ఏదైనా జరిగితే అందుకు మీరే బాధ్యులు" అన్నాడు స్మిత్.

"నోరు ముయ్, ముందు రెవరెండును మాట్లాడనియ్యి" స్థూలకాయం అరిచి, ఫాదర్ స్మిత్‌ను లాగి లెంపకాయ కొట్టింది. టైలర్ ఇద్దర్నీ విడదీశాడు.

ఒక చెక్కబల్లను లాక్కొచ్చారు. టైలర్ పైకి ఎక్కాడు.

"బ్రదర్స్, సిస్టర్స్! నిన్నటివరకూ ఏంచేయాలో నాకే అర్థంకాలేదు. కాని రాత్రి తెల్లవాళ్లు నన్ను అడవిలోకి తీసుకుపోయారు. మీరు ఆకలితో అలమటించిపోతున్నారనే విషయం వాళ్లతో చెప్పినందుకే వాళ్లీ పనిచేశారు. వూరేగింపు ఆపమన్నారు. నేను ఒప్పుకోనందువల్ల నన్ను తీవ్రంగా కొట్టి గాయపరచారు. బ్రదర్స్, సిస్టర్స్! తెల్లవాళ్లు చెప్పినట్లు చెయ్యమని మొదట్లో నేను మీకు సలహా యిచ్చాను. తప్పని తెలుసుకున్నాను. మీ జీవితం నాకు తెలుసు. అది మంట. ఆ మంటను రాత్రి నేనూ అనుభవించాను. ఆ మంటలు ఒంటరిగా భరించలేం. కలిసికట్టుగానే భరించాలి. భగవంతుని వుద్దేశం కూడా అదే..."

"పదండి ముందుకు"

"అంతా పదండి"

"మనకోసం తెల్లవాళ్ల బీదజనం కూడా ఎదురుచూస్తున్నారు"

అందరూ నినాదాలు చేసుకుంటూ, పాటలు పాడుకుంటూ వూరేగింపుగా నడవసాగారు. దారిలో ఇంకా ఇంకా జనం వచ్చి కలుస్తున్నారు. ఆ జనసందోహంలో నల్లవాళ్లూ, తెల్లవాళ్లూ కలిసిపోయారు. పార్కులో పేదజనం- తెల్లవాళ్లు- ఆశతో ఎదురుచూస్తున్నారు. వాళ్లను చూడగానే టైలర్ ఒళ్లు పులకరించింది.

పాటలు దిక్కులు ప్రతిధ్వనిస్తున్నాయి.

"భగభగమండే చింత నిప్పులూ..."

పట్టణంలోనికి దారితీసింది వూరేగింపు...

"కారుమేఘం కమ్ముకు రాగా..."

ఎదురుగా పోలీసులు గోడలాగా నిలబడ్డారు.

"వాళ్లు మనల్నేం చెయ్యలేరు" అనుకున్నాడు టైలర్.

'ఇదే మన మహాప్రస్థానం-' పాట కొనసాగుతోంది. పోలీసులు కదలకుండా అలాగే నిలబడివున్నారు. ఒక పోలీసు టైలర్ దగ్గరకు వచ్చాడు.

"నువ్వేనా టైలర్?"

"అవును..."

"మేయర్ నిన్ను కలుసుకోవాలనుకుంటున్నారు"

"ఇక్కడకొచ్చి కలుసుకోవచ్చు"

పోలీసు ఆశ్చర్యంతో నోరు తెరిచాడు. గుంపు మేయరుకు దారి ఇచ్చారు.

"డాన్, మీ జనాలను వెనక్కి పొమ్మని చెప్పు ఏవిధమైన గొడవా నేను సహించను"

"ఏ గొడవా వుండదు సార్"

"కాదు, వాళ్లను ప్రశాంతంగా వెనక్కు పొమ్మని చెప్పు"

"ఆ విషయం, మీరే చెప్పవచ్చు"

ఇద్దరూ ఒక్కక్షణం ఒకరిమొహం మరొకరు చూసుకున్నారు. మేయర్ వెనక్కి తిరిగి వెళ్లిపోయాడు. కారు ఎక్కేశాడు.

టైలర్‌లో ఆనందం కట్టలు తెంచుకుంది. కనుచూపుమేరా నల్లని, తెల్లని జనసముద్రం, పాటతో దిక్కులు మారుమోగిపోతున్నాయి.

"మనకు వున్న దారి యిదే, గమ్యస్థానానికి చేర్చేదారి యిదే" టైలర్ కళ్లలో నీళ్లు నిండాయి. V




# మూడో కూతురు

## అనువాదం : అచ్యుతుని రాజ్యశ్రీ

**బా**బా అవతార్ పండిత్ దుస్తుల్ని ఉతుకుతున్నాడు సుఖూ. వాటిని బండ కేసి బాదుతుంటే, అతనిలో ఓ విచిత్ర ఆనందం! అప్పటిదాకా లోపల దాగిన భావాలన్నీ ఒక్కసారిగా ఉవ్వెత్తున ఎగసి నట్లు అనిపిస్తోంది. ఆ వస్త్రాల్ని ఉతికే స్తుంటే, రెండుకాళ్లూ పట్టుకుని పండిత్‌ని బండకేసి బాదుతున్నంత తీవ్ర అనుభూతి! సరిగ్గా అప్పుడే ఆ దుస్తుల్లోంచి వింత శబ్దాలు వస్తున్నట్లు .. వినిపిస్తోందతనికి. 'ఇవి పండిత్‌వేనా? ఈ బట్టల్ని చూసేనా ఆయనకి అంత వెర్రి ఆనందం? అసలీ బట్టలెంతో తెల్లగా ఉంటాయని ఆయన గారి సంబరం! ఎంత వింత మనిషి? '.. ఆలోచిస్తూనే ఉన్నాడు సుఖూ

'ఇక లాభంలేదు. పండిత్ వీపు విమానంమోత మోగించాలి. ఒక్కో దెబ్బకీ ఒక్కో ఎముక విరిగిపోవాలంతే! అలా ఇలా కాదు, ఆయన్ని చితకబాదాలి, మీసాలు పీకేయాలి'.. సుఖూ ఆలోచనలు సాగిపోతూనే ఉన్నాయి. పండిత్‌వన్నీ బడాయి మాటలే, చేసేవన్నీ లడాయి పనులే. అసలే ఆయనది తెలుకొండి మీసం, బానలాంటి పొట్ట, గవ్వల్లాంటి దెయ్యం కళ్లు! చిన్నసైజు రాక్షసుడి అవతారం!!

పండిత్ మాటలూ అలాగే ఉంటాయి.. 'ఏరా సుఖూ! ఎలా ఉందిరా నీ కూతురు? '

ఏమీ మాట్లాడలేకపోతాడు సుఖూ.

"నీ ఖర్మ! చచ్చేదాకా అనుభవించి చావరా!" అంటాడు పండిత్.

అయినా సుఖూ నోరెత్తడు. కళ్లవెంట నీళ్లుకారుతుంటే, ఏదో బాధ గుండెని మెలిపెడుతుంటే చూస్తూ ఉండిపోతాడు. పండిత్ అంటే వాడికి అంతులేని కసి, అసహ్యం. ఊళ్లోని రావిచెట్టు దగ్గరికి ప్రతి మంగళవారం వస్తాడు. 'ఆ పండిత్‌గాడి గుండెంతా చిల్లులు పడిపోవాలి' అంటూ చెట్టు మొదళ్లలో నీళ్లు చల్లి శాపనార్థాలు పెడుతూ వెళ్లిపోతాడు.

పండిత్ మాత్రం రోజురోజుకీ బల వంతుడైపోతున్నాడు. సుఖూ నానాటికీ నిస్సహాయంగా మారి కుంగి కృశించిపోతు న్నాడు. 'నాలాంటి నిరుపేదకి మంచి రోజులు ఎప్పుడొస్తాయి దేవుడా? ఆ పండిత్ పని ఎప్పుడు పడ్తావ్ దేవుడా? ' అనుకుంటున్నాడు. పని చేసీ చేసీ ఒళ్లంతా పచ్చి పుండులా మారిందతనికి. మనసు దుఃఖంతో మూలుగుతోంది పండిత్ మాటలకి!

ఆ రోజు సుఖూకి బాగా గుర్తుంది. పండిత్ తనింట్లో దూరి తన కూతుర్ని బలాత్కరించాడు. తనెంతో కాళ్లావేళ్లాపడి బతిమాలాడు. కానీ పండిత్ తననే తిట్టిపోశాడు. అప్పుడే ఇస్త్రీపెట్టెతో వాడి తలని తనెందుకు బద్దలుకొట్టలేదు? అసలప్పుడు తన బుద్ధి ఏమైంది? అను కుంటూ జుట్టు పీక్కోసాగాడు సుఖూ.

కూతురు సురతి జ్ఞాపకాలు సుఖూని బాధించసాగాయి. తన బట్టలన్నీ ఉతికేది, అంతేకాదు.. ఇంటికి రాగానే రకరకాల వంటకాలు కమ్మగా వడ్డించేదా చిట్టితల్లి! చనిపోయిన కూతురితో పాటు గతించిన తన భార్య, పెద్దకూతుర్ని కూడా తల్చుకుంటున్నాడతను. తనకున్న ఒకే ఒక ఆధారం సురతి. పుట్టగానే తల్లిని పోగొట్టు కున్న ఆ పాపని కంటిపాపలా పెంచాడు తను. ఊరివారంతా ఆమెను 'సురతీ' అని పిలిస్తే, తాను మాత్రం 'రెండో కూతురా!' అని సంబోధించేవాడు. 'నాన్నా! నన్నెందు కలా పిలుస్తావు? ' అని ఆమె అడిగితే, 'అవునమ్మా! నా పెద్దబిడ్డ పదేళ్లుగా గాఢని ద్రలో ఉంది. అదింక లేవదు' అనేవాడు గుండె బరువెక్కిన హృదయంతో.

సురతి పెళ్లికూడా చేశాడు సుఖూ. ఆమె కిద్దరు పిల్లలు కూడా. ఓ మనవరాలు అచ్చు తన చనిపోయిన పెద్దకూతురి రూపురేఖల్లోనే ఉండేది. 'నాన్నా! అయితే దీన్ని 'అక్కా' అని పిలిచేదా? ' అని

నవ్వుతూ అడిగేది సురతి.

కాస్తోకూస్తో డబ్బు పోగైనప్పుడల్లా, సురతి చేతిలో భద్రంగా పెట్టేవాడా తండ్రి.

ఓ రోజు పండిత్ అన్నాడు "ఒరేయ్ సుఖూ! నీ కూతుర్ని నా దగ్గరికి వచ్చి బట్టలు తీసుకెళ్లమని చెప్పు"

"ఇంట్లోంచి కాలు బైట పెట్టదు బాబయ్యా అది"

"ఓహోహో.. అంత గొప్పవాడివా నువ్వు? ఇంట్లోంచి కాలు బైట పెట్ట కుండా.. చక్రం తిప్పుతోందా నీ కూతురు? అందుకే దేశమంతా ఇలా తగలడుతోం దిరా. సరే, అది రాకపోతే, నేనే వస్తా మీ ఇంటికి!"

పండిత్ మాటలు ఊరంతా గగ్గోలు పుట్టించాయి. ఉడుకురక్తపు యువకులు కొందరికి అతడి మాటలు మింగుడుపడ లేదు. కొంతమంది ముసలాళ్లు కూడా 'ఏదో యుద్ధానికి ఆరంభంలా ఉందేమిటీ' అని భయపడసాగారు.

పండిత్‌కి వ్యతిరేకంగా ఏదన్నా జరిగితే, తర్వాత పరిస్థితేమిటో సుఖూకి బాగా తెలుసు. ఆ పండిత్‌ని తనేమీ చేయలేడు, కాకపోతే, కసిగా అతగాడి బట్టల్ని ఉతికి పారేయగలడు! సుఖూ బుర్రంతా గందర గోళంగా తయారైంది. 'వాడ్ని.. ఆ ముసలి గుంటనక్కగాడిని ఎలాగైనా చిత కబాదాలి. తలుచుకుంటే అదేమంత కష్టంకాదు. కానీ లాభమేమిటీ? నాచేత బట్టలుతికించుకుంటూ వాడు నన్నే అవ మానిస్తాడా? అసహ్యించుకుంటాడా? నా కూతుర్ని హింసించినవాడు ఇంక ఈ భూమ్మీద ఉంటాడా? ' అనుకున్నాడు.

చెరువువైపు వెళ్దామనుకున్నాడు కానీ మనసు మార్చుకుని వర్మాజీ తోటవైపు నడిచాడతను. పండిత్ మాటలకి ఆ గుండె పచ్చిపుండులా మారింది. ఓ చోట కూలబడి ఏడవసాగాడు. 'తల్లీ! నీవింక ఎప్పటికీ తిరిగిరావు కదూ? ఇంక రాకమ్మా. వాడు, ఆ పండిత్‌గాడి అత్యాచా రాలు ఇంకా మితిమీరిపోతున్నాయి. అప్పుడు ఊరి పంచాయితీలో వాడికి సై అన్నవారే ఇప్పుడు దుయ్యబడుతున్నారు. ఇదే నాకు కాస్తంత ఊరట' అనుకుంటున్న సుఖూకి దేవుడు గుర్తుకొచ్చాడు. 'దేవుడా! పండిత్ లాంటి వాడిని ఎందుకు సృష్టించావ్? అదే చేత్తో మావంటి అల్ప ప్రాణుల్ని కూడా ఎందుకు సృష్టించావ్? ' అనుకుంటుంటే..

సరిగ్గా అప్పుడే చెరుకు తోటలోంచి ఆర్త నాదం! భయకంపితుడైన సుఖూ అటు వైపే అడుగులేయసాగాడు. ఇంతలో ఏదో కర్కశ కంఠం! 'అరె.. అది పండిత్‌దిలా ఉందే!' అనిపించి, మరేదో సందేహమూ పీడించటంతో, ఆ తోటలోకి పరుగున వెళ్లా డతను.

అక్కడ పరమేశర్ మిసిర్ కూతురు! "బాబా! మీకు మనవరాలు లాంటిదాన్ని? కాళ్లుపట్టుకుంటా, నన్ను వదలండి. ఆగం డాగండి.. ఏం చేస్తున్నారు నన్ను? " అనడం వినిపించి, అటువైపు వెళ్లాడు సుఖూ. "ఒరే నువ్వట్రా పండిత్! ఆగరా గాడిదా! ఆమె నా మూడో బిడ్డ! చెయ్యే శావో జాగ్రత్త!" అంటూ ముందుకు దూకాడు.

"ఎవడి కూతుర్ని నీ బిడ్డ అని చెప్తున్నా వురా? " అంటుండగానే, పండిత్‌ని ఒక్క తోపు తోశాడు సుఖూ. "ఏరా! లోకంలో ఆడపిల్లలంతా నీ సొంతం అనుకుంటు న్నావా? ఒరే.. రాక్షసుడా! ముసలి నక్కా! వీళ్లంతా మా బిడ్డలురా!" అంటూనే పండిత్ ఛాతీమీద ఎక్కి కూర్చుని అత గాడి పనిపట్టసాగాడు. "ఇక్కడే ఈ తోటలోనే నీ అంతం చూస్తానురా" అని విజృంభిస్తుంటే, మరో వంక ఆ పిల్ల అక్కడ చెల్లాచెదరై పడిఉన్న తన దుస్తుల్ని గబగబా ఒంటికి చుట్టుకోసాగింది. V

తెలుగు కథ

-పి.వి.ప్రసాద్



# ఓం శాంతి

శ్రీ వేంకటేశం.. శ్రీ శ్రీనివాసం
శ్రీ వేంకటేశం.. శిరసా నమామి"

"ఏంటీ.. అప్పుడే తెల్లారిందా? "

"అప్పుడే.. కాదు, ఎప్పుడో తెల్లారింది. చెట్ల కొమ్మల్లో పక్షులన్నీ అర్ధగంట నుండీ కిలకిలమంటున్నాయి. ఆ గుడి పూజారే.. ఇవ్వాళ ఆలస్యంగా వచ్చి, ఇప్పుడు పెట్టారా పాట!"

"నువ్వు లేచి ఎంతసేపయ్యింది? "

"నేనెప్పుడో లేచా. నేను లేచిన తర్వాతే కోడి కూసింది"

"నన్ను కూడా లేపి ఉండాల్సింది"

"లేపుదామనే అనుకున్నా. కానీ నువ్వేమో హాయిగా నిద్రపోతూ వున్నావు. నువ్వు నిద్రపోతూంటే నీ మొహం ఎంత ప్రశాంతంగా, అందంగా వుందో తెలుసా? నిన్నలా చూస్తుంటే లేప బుద్ధికాలేదు. నీ ముఖాన్నే చూస్తూ అప్పటినుండీ నేను పరవశించిపోతున్నా"

"పోరా వెధవా! నన్ను కూడా లేపివుంటే ఇద్దరం ఎంచక్కా హాయిగా కబుర్లు చెప్పుకుంటూ గడిపేవాళ్లం కదా. ఛ! ఎందుకింత మొద్దు నిద్రపోయాను? నిన్న చాలా దూరం వెళ్లొచ్చాం కదా.. అందుకే బాగా అలసిపోయినట్లున్నాను. పోనీలే.. ఇప్పుడేమయ్యిందని? ఇప్పుడు హాయిగా కబుర్లాడుకుందాం"

"ఆ.. ఇప్పుడు కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటే ఇక అంతే. అదిగో చూడు, ఆకాశం ఎర్రగా అవుతోంది. సూర్యుడు పైకొచ్చేస్తున్నట్టున్నాడు. లంకమల వైపు వెళ్దామని రాత్రి నువ్వు చెప్పలేదూ? "

"ఈ రోజు ఎక్కడికీ వద్దులే. ఆకాశంలో అక్కడక్కడా మబ్బులున్నాయి. ఒకవేళ వర్షం వస్తే చాలా ఇబ్బందవుతుంది"

"అంతేనంటావా? "

"అంతే"

"అయితే ఇప్పుడేం చేద్దామంటావ్? "

"ఏం చేద్దాం? కబుర్లు చెప్పుకుందామంతే. ఇంతకూ నిన్న నీకెలా అన్పించింది? "

"ఎలా అంటావేమిటి? బ్రహ్మాండం. చల్లని పిల్లగాలులు, ఆ పిల్లగాలుల పాటలకు తలలూపుతూ నాట్యం చేసే పచ్చని



చేలు, కొండలు, కోనలు, కొండదారులు, వంపులు, జలపాతాలు, లే చివుళ్లు, చివు రాకులలో చిలకమ్మలు, పాలపిట్టల కువ కువలు.. అబ్బ.. చెప్పలేననుకో"

"నల్లకొండల్లో పుట్టే శివకోన భలేగుంది కదూ? "

"భలే అంటావేమిటి? మాటల్లో చెప్ప లేను. మేఘాలు కప్పేసిన శిఖరాలు మాత్రమే కన్పించే కొండలవి. అలాగే వెళ్లి మేఘాలపై వాలాలని అన్పించిందనుకో"

"నీకలా అన్పిస్తే నాకేమన్పించిందో తెలుసా? అడవి మధ్యలోని గంగమ్మ మడుగులో విచ్చుకున్న ఎర్ర తామరలు మండుటెండలో కెంపుల్లా మెరి సిపోతుంటే.. ఆ అన్నింటినీ కోసుకొచ్చి నీకు ప్రేమకానుకగా ఇవ్వాలన్పించింది"

"కోసుకు రాలేదేం? "

"నిన్ను వదిలి వెళ్లలేకపోయానే"

"ఉండు, ముద్దుపెడతా. నా బంగారు కొండ.. మ్చ్"

"నేను కూడా పెట్టుకుంటానుండు.. నా చిన్నారి బుజ్జిముండ! మ్చ.. మ్చ.."

"నువ్వు చాలా అతి వెధవ్విరా. సందిస్తే చాలు, ఏమేమో చేసేస్తావ్"

"నువ్వు మాత్రం.. ఏదేదో చేసేస్తే బావుంటుందనుకోవూ? "

"అది సరేకానీ, నిన్న సాయంకాలం నీకు చూపించా చూడు.. పడమటి కొండలపై ఎర్రగా నిలచి.. నారింజపండు.."

"అబ్బా.. గుర్తుచేయకు. మనసంతా ఏదోలా అయిపోతోంది. సూరీడు నారింజ పండులా అయిపోతే, నాకు నిజంగా కొరుక్కు తినేయాలని అన్పించిందనుకో. కళ్ళు మూసి తెరిచేలోగా నారింజపండు మాయమైపోయి ఆకాశంలో నెలవంక నిలిస్తే.. ఆ దృశ్యం చూసి ఆనందంతో ఇష్టమొచ్చినట్లు నాట్యం చేయలేదూ? "

"నువ్వు భలేగా నాట్యమాడతావురా"

"నువ్వు మాత్రం కులికేది తక్కువా? "

"అయ్యో.. ఒక్కో చినుకే రాలుతోందే.. కాస్త చలిగా కూడా అన్పిస్తోంది. ఇప్పుడేం చేద్దాం? "

"ఏం చేద్దామేమిటి? వానదేవుడికో నమ స్కారం పెట్టి, ఒకరినొకరు గట్టిగా వాటేసుకుని కప్పుకుందాం"

"అ..బ్బ.. ఎంత వెచ్చగా వుందో"

★ ★ ★

"హలో! రెడ్డినాయుడు గారేనా? నేను మినిస్టర్ పి.ఏ. రావుని మాట్లాడుతున్నా. మీ ఊళ్లో మినిస్టర్ ప్రోగ్రాం కన్ఫర్మ్ అయింది, ఎల్లుండి.. అంటే శుక్రవారం ఉదయం సరిగ్గా తొమ్మిది గంటలకు. ప్రోగ్రాంకు ఏమేం కావాలో ఉదయమే చెప్పాను కదా. అన్నీ జాగ్రత్తగా చూసు కోండి. ఏదీ మిస్సవకూడదు. అర్థం అయిందా? "

"సర్! అన్నీ ఒకే. కానీ మీరు చెప్పారే.. అదొక్కటి మాత్రం.. దొరికేది కష్టమేనే? "

"అలాగంటే కుదరదు రెడ్డినాయుడూ! మినిస్టర్‌గారికి ఏది లేకపోయినా ఫర్వాలేదు కానీ.. నేను చెప్పానే... అదుండాలి. అదీ తెల్లగా వుండాలి. లేకపోతే ఇక మన పని అంతే. గుర్తుంది కదా.. ఎల్లుండి ఉదయం సరిగ్గా తొమ్మిది గంటలకు. అది గనక మినిస్టర్ దగ్గర లేకపోతే మనమంతా మటాష్. గుర్తుపెట్టుకో"

"ఒకవేళ దొరక్కపోతే.."

"రెడ్డినాయుడూ! మీ ఊళ్ళో దొరక్కపోతే ఇంకెక్కడ నుండైనా తెప్పించండయ్యా. స్టేట్ మొత్తం జరిగే పండగ. మినిస్టర్‌ను ఒప్పించి మరీ మీ ఊళ్ళో ప్రోగ్రాం ఫిక్స్ చేశా. నీకు వీలుగాకుంటే చెప్పు. మీ పక్క మండలంలో ప్రోగాం ఫిక్స్ చేసేస్తా! మండల ప్రెసిడెంటువి అయుండీ.. మిని స్టర్ కోరిక తీర్చేందుకు ఓ.. చిన్నదాన్ని పట్టుకురాకపోతే.. ఏం కెపాసిటీ నాయుడూ నీది? ఏమైనా అంటే.. నేనొక పెద్ద నాయకుడంటావు. ఇంతకూ నీవల్ల

అవుతుందా కాదా? ”

“సరెలెండి సార్! మీరలా కోప్పడితే ఎలా? నా తంటాలు నేను పడతాను. రంగు తెల్లగానే వుండాలా? లేక..”

“ఖచ్చితంగా తెల్లగానే వుండాలి. సరే.. నేనిక ఉంటా”

★ ★ ★

“రేయ్ చంటిగా! అప్పుడే నే చెప్పా చూడు.. మినిస్టర్ ప్రోగ్రాంకు కావాలని. దాని గురించి ఏం చేశావ్? ”

“అన్నా! ఊరంతా వెదికా. ఎక్కడా దొరికే అవకాశం కనపడలే”

“రేయ్! మనూళ్ళో దొరక్కపోతే.. పక్కూళ్ళో.. ఎక్కడో వెదకి పట్టుకు రండ్రా నాయనా! మినిస్టర్‌కు అది ఉంటేనే అట. అదీ.. తెల్లగానే వుండాలట”

“అయినా.. ఇదేంటన్నా? .. ఇలాంటివి ఇప్పటికిప్పుడు అంటే ఎలా కుదురుతుంది? ”

“మనమలా చెప్పలేం కదరా. ఎక్కడో ఒకచోట తీసుకు రండ్రా. మినిస్టర్ ప్రోగ్రాం క్యాన్సిల్ అయితే మన ఇజ్జత్ పోతుంది. ఆ మూలోల్ల గంగానికి చెప్పు. ఆ.. కొడుకైతే.. ఎలాగో పట్టుకొచ్చేస్తాడు”

“అవునన్నా. వాడైతేనే ఈ పని చేయగలడు. నువ్వింకేం భయపడొద్దు. నేనన్నీ చూసుకుంటా”

★ ★ ★

“అబ్బ! నీకు సందు దొరికితే చాలు. తినేది కూడా మానేసి, నన్ను విడిచిపెట్టకుండా పట్టుకుని ఉండిపోతావు కదూ? ”

“ఏం చేయను. నువ్వు మంచు ముద్దలా, తెల్లగా, అంత అందంగా వుంటావు మరి. ఆ ముక్కు, ఆ కళ్ళు.. నిజంగా నాకు పిచ్చెక్కిపోతోంది”

“పొగుడుతూనే నన్నేదేదో చేసేస్తావ్”

“నువ్వంటే నాకు అంత ఇష్టం మరి. నీకు కష్టంగా ఉంటే చెప్పు, . మరో దాని దగ్గరికి పోతా”

“ఏయ్! మరో దానివైపు కన్నెత్తి చూస్తే.. నిన్ను చంపి నేనూ ఛస్తా”

“అంత మాటనకే. తమాషాగా అన్నాలే. నిన్ను వదలి నేనెక్కడికి పోగలను? ”

“నాకు తెలుసు.. నేనంటే నీకెంత ప్రేమో! అది సరే, ఇలా మాటలతో గడిపేయడమేనా లేక ఏమైనా తినేదంటూ ఉందా? నాకు ఆకలవుతోంది బాబూ”

“వాన చినుకులు పూర్తిగా తగ్గనీ. వెళ్ళి ఏదో ఒకటి తిని, అలాగే శివాలయం వద్ద సాయంకాలం దాకా గడిపొద్దాం. ఒక్క క్షణం ఉండు.. ష్! మాట్లాడకు, ఏదో అలికిడవుతోంది”

“అవునే.. ఏదో శబ్దం వస్తోంది.. విస విసా.. ఆ..”

“ఎవరో వచ్చారు. ఏయ్! నువ్వు పరిగెత్తు, నేను కూడా పరిగెత్తుతున్నా”

“అయ్యో! నువ్వేమో పరిగెత్తి వెళ్ళిపోయావ్. వీడెవడో నన్ను పట్టుకునేశాడే.. ఇప్పుడెలా? ”

“నేను కూడా నీ దగ్గరికి వచ్చేస్తా”

“వద్దు, రావద్దు. నిన్ను కూడా పట్టుకుంటారు. దూరంగా ఎవరికీ దొరక్కుండా వెళ్ళిపో”

“నన్ను నేను ఎలాగైనా రక్షించుకుంటాను. రేయ్! అది నా ప్రాణంరా. దాన్ని వదల్రా. అది లేకుండా నేను బతకలేనురా. ఒరేయ్! నేనింతలా అరచి గీపెడుతున్నా విన్పించదేంరా. ఒరే! నువ్వు నాశనమైపోతావురా”

“ఇక్కడికి నువ్వు రావద్దు. పారిపో. నువ్వయినా సుఖంగా వుండు”

“నువ్వు లేకుండా నేనెలా సుఖంగా బతికేది! నేనిప్పుడే చచ్చిపోతా”

“అంత పని చెయ్యొద్దు. నామీద ఒట్టే. ఒరేయ్! ఉండండ్రా. ఇద్దరం ఒక్కసారైనా తనివితీరా కడసారిగా చూసుకుంటాం. భగవంతుడా! ఒరే.. మీ బతుకులు చెడ. మా ఇద్దర్నీ విడదీశారు కదరా..”

★ ★ ★

"ప్రజలారా! అందరికీ నమస్కారం. ఈ రోజు.. నిజంగా అందరికీ పండ గ రోజు. ఎందుకంటే.. మన ఊరికి ఇంతవరకూ ఏ మంత్రీ రాలేదు. ఈ రోజు మనల్ని మన్నించి మన ఊరికి మంత్రి సోమిరెడ్డి గారు రావడం.. నిజంగా మనం ఎన్ని జన్మలనుండో చేసుకున్న పుణ్యం. మంత్రిగారిని మన ఊరికి వచ్చేలా ఆహ్వానించిన మన మండల ప్రెసిడెంట్ రెడ్డినాయుడు గారికి మనం ఏమిచ్చినా రుణం తీరదు. ఇప్పుడు మన మంత్రిగారు మాట్లాడతారు"

"ప్రజలందరికీ నమస్కారం! మిమ్మల్నందర్నీ ఇక్కడ ఇలా చూడడం నిజంగా నా అదృష్టం. నేను మీకు ఏమేమో చేయాలనుకున్నాను. కానీ నేను చేయాలనుకున్నవన్నీ మన ముఖ్యమంత్రి చేసేవారు. నిజంగా ఆయన మన ముఖ్యమంత్రి కావడం మన రాష్ట్ర ప్రజలు ఎన్నో జన్మలుగా చేసుకున్న పుణ్యం. ముఖ్యంగా నేను చెప్పేదేమిటంటే.. ఈ రోజు చాలా సుదినం. హిందువులకు దీపావళి, ఉగాది, సంక్రాంతి; ముస్లింలకు రంజాన్, క్రైస్తవులకు క్రిస్మస్.. అందరికీ అన్నీ.. ఇవాళే! ఈ రోజు మన ముఖ్యమంత్రిగారి జన్మదినం. ఆయన కారణజన్ముడు. అందుకే ఇవాళ ఎలాంటి భేద భావాలూ లేకుండా రాష్ట్రమంతటా ఆయన జన్మదిన వేడుకలు జరుపుకొంటున్నాం. ఈ విషయం మనందరికీ తెలిసినా కూడా దీని గురించి మన కవి శ్రీ సత్యనారాయణ శాస్త్రిగారు మీకు ఇంకా బాగా వివరిస్తారు. మీకు నాతో ఏ పని వున్నా.. అర్థరాత్రయినా సరే, నా దగ్గరికి నిర్భయంగా రండి. ఆ.. శాస్త్రీ! ఇక నువ్వు చెప్పేదేదో చెప్పు"

"ఈ కలియుగంలో/ ఆకలి కాలంలో

జగతి ఆకలి తీర్చడానికి/ జన్మమెత్తిన తిండి గింజవు నువ్వు!/

జననేతా! జగజ్జేతా!/జన్మదిన శుభాకాంక్ష నీకు/

నీటి బొట్టు దొరకని/ కన్నీటి బొట్టయినా రాని

దుఃఖజీవుల దోసిలిలో/ జలపాతానివి నువ్వు/

జననేతా! జగజ్జేతా!/ జన్మదిన శుభాకాంక్ష నీకు"

"మా ఊళ్ళో పదిహేను రోజులకు ఒక్కసారైనా మంచినీళ్ళు వదలడం లేదు. మాకు తాగడానికి మంచి నీళ్ళు కావాలి"

"య్యోవ్.. ఎం.పీ.పీ! ఏమిటీ గొడవ? రాక రాక నేను మీ ఊరొస్తే .. నాముందు.. మినిస్టరు ముందు.. ఆడాళ్లందరూ ఖాళీ బిందెలతో ఇలా గలాటా చేస్తున్నారేమిటి? "

"మీరేమి కంగారుపడకండి, నేను చూసుకుంటా. రేయ్ ఎర్రయ్యా! పోలీసులకి చెప్పి ఆ ఆడోళ్ళందరినీ బయటకి ఈడ్చి పారేయ్! ఇదిగో శాస్త్రీ! ఇక చదివింది చాల్లే. మిగిలిన కార్యక్రమం పూర్తి చేసేద్దాం. రేయ్ చంటిగా! దాన్నెక్కడ ఉంచార్రా? ఇలా తీసుకురండి"

"ఇదిగో"

"మినిస్టర్‌గారూ! ఇదిగోండి సార్. జాగ్రత్త. గట్టిగా పట్టుకోండి"

"ఇక కానిద్దామా? "

"సార్! ఒక్క క్షణం సార్"

"మళ్ళీ మధ్యలో నీ గొడవేందయ్యా శాస్త్రీ!"

"ఒక్క క్షణం సార్..

జననేతా! జగజ్జేతా!/ జగజ్జేతా! జననేతా!/

నువ్వు నడచిన దారులు/ అఖండ శాంతి వనాలు/

నీ ఊపిరుల్లో నిండిన/ పిల్లగాలులు అహింసా సముద్రాలు/

ప్రజలారా! అందరూ లేవండి. మన ముఖ్యమంత్రిగారు ఇంకా వెయ్యేళ్ళు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్థిల్లాలని మనసారా

కోరుకోండి.

జననేతా!జగజ్జేతా!/ జగజ్జేతా! జననేతా!/

అలుపెరుగని నీ కృషితో/ ఆకలిదప్పుల నుండి/

మా కృషీవలుడు స్వేచ్ఛ అయినాడు/ కార్మికుడూ స్వేచ్ఛ అయినాడు/

వాడు వీడననేల../ బతికున్న ప్రతివాడూ/

స్వేచ్ఛా జీవి అయినాడు"/

"ప్రజలారా! ఇప్పుడు మన మంత్రిగారి చేతిలో ఉంది ఏమిటో తెలుసా? "

"తాగడానికి నీళ్ళు లేక ఛస్తున్నాం. మంత్రిగారిని అడగడానికి వస్తే, ఆడవాళ్ళ మని కూడా చూడకుండా పోలీసులతో కొట్టి స్తారా? మా నెత్తురు కళ్లచూశారు కదరా"

"ష్.. అరవకండి! మన మంత్రిగారి తిలో ఉంది ఏమిటో తెలుసా?.. శాంతి చిహ్నం. మన ముఖ్యమంత్రిగారు ఐదేళ్ళుగా కృషిచేసిన ఫలితం. ప్రజలంద రినీ స్వేచ్ఛా జీవులుగా చేసి, మన రాష్ట్రంలో నెలకొల్పిన శాంతికి చిహ్నం. ప్రజలారా! ముఖ్యమంత్రి వర్ధిల్లాలంటూ దిక్కులు పిక్కటిల్లేలా అరవండి. సార్.. మినిస్టర్‌గారూ! మీరిక దానిని గాలిలోకి విడవండి.. ఆహా! శాంతికపోతం ఎగరబోతోంది. అయ్యో! గాలిలోకి ఎగుర కుండా కింద పడిపోయిందేమిటి? "

"రేయ్! ఇలాంటి పావురాన్ని తెచ్చారేం దిరా? ఇదేంట్రా.. గాల్లోకి ఎగురకుండా కిందపడి కొట్టుకుంటోందేమిట్రా"

"అన్నా! తెచ్చినరోజు బాగానే వుంది. కానీ.. పట్టుకొచ్చినప్పటి నుండి తినకుండా వుండిపోయింది. మళ్ళీ దీన్ని ఎత్తుకొస్తా. ఈసారి గాల్లోకి గట్టిగా విసరండి"

"వద్దులే.. పదండి, నాకు టైం అవు తోంది"

"సార్! పావురం.."

"ఎక్కడన్నా చావనీ. రేయ్.. డ్రైవర్! పోనీ కారుని"

ఉంయ్య్యో.. ఉంయ్య్యో.. ఉంయ్య్సో..

మణిపురి కథ

-ప్రియోకుమార్ కైశామ్

# ఇదే మేలు!

అనువాదం : కె. శారద

నిరుద్యోగ సమస్య గురించి నేను అనేకసార్లు తీవ్రంగా ఆలోచించాను. అక్రమాలు, లంచగొండితనం, మోసాలతో కుళ్ళిపోయి కంపుగొడుతున్న ఈ సమాజం ఎప్పుడు బాగుపడుతుందోనని మదనపడుతు ంటాను. ఈ సమాజం నిజాయితీపరులు జీవించడానికి అనువుగాలేదని అనేకసార్లు అరచి గగ్గోలు పెట్టాను కూడా. హోట, ఫుట్ పాత్, లైబ్రరీల దగ్గర ఎక్కడ నలుగురు స్నేహితులు పోగయితే అక్కడ నా అభిమతం వ్యక్తం చేస్తాను. వీలుచిక్కితే పెద్ద ఉపన్యాసం కూడా దంచుతుంటాను. మచ్చపడ్డ ఈ సమాజంలో, ఈప్రజానీకంలో ఒక పరివర్తన తీసుకు రావాలి. విప్లవాత్మకమైన మార్పు రావాలి.

నేను ఎం.ఏ. పాసయ్యి ఒక సంవత్సరం పూర్తయింది. నిరుద్యోగుల జాబితలో నా పేరు నమోదు అయ్యేవుంది . న్యూస్ పేపర్లల్లో ఉద్యోగావకాశాల కాలమ్స్ చూసి చూసి నా కళ్లు కాయలు కాశాయి. ఎన్నో ఇంటర్వ్యూలకి హాజరయ్యాను. ఇంటర్వ్యూ ప్రదేశంలో పైరవీలు ముమ్మరంగా సాగుతున్నాయి. నాస్నేహితులు కొందరు సలహా ఇచ్చారు. ఓ వెయ్యి రూపాయలు వాడి మొహాన కొట్టేస్తే, అపాయింట్ మెంట్ లెటర్ చేతిలో పడుతుంది కదా అని. నేనైతే విసుగ్గా తిరిగొచ్చేశాను. లోలోపలే కుమిలిపోయాను. ఈ బహిరంగ లంచాన్ని ఎలా ఎదురించాలి. ఎలా ఖండించాలి? ఉద్యోగం దొరక్కపోయినా ఫర్వాలేదు. నిజాయితీ కోసం పోరాడుతాను.

నా గదిలో పడుకుని ఆలోచనలో మునిగిపోయాను. ఇంతకుముందు చేసిన ఉపన్యాసం గుర్తుకొచ్చింది. వెంటనే చప్పట్లు ప్రశంసలు. కొంతమంది యువకుల్లో నాకు మంచి గుర్తింపు వచ్చింది. నా మాటలు వింటున్నారు. నాతో ఏకీభవిస్తున్నారు. యువతరం నా వెంట ఉంటే సమాజంలోని మాలిన్యాన్ని కడిగేయొచ్చు. పదిమంది తోడుంటే ఏదైనా సాధించవచ్చు.

"బాబు.. అన్నం పెట్టాను రా..."అన్న అమ్మ పిలుపుకి నా నిద్ర తేలిపోయింది. వంటింట్లోకి వెళ్ళాను, చెల్లెలు నోనిత, తమ్ముడు లోలి భోజనానికి వరసగా కూర్చున్నారు. నాన్న ఇంకా రానట్టుంది. మా నాన్నకు కూడా మంచి ఉద్యోగం ఏదీ లేదు. కూలీ పనులు చేసే నన్ను ఎం.ఎ. వరకు చదివించాడు. నేను అన్నం తింటూండగా, అమ్మ చిన్నగా చెప్పింది- "మన ఇంటివెనక వుండే విజయ్ కాలేజీలో లెక్చరర్‌గా చేరాడట. వేరే వాళ్లందరికీ ఉద్యోగాలు దొరుకుతాయి. నాకదే అర్థం కాదు, వాళ్లకెలా దొరుకుతాయో, నీకెందుకు దొరకదో? వాళ్లు నీకంటే యోగ్యులా? "

"వాళ్లకు పరిచయస్థులు, పైరవీకారులు ఉన్నందుకు, తొందరగా ఉద్యోగాలు దొరికిపోతాయి"అన్నాను.

"నువ్వు కూడా అలాంటి పరిచయాలు

పెంచుకునే ప్రయత్నం చెయొచ్చుగా!"అంది అమ్మ. కేవలం వంటింటికే పరిమితమై పోయిన అమ్మకు బయటి ప్రపంచం గురించి ఏం తెలుస్తుంది. నేనేం జవాబు చెప్పలేదు. నోనిత, లోలి లేచి వెళ్ళిపో యారు. అమ్మ మళ్ళీ చెప్పసాగింది- "చూడు, నోనిత కూడా పెద్దదయింది. పెళ్ళీడుకొస్తుంది. నగనట్రా వేయకపో యినా, కనీసం మంచి బట్టలయినా కొనివ్వాలి. రోజు రోజుకీ మనం పిల్లలకి కడుపునిండా తిండి కూడా పెట్టలేకపో తున్నాం. మీ నాన్న ఒక్కడే ఎంతకాల మని ఈ సంసారాన్ని ఈడ్చుకొస్తాడు. నువ్వు కూడా ఆలోచించు"అంది.

అమ్మ ఉద్దేశం నాకు అర్థమయింది. ఇంటి వ్యవహారంలో నా బాధ్యత కూడా ఉందన్న సంగతి గుర్తుచేస్తోంది. నిజమే, రోజు రోజుకూ ఇల్లు గడవడం కష్టమయి పోతోంది. చేతికొచ్చిన కొడుకు చెంతనుండి కూడా చేదోడు వాదోడుగా లేకపోతే ఏ తల్లిదండ్రులైనా బాధపడుతారు.

కుక్కి మంచం మీద మళ్ళీ బోర్లగా పడు కుని బీటలువారిన జీవితాన్ని నెమరేసుకో సాగాను. ఒకదానితో మరొకటి పొంతన కలవని ఈ జీవితాన్ని ఎందుకు గడపాల్సి వస్తోంది నేను. ఇవాళ ఎందుకో కేన్వా స్‌పై అలుముకున్న దట్టమైన రంగుల భావం అర్థమవుతున్నట్టుగా అనిపించింది. ఎర్రని అగ్నిజ్వాల వంటి ఆ కేన్వాస్‌పై జీవితం నిరర్థకంగా, సమాజం కురూపిగా, చూడ్డానికి అసహ్యంగా అనిపిస్తోంది. అయితే అమ్మ ఇవాళ నాపై ఒక బాధ్యత మోపింది. కుటుంబ నిర్వాహణలో తోడ్ప డమని సూచించింది.

నేను మంచంపైనుంచి లేచి, బట్టలు తొడుక్కున్నాను. సైకిల్ బయటకు తీస్తుం డగానే నాన్న ఎదురుపడి చెప్పాడు. "బాబు, ఒకతను చెప్పాడు. విద్యాశాఖ లో గుమాస్తా పోస్టులు భర్తీ చేస్తున్నారట. నువ్వు కూడా అప్లికేషన్ పెట్టు"అన్నాడు.

ఆఉద్యోగం వస్తుందన్న నమ్మకం లేదు, అయినా అప్లై అయితే చేస్తాను" దిగాలు పడిపోతూ చెప్పాను.

"నిన్న ఇబోతోంబీని కలిశాను బాబు.. అతనూ ప్రయత్నిస్తానని చెప్పాడు"అ న్నాడు నాన్న.

నాకు తెలుసు, ఇబోతోంబీ డైరెక్టర్ బంధువు. అతను చాలా మందికి ఉద్యో గాలు ఇప్పించాడు. బహిరంగంగా లంచంతో.

అయినా, నేనేం బదులివ్వలేదు. మౌనంగా సైకిల్ ఎక్కి వెళ్ళిపోయాను. ఈ భయంకర లంచం వ్యాధి ఇంత వేగంగా వ్యాపిస్తూ పోతుందేమిటీ? నా ఇంట్లోకి కూడా జొరబడుతోంది.

దారిలో పాత మిత్రులు కలిశారు. ఇప్పుడు సంపాదిస్తున్నవాళ్లు కొందరు పల కరించారు. కొందరు తలాడిస్తూ చెక్కే శారు. కొందరు చూసి చూడనట్టు వెళ్లిపో యారు... వాడేమనుకోడులే ఎం.ఎ. నిరు ద్యోగేగా అనుకుని ఉంటారు. నాలో నేనే నవ్వుకుంటూ మౌనంగా ముందుకు సాగాను.

కైశామ్‌పాత్ హోటల్ చేరుకోగానే వెన కనుంచి ఎవరో నా పేరుపెట్టి పిలి చారు... తిరిగి చూస్తే సమరేంద్రు కనిపిం చాడు. చిన్నప్పటి నుండీ క్లాస్మెట్. బి.ఏ. పాసవ్వగానే క్లర్క్ అయ్యాడు. ఇప్పుడు హెడ్‌క్లర్క్. ఉద్యోగం చేయబట్టి చాలా రోజులే అయింది.

"ఆగు- టీ తాగుదాం"అన్నాడు.

నేను కూడా వాడితో మాట్లాడాలనుకు న్నాను. బహుశ, ఆ క్లర్క్ పోస్టుల పోటీ పరీక్షల పట్ల ఐడియా ఉండే ఉంటుంది. ఎలా ప్రిపేర్ అవ్వాలో తెలుసుకోవాలని పించింది. హోటల్లోకి వెళ్లాం. మాటలు కొనసాగాయి. మొదట పాకిస్థాన్ యుద్ధం గురంచి సైనికుల వీరంగం, మారణ

హోమం, అసంఖ్యాకులైన యువకుల రక్తంతో రాతిగోడలపైన అనేక కథలు రాయబడ్డాయి. అద్భుత సాహసాలు, ప్రతి ఘటనల గురించి చర్చించాం. ఆ తర్వాత సమాజంలో దిగజారుతున్న మానవ విలువ గురించి వల్లించుకున్నాం.

వేడి వేడి టీ రెండు గుటకలు తాగాక, వాడు హఠాత్తుగా సంభాషణ మార్చాడు- "నువ్వింకా ఉద్యోగం చేయడంలేదు. ఏదో ఒక ఉద్యోగంలో చేరు. మార్గాలు దొరుకుతాయి."

వాడి మాటలకి నవ్వొచ్చింది. ఎంత తేలిగ్గా చెప్పేశాడు వాడు. ఉద్యోగాలు ఎక్కడో తేరగా పడుంటే నేనే చేయడం లేదన్నట్టు మాట్లాడుతున్నాడు. వాడికి తెలియదా? నిరుద్యోగ సమస్య, వాడు ఎదుర్కోలేదా?

"ఏమిట్రా, ఉద్యోగం అంత తేలిగ్గా దొరుకుతుందా? "అన్నాను.

"గట్టిగా ప్రయత్నిస్తేగా దొరికేది? " వాడు చిన్నగా నవ్వి మళ్ళీ చెప్పాడు- "నువ్వు చేసే ఉద్యోగ ప్రయత్నాలు తప్పు. ఈ రోజుల్లో నిజాయితీగా ఉద్యోగాలు దొరకవు. మార్గాలు అన్వేషించుకోవాలి."

నాకు వాడి మాటలు అర్థమయి, సూటిగా అడిగాను "నీ ఉద్దేశం, లంచం ఇవ్వాలనే కదా? "

"అవును, అదే. ఇప్పుడు లంచం ఇవ్వకుండా, అడ్డదారులు తొక్కకుండా ఏదీ లభించడంలేదు. కాకా పట్టో, కాళ్లు పట్టుకొనయినా పనిచేయించుకోవాలి. సమాజాన్ని బాగా అర్థం చేసుకోవాలి. 'సర్వాయివల్ ఆఫ్ ది ఫిటేస్, ఇలివినేసన్ ఆఫ్ అనిఫిట్', డాల్టన్ వెలిబుచ్చిన ఈ సిద్ధాంతాన్ని గుర్తుంచుకోవాలి. సమాజాన్ని మార్చలేనప్పుడు, మనమే దానికి అనుగుణంగా మారిపోవాలి." అన్నాడు.

ఇది మనిషి రుగ్మత. కుళ్లిన అభిప్రాయం. మానవుడి ఆదర్శం కాదు. బురదకుంటలో కూరుకుపోవడం వివేకం కాదు. జీవించడానికి మేలేమోగానీ, జీవన విలువల్ని ప్రతి బింబించవు అన్నాను.

"సమరేంద్రా.. మన యువత ద్వారా సమాజంలో ఒక కొత్త పరివర్తన తీసుకురావాలన్న లక్ష్యం ఉంది నాకు. ప్రయత్నిస్తే ఫలించవచ్చు."

నేను ఇంకా చెప్పబోయేలోపున, వాడే కలుగజేసుకుని చెప్పాడు- "నిజమే. నాక్కూడా తెలుసు. సమాజంలో ఒక పరివర్తన తీసుకురావడం అనివార్యమే. జనం చాల పొరపాట్లు చేశారు. జీవితంలో చాలా ఒడిదుడుగులు జరిగిపోతున్నాయి. అయితే, ఫుట్‌పాత్‌ల పైన, ఆట మైదానాల్లో, హోటళ్ళలో నువ్వు, నేను గొంతు చించుకున్నంత మాత్రాన సమాజంలో మార్పు రాదు. నువ్వు కూడా ఒకసారి బాగా ఆలోచించు. నా మనసులోనూ సమయానుకూలంగా విజృంభించే ఒక తుఫాను చెలరేగుతుంది. మరి అది హఠాత్తుగా చల్లబడిపోతుంది. నువ్వు, నేను అరిస్తే ప్రయోజనం లేదు. మానవ సమాజ చరిత్ర పుటల్ని ఒకసారి వెనక్కి తిప్పి చూడు. నిరంతరం ఒక పరివర్తన లభిస్తుంది. నేటి సమాజం భవిష్యత్తు, మార్పు. కాల ప్రవాహ హోరు మధ్య కొట్టుమిట్టాడే మార్పు కనిపిస్తుంది. నువ్వు సడెన్-చేంజ్ కోరుకోవద్దు. చేంజ్ అర్థం అనేక సంవత్సరాల పాటు మెల్లిమెల్లిగా అదే వచ్చేస్తుంది. ప్రతీ మనిషి ఆలోచన పరిపక్వతకి ఒక సమయం వస్తుంది. అప్పటిదాక ఎదురుచూడాలి.

మా ఇద్దరి మధ్య ఎంతో తర్జన భర్జన జరిగింది. పరిణామం ఏమి రాలేదు. రాజకీయ అంశాలెన్నో తిరగదోడాం. అన్నీ నిరర్థకం నిష్ప్రయోజనమే అయిపోయాయి.

చివరకు వాడు అలసిపోయి, నవ్వుతూ అన్నాడు "మొదట నేను క్లర్క్‌ను. ఇప్పుడు దానికి 'హెడ్' తోడయింది. ఇంకా పదో

స్నతి అవకాశం ఉంది. నాకు తెలుసు, పరిస్థితులతో పాటు ఎలా సర్దుకుపోవాలో.. అంత మాత్రాన ఆత్మవంచనతో చావనయితే చావనుగా... అందువల్ల మేలేగానీ కీడు ఉండదు" అన్నాడు.

వాడితో ఇంకా వాదించడం అనవసరం అనుకున్నాను. మనసు గజిబిజి అయిపోయి, వచ్చిన పని వదిలేశాను. నేరుగా తిరిగి ఇంటికి వచ్చేశాను.. దారిలో ఆలోచించాను సమరేంద్ర వంటి సర్దుబాటు మనుషులు ఎంతమంది ఉంటారు. అందరికీ అందరూ సమరేంద్ర వంటి వాళ్ళేనా? తెలియదు. అయితే నాక్కూడా అలా జీవించడం తప్పదా? ఆత్మవంచన చేసుకోవల్సిందేనా? అయ్యో, మరిచేపోయాను. క్లర్క్ విషయం అడగనే లేదు.

ఇంట్లో నోనిత అమ్మ మాట్లాడుకుంటున్నారు. ఏదో కొనిపెట్టమని చెల్లాయి మారాం చేస్తుంటే, అమ్మ సర్దిచెబుతోంది.

ఆ వేడి వాతావరణంలో నేను దూరలేదు. మెల్లగా నా గదిలోకి వెళ్ళిపోయాను. సమరేంద్రు చివరి మాటలు గుర్తొచ్చాయి. 'సర్దుకుపోవడం వల్ల నేను చావనయితే చావనుగా... అందువల్ల మేలేగానీ, కీడు ఉండదు.' చావకుండా ఉండడానికి బతకాలి. ఎలా బతకను.

అంతలోనే నాన్న ఇంటికి వచ్చాడు.

"ఏమయింది? "

"సగం ఇల్లు అమ్మేయాల్సి వస్తోంది." నాన్న అమ్మతో చెప్పాడు- " షావుకారుతో మాట్లాడాను? "

"ఎంతకి? "

"మూడువేలకి..."

"ఇబోతోంబీ ఎంత అడిగాడు? "

"పదిహేను వందలు."

నాకు అర్థమయిపోయింది. నా ఉద్యోగ ప్రయత్నం ముమ్మరమయిందని. జీవన సౌధానికి నిజాయితీ పునాది వేయాలనుకున్నాను. కానీ నా స్వప్నం చెదిరిపోతోంది.

ఎంత అసహ్యం! ఫుట్‌పాత్‌ల పైన, హోటళ్ళల్లో నిరుద్యోగ యువకుల సమక్షంలో దంచిన ఉపన్యాసాలు ఊక దంపుడయిపోతున్నాయి. లంచగొండితనం, అక్రమాల ప్రతిఘటన అంతా మట్టికొట్టుకుపోతున్నాయి. ఇది ఎంతటి వైపరీత్యం?

"నాన్నా, నా అభిమతానికి విరుద్ధంగా అంత డబ్బు ఎందుకిస్తున్నావు. అది అప్రతిష్ఠ, ఉద్యోగం దొరక్కపోనీ"అన్నాను.

"నువ్వు పనికిమాలిన ప్రతిష్ఠ కోసం పాకులాడుతూ ఉండు. ఈ ముసలి ప్రాణి అందరిని పోషిస్తూ ఉంటాడు. అంతేనా? నన్నెంత కాలం నలిగిపొమ్మంటావు? "

నాన్నకి కోపం వచ్చింది. నాక్కూడా సిగ్గనిపించింది. అమ్మ నాకు సర్ది చెప్పింది- "కొంత డబ్బు ఇవ్వనీ మీ భవిష్యత్తుకు ఒక దారి ఏర్పడుతుంది. నోనిత, లోలిల గురించి కూడా కొద్దిగా ఆలోచించు."

ఏం చేయాలో తోచక మౌనంగా ఉండిపోయాను. నాన్న ఆవేదనలో కూడా వాస్తవం ఉంది. ఇంటి పట్టాకాగితం తీసుకుని వెళ్ళిపోయాడు. దస్తావేజు తయారు చేయించడానికి కాబోలు. భోజనం కూడా చేయకుండానే వెళ్ళిపోయాడు.

కొద్ది రోజుల్లోనే చిన్న క్లర్క్‌ను అయిపోయాను. రోజూ రోడ్డు మీద నడుచుకుంటూ వెళ్తూ ఉంటే, అనేకమంది నిరుద్యోగ యువకులు పేపర్ దుకాణల దగ్గర, సినిమాహాళ్ళ ఎదురుగా నిలబడి, నావైపు వంకర చూపులు చూస్తూ ఉంటారు. కొందరు యువకులు నవ్వుకుంటారు కూడా.

వాళ్ళు నన్ను చూసి ఏమనుకుంటున్నారో తెలియదుగానీ, నేను మాత్రం నిరుద్యోగ సమస్యనుంచి బయటపడ్డాను.

ఆశయాలు, ఆదర్శాలు ఆకలి తీర్చలేనప్పుడు ఏదో ఉపాయంతో జీవించక తప్పదు. ఎవరినో ఆశ్రయించక తప్పదు. ఆకలితో అలమటించే కంటే ఇదే మేలు! V

తెలుగు కథ

-గాడేపల్లి సుబ్రహ్మణ్యం

# చికున్‌గున్యా

**చి**త్ర, అరవింద్‌ల పెళ్లి చూపుల దగ్గర్నుండి కుదరడం వరకూ అప్పడాల పిండి లాగా సాగుతూ కాకుండా, కరకరవేగిన అప్పడాల్లాగా టకటకా జరిగిపోయింది. పెళ్లి చూపులకీ, పెళ్లికీ వ్యవధి పట్టుమని పదిహేను రోజులు కూడా లేదు. తాంబూలాల లాంఛనం కూడా పెళ్లి ముందురోజే మొక్కుబడిగా చేశారు. అలాగని వీళ్లూ వాళ్లూ తొందర పెట్టలేదు. అయిదారునెలల వరకూ ముహూర్తాలు లేవని ఆదరాబాదరాగా అన్నీ జరపాల్సి వచ్చింది.

పెళ్లైన పదహారు రోజుల పండగ అవగానే చిత్రని హైదరాబాదు కాపరానికి పంపారు. హనీమూన్‌కెళ్లడానికి అరవింద్‌కి సెలవూ లేకపోయింది. చిత్ర అక్కయ్య పురిటికి పుట్టింటికి రావడంతో, చిత్రతల్లి ఇంటివద్దేవుండాల్సివచ్చింది. చిత్రని కాపరానికి తండ్రి ఒక్కడే తీసుకొచ్చి దింపాడు. అరవింద్‌వాళ్ళ అమ్మగారు, కాన్పూర్‌లో అరవింద్ చెల్లెలు రెండో పురుటికి సాయం వెళ్లారు. ఆమెకి తోడు తండ్రికూడా వెళ్లారు. అందువలన ఎవరిసాయం లేకుండా కొత్తకాపురం పెట్టవలసి వచ్చింది. ఈ కాలం కొత్త దంపతులు ఇలాంటి అవకాశం కోసమే ఎదురు చూస్తూ ఉంటారుగాని ఈ దంపతుల సంగతే వేరు. గదిలోకి పంపడం అయితే అయింది కాని, అరవింద్ ముట్టుకుంటే ముడుచుకుపోయి చిత్ర ఏమాత్రం సహకారం ఇవ్వలేదు. అరవింద్ సహనం కలవాడు. రకరకాల పుస్తకాలు చదివి, ఆడవాళ్ళ సైకాలజీ ప్రాక్టికల్‌గా కాకపోయినా, థియరీ బాగా జీర్ణించుకున్నందువలన తొందరపడలేదు. ఆ కబురూ ఈ కబురూ చెప్పి ఒక స్నేహితుడిలాగా ఆ మూడురోజులూ గడిపాడు.

చిత్ర నాన్నగారు చిత్రని హైదరాబాదులో దింపి ఆ రాత్రే తిరిగి వెళ్దామనిముందే రిజర్వేషన్ కూడా చేసుకుని మరీవచ్చారు. భార్యా, మామగారు ఉదయం గౌతమిలో వచ్చినప్పుడు సికిందరాబాద్ స్టేషన్‌లో వాళ్లని కలుసుకుని, ఇంటికి తీసుకువచ్చాక వెంటనే ఆఫీసుకి వెళ్లిపోయాడు అరవింద్. ఆ పూటకి వంట చేసుకోకుండా హోటలునుండి భోజనం తెప్పించే ఏర్పాటు చేసాడు. సాయంత్రం కాస్త త్వరగానే వచ్చి, మామగార్ని బైక్‌పై ఎక్కించుకుని ఆయన్ని స్టేషన్‌లో దించి, వాయువేగంతో ఇంటికి వచ్చాడు అరవింద్. అప్పుడు మొదలయింది కథ.

అరవింద్‌ది సింగిల్ బెడ్‌రూమ్ ఫ్లాట్. రెండేళ్లకిందటే ధరలు పెరక్క ముందే కొనుక్కున్నాడు. తనే వండుకునేవాడు కాబట్టి అవసరమైన వస్తువులన్నీ ఒకటొకటిగా అమర్చుకున్నాడు. టీవీ,డబుల్‌కాట్, మిక్సీ, ఇద్దరికి సరిపోయే డైనింగ్ టేబుల్, రెండు కుర్చీలూ, చిన్న ఫ్రిజ్, వాటర్ ఫిల్టరూ అన్నీ ఉన్నాయి. చిత్రకి అన్నీ చాలా నచ్చాయి. అరవింద్ రాగానే ఇద్దరూ కలిసి భోజనం చేశారు. గిన్నెలూ, కంచాలూ కడిగేసి బట్టలు మార్చుకుందామంటే అర

వింద్ మంచం మీద పడుకుని ఏదో పుస్తకం చదువుతున్నాడు. హాలులోంచి పక్క ఫ్లాట్ కిటికీలు కనిపిస్తూ ఉంటాయి. అసలు చిత్రకి ఎంత సిగ్గంటే, బట్టలు మార్చుకునేటపుడు ఆడవాళ్ళుకూడా ఎవరూ ఉండకూడదు. అలాంటిది అరవింద్ ఉన్నగదిలో బట్టలు ఎలా మార్చుకుంటుంది? ధైర్యం చేసి "నేను బట్టలు మార్చుకోవాలి మీరు హాలులోకి వెళ్లండి" అంది చిత్ర. అరవింద్ కొంత ఆశ్చర్యపోయినా "సరే" అని హాలులోకి వచ్చేశాడు. చీర కట్టుకుని తలుపు తీసింది. "ఇంక పడుకోవచ్చా" అని అడిగాడు. "ఊ" అంది కాని ఈ రాత్రి ఎలాగా అని గాభరాగా ఉంది. అరవింద్ మంచం మీద ఒక పక్కగా పడుకుని, చిత్రకి ఖాళీ ఉంచాడు. చిత్ర చాలాసేపు మంచం చివరగా కూర్చుని చివరకి మెల్లగా పడుకుంది. అరవింద్ చిత్రభుజం మీద చేయి వేసి "చూడు చిత్ర మనకు పెళ్ళయింది. మన మధ్య జరగాల్సింది ప్రపంచంలో అందరు భార్యాభర్తల మధ్యా జరిగేదే. పోతే నీకు ఎందువల్ల సిగ్గో, అయిష్టమో తెలీదు. నీకెంకవరిమీదో ఇష్టం ఉందనుకోను. నేను దగ్గరికి రావడం నీకు ఇష్టం ఉండడం లేదు. అయినా నేను నిన్ను బలవంతం చేయను. నువ్వంతట నువ్వు దగ్గర అయేంతవరకూ నేనూ దూరంగానే ఉంటాను. ఉన్న ఒక్కబెడ్ రూమ్‌లో, ఒక్క మంచంపై పడుకోవడం తప్పదు. నేను ఉదయాన్నే డ్యూటీకి వెళ్లాలి. అందుకని ఎలాగోలా పడుకో. నేనూ పడుకోవాలి" అని అనునయంగా చెపుతున్న అరవింద్ మాటలకి ఏమీ అనలేకపోయింది చిత్ర. మెల్లగా నిద్రలోకి జారుకున్నారిద్దరూ.

ఉదయం ఆరింటికి చిత్ర నిద్ర లేచేసరికి అరవింద్ రెడీఅయి, కాఫీకూడాపెట్టుంచాడు. కూరలు తరిగి, వంటకి అన్నీ సిద్ధం చేసాడు. చిత్ర వచ్చి కుక్కరు పెట్టి వంట కానిచ్చి ఏడున్నరకల్లా అరవింద్‌కి క్యారేజీ సర్ది అందించింది. "చిత్రా నేను సాయంత్రం ఆరింటికల్లా వస్తాను. ఈ లోగా ఏమయినా కావాలంటే నా సెల్‌కి మిస్డ్ కాల్ ఇవ్వు. ఎదైనా మీటింగులో ఉంటే నేను తరవాత ఫోన్ చేస్తాను. తలుపు లోపల వేసుకో. సేఫ్టీ చెయిన్ ఉంచే మాట్లాడు ఎవరొచ్చినా. త్వరగా భోజనం చేసి ఓ గంట పడుకో. నేను వచ్చేటప్పుడు కూరలు తెస్తాను" అని ఓ ఫ్రెండుకి ఇల్లు అప్పచెప్పినట్టు చెప్పి అరవింద్ వెళ్లిపోయాడు. పదకొండింటికి అన్నం తిని గిన్నెలు తోమి, వంటిల్లు సర్ది పేపరు చదువుతూ నిద్రపోయింది చిత్ర.

అరవింద్ మొదటే చెప్పాడు "పనిమనిషిని పెట్టుకోవడం నాకిష్టం లేదు, ఉన్న రెండు గదులూ శుభ్రం చేసుకోడానికి, వున్న నాలుగుగిన్నెలూ కడుక్కోడానికి పనిమనిషిని పెట్టుకుంటే, ఖర్చే కాక ఆపని మనిషి కోసం ఎదురుచూడ్డం, ఆమనిషి రాకపోతే ఎలాగూ మనమే చేసుకోవాలి కదా, అందుకనే నేను మొదటి నుంచీ నాపనులు నేనే చేసుకోవడం అలవాటు చేసుకున్నాను. బట్టలు వుతికి ఇస్త్రీ మనమే చేసుకోవచ్చు. నీకు కష్టం అనిపిస్తే నేను ఆఫీసు నుంచి వచ్చాక సాయంచేస్తా" అని అరవింద్ వివరంగా, లాజిక్‌గా చెబుతూ ఉంటే వినడం తప్ప ఏమీ చేయలేకపోయింది. తమ ఇంటివద్దఅయితే, రంగమ్మో ఆమె కోడలో వచ్చిపన్లుప్రారంభిస్తేగానితెల్లారేదే కాదు. వంట గిన్నెలు అత్యవసరం అయినా స్వయంగా తోముకోడానికి తనకు నామోషీ. తన ఫ్రెండ్ రాధ అమెరికా వెళ్లి మూడు నెలలుండి వచ్చి అక్కడ అన్ని పనులూ తనే చేసుకోవలసిరావడం సంగతులు చిత్రతో చెప్పుకున్నప్పుడు, తనకి కూడా అలాంటి అమెరికా యోగం ఉందేమోనని సంశయం కలిగింది. అయితే మనదేశంలో కూడా ఈ పరిస్థితి ఎదురవుతుందని అనుకోలేదు. కాని అరవింద్ చెప్పే




పద్ధతిలో ఎక్కడా తప్పు పట్టేందుకు కనిపించలేదు చిత్రకి. మధ్యాహ్నం మూడింటికి అరవిందే ఫోను చేశాడు. "ఎలా ఉన్నావ్" అని. అరవింద్‌కి అయిదు రోజుల ఆఫీసు. శుక్రవారం సాయంత్రం నుండీ సోమవారం ఉదయం వరకూ తీరికే. సాయంత్రం ఆరున్నరకి వస్తూ కూరలూ, స్వీట్లు పళ్ళూ పువ్వులూ తెచ్చాడు

వంటచేసి, స్నానం చేసి పువ్వులు పెట్టుకుని రతీదేవిలా తయారయింది చిత్ర. భోజనం చేస్తూ అరవింద్ మాట్లాడుతూ ఉంటే తను కూడా కొంత మాట్లాడింది. "హైదరాబాదులో ఎవరయినా బంధువులు ఉన్నారా? వాళ్ళు వస్తూ ఉంటారా మీరు వెళ్తూ ఉంటారా" అని అడిగింది. "మాపెద నాన్నగారి అబ్బాయి వాళ్ళు చిక్కడపల్లిలో ఉంటారు. పండగలకినేను కాకినాడ వెళ్లక పోతే వాళ్లింట్లోనే భోజనం. అప్పుడు బ్రహ్మచారిని కదా" అని కొంటెగా నవ్వాడు. "మీవాళ్లు ఎవరయినా ఇక్కడ ఉన్నారా"

అడిగాడు అరవింద్. "చాలామంది ఉన్నారు కాని నాకు వాళ్ల అడ్రసులు తెలియవు నాన్నగారిని అడగాలి" అంది చిత్ర. "రేపు ఉదయం శిల్పారామం వెళ్దాం. అక్కడ్నుంచి ఎదయినా హోటల్‌లో భోంచేసి మేట్నీషోకి వెళ్లి, సాయంత్రం చిక్కడపల్లి అన్నయ్య వాళ్ళింటికివెళ్దాం. ఆదివారం మీవాళ్ళెవరింటి కైనా వెళ్దాం". అని ప్రోగ్రాం చెప్పాడు అర వింద్. రాత్రి మామూలే. అరవింద్ మాటకి కట్టుబడి చిత్రని తాకే ప్రయత్నం కూడా చేయలేదు, చిత్రే "ఏదయినా మాట్లాడండి" అని అడిగింది. "సినిమాలు చూసేదా నివా? " అడిగాడు. "ఎక్కువగా టీవీలో వచ్చేవే చూసేదాన్ని." "రాధతో రెండో మూడో సినిమాలు చూశాను" అంది చిత్ర. "నేను నీ మీద చేయివేస్తే ముడుచుకుపోతు న్నావు. నేను నీకు నచ్చలేదా"అన్నాడు అర వింద్. "అయ్యయ్యో అవేం మాటలండీ అంది కంగారుగా చిత్ర. "మీఫ్రెండ్స్‌తోన యినా భార్యా భర్తల సంబంధం గురించి ఎప్పుడయినా మాట్లాడేదానివా? " అడిగాడు అరవింద్. "రాధే ఎప్పుడయినా అలాంటివి మాట్లాడితే నేనేకట్ చేసేదాన్ని" అంది చిత్ర గర్వంగా. 'ఓహో అయితే నేనే నీకు గురు వుని అవ్వాలన్న మాట' అనుకున్నాడు లోలోపల అరవింద్. ఉదయమేలేచి తానే టిఫిన్ కాఫీలు సిద్ధం చేసింది చిత్ర. "దగ్గర్లో ఏదయినా గుడి ఉందా, వెళ్దాం" అని అడిగింది. "వెంకటేశ్వరస్వామి గుడి దగ్గరే.."అన్నాడు. "గుడికి వెళ్ళొచ్చాక టిఫిన్ తిందాం" అంది ఆమె., గుడికెళ్ళి తిరిగొచ్చి, తాపీగా టిఫిన్ తిని ఆపై బైక్ మీద శిల్పారామంకి బయల్దేరారు. అరవిం ద్‌తో వెళ్లడం చిత్రకి అదే మొదలు, దగ్గరగా కూర్చోవడం, బైక్‌కుదుపులకు మరీ దగ్గర వడం చిత్రకు ఏదోలా అయినా సర్దుకుంది. అరవింద్ మాత్రం ఏ రకమైన స్పందన లకూ లోను కాకుండా మామూలుగా ఉన్నాడు. శిల్పారామం చూసి తిరిగివస్తూ 'చట్నీస్'లో భోజనం చేసి తిన్నగా ఐమ్యాక్స్‌కెళ్ళారు. మ్యాట్నీ షో'అవతార్' చూసి , సాయంత్రం చిక్కడపల్లిలో అర వింద్ పెదనాన్నగారి అబ్బాయి ఇంటికి చేరుకున్నారు. ఆకుటుంబీకులందరూ ఎప్ప టినుంచో తెలిసినవారిలాగా తనని దగ్గర చేసుకునే సరికి వాళ్లింట్లో టైం తెలియకుం డానే గడిచింది చిత్రకి. రాత్రి పదిన్నర యింది ఇంటికి వచ్చే సరికి. ఆదివారం ఉదయం ఏడింటివరకూ ఇద్దరూ లేవలేదు. చిత్ర ముందు లేద్దామనుకుంటే కొంచెం కాళ్లు పట్టేసినట్టయింది. వళ్ళునొప్పులు, స్వల్పంగా జ్వరం కూడా వచ్చినట్లైంది. గోడ పట్టుకుని అతి కష్టం మీద బాత్‌రూ మ్‌కి వెళ్ళొచ్చి మళ్లీ మంచంమీద పడు

కుంది. అరవింద్ లేస్తూనే చిత్ర చెయ్యివే డిగా తగలడంతో నుదుటిపై చేయి వేసి చూశాడు. జ్వరం తెలుస్తూనే ఉంది. "కాళ్లు చేతులూ చాలా నెప్పిగా ఉన్నా యండీ" అంది చిత్ర. అతను లేచి పక్క ఫ్లాట్ రమగారింటికి వెళ్లి విషయం చెప్పగా, ఆవిడ వచ్చి చూసి "మాయదారి జ్వరాలు హైదరాబాదునిండా ఉన్నాయి. డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్ళేలోగా క్రోసిన్ మాత్రవేసి వేడి కాఫీ ఇవ్వుబాబూ.. ఖంగా రుపడద్దు" అని ధైర్యం చెప్పింది.

ఏడింటికి డిస్పెన్సరీ తెరవగానే అరవింద్ వెళ్లాడు. "హైదరాబాదు.. రాష్ట్రానికే కాక జబ్బులకి కూడా రాజధాని అవుతోంది ఈ మధ్య, చికెన్ గున్యా అయితే చాలామందికి వస్తోంది. డెంగీ, స్వైన్‌ఫ్లూ అలాగ రకర కాలు వస్తున్నాయి. ఏమయినా రెండు మూడు రోజులకి కాని పూర్తిగా తెలియదు. బ్లడ్ టెస్టింగ్‌కి ఇచ్చినా రెండు రోజులవ రకూ రిపోర్టు రాదు. ఆ రిపోర్టు కూడా గోడమీది పిల్లిలాగా ఉంటుంది. ప్రస్తుతం ఈ మందులువాడి రేపు ఉదయం ఎలా ఉన్నదీ చెప్పండి" అన్నాడు డాక్టర్. అరంద్ ఇంటికొచ్చి ఆయన చెప్పినట్టే మాత్రలు టైము ప్రకారం వేశాడు. తమ ఇరువురి తల్లి తండ్రులకి చెప్పినా వారు వచ్చే అవకాశం లేదు. అనవరంగా గాభరా పెట్టినట్టవుతుం దని వాళ్లకి చెప్పలేదు. అరవింద్ ఆఫీసరుకి మాత్రం ఫోనుచేసి ఈ వారం సెలవు కావా లని చెప్పాడు.

రోజంతా చిత్ర మూలుగుతూనే ఉంది. బాత్‌రూమ్‌కి కూడా అతికష్టం మీద వెళ్లగ లిగింది. రాత్రి పది తరువాత మాత్రం అయిదారు గంటలు పడుకుంది. ఉదయా నికి జ్వరం కొంత తగ్గింది. కాని కాళ్లు చేతుల నెప్పులు మాత్రం ఇంకా

ఎక్కువయ్యాయి. ఉదయం స్నానం చేయక పోయినా బట్టలు మార్చుకుంటానంది. జాకెట్ హుక్స్ విప్పడం వేరే జాకెట్ తొడిగి హుక్స్ పెట్టడం అరవిందే చేయవ లసి వచ్చింది. ఒక నర్సులాగా అరవింద్ అవన్నీ చేసినా చిత్రకి మాత్రం చాలా సిగ్గు వేసింది. చేసేది ఏమీలేక ఊరుకుంది. డాక్టరు దగ్గరికి వెళ్తే "డిస్పెన్సరీ మూసేట పుడు ఒకసారి వచ్చి చూస్తాను అంతవ రకూ ఆ మందులే కంటిన్యూ చేయండి" అని చెప్పాడు. ఒంటిగంటకి ఆయనే వచ్చి చూసి "ఇది చికున్‌గున్యానే, అనవసరంగా టెస్ట్ చేయనక్కర్లేదు. చిన్న వయసు వారికి త్వరగా, మధ్యవయస్సు వారికి నెలా, నెలా పదిహేనురోజులకి, ముసలివారికి మూడు నెలల నుండి ఆరు నెలల వరకూ ఈ నెప్పులు ఉంటాయి. నెప్పి భరించలేనప్పుడు పెయిన్ కిల్లర్లు మార్చి మార్చి వేసుకోవాలి. చికున్ గున్యాకు ప్రత్యేకమయిన మందు అల్లోపతీలో ఇంకా రాలేదు. హోమియోలో, ఆయుర్వేదంలో ఉందంటారు. మా అమ్మ గారికి వస్తే హోమియో మందే ఇప్పిం చాను" అని చాలా ఫ్రాంక్‌గా చెప్పారు. మందులు వ్రాసిచ్చారు. ఆయన ఫ్రాంక్‌నె స్‌కు సంతోషించాలో, అల్లోపతీలో మందు లేనందుకు విచారించాలో తెలియలేదు అర వింద్,చిత్రలకి. కార్పోరేట్ ఆస్పత్రిలో చేర్పిం చమని చెప్పనందుకు కొంచెం బాగానే ఉంది. కాని పాపం చిత్రకి, భర్త అరవిం ద్‌తో సేవలు చేయించుకోవలసి రావడం కొంత బాధ కలిగింది.

డాక్టరు మందుల ప్రభావమో, అరవింద్ సేవల ఫలితమో, తన రోగనిరోధక శక్తో, వయస్సు తక్కువ వలనో త్వరగా కోలు కుంది. నాలుగు రోజులకే కొంత వరకూ నయమైంది. నెప్పులు తగ్గడానికి పెయిన్ కిల్లర్లు వాడుతున్నా పూర్తిగా కాళ్లూ చేతులూ స్వాధీనానికి రాలేదు. బట్టలు వేసుకోవడా నికి అరవింద్ సాయం తప్పడం లేదు.

శనివారం నాటికి చాలావరకూ బాగానే ఉంది. ఆ రోజు రాత్రి మామూలుగా పడు కున్న తరువాత అసంకల్పితంగానో, కావా లనో చిత్ర చేయి అరవింద్ మీదకు వేసింది. ఇన్నాళ్ళ నిగ్రహం ఒక్కసారి సడ లటంతో అరవింద్ ఆమెని కౌగిలించుకు న్నాడు. "అమ్మో, నెప్పి" అని చిత్ర మూలగ డంతో తెలివి తెచ్చుకుని "సారీ" అన్నాడు.

"మీరు సారీ కాదు. నేను చెప్పాలి సారీ రెండు రోజులాగండి. ఈ చికున్ గున్యా ఎంతో మేలు చేసింది. ఇద్దర్నీ మరింత దగ్గ రచేసింది. మీరెంతటి సున్నిత స్వభావులో అర్థం చేసుకున్నా. నేను పూర్తిగా మీదాన్నే" అని అరవింద్ దగ్గరగా జరిగి ఆప్యాయంగా అతనిపై చేయి వేసింది చిత్ర.




# లక్ష్మి

అనువాదం : వి. ప్రఫుల్ల

**తు**షారుకి ముంబై బదిలీ అయిందని తెలియంగానే రశ్మికి చాలా సంతోషమనిపించింది. అక్కడి సినిమా ప్రపంచాన్ని చూడవచ్చని, వీలైతే సినీతారల్ని కలుసుకోవచ్చనీ కూడ కలలుకన్నది. ముంబై చూడ్డానికి ప్రత్యేకించి పోవటం ఎలాగూ కుదరదు కాబట్టి, ఈ బదిలీ అన్ని విధాలా కలిసివస్తుదనుకుంది. ఆ రోజుకని ఆతృతగా ఎదురుచూ స్తోంది.

తుషారు ముంబై వచ్చాక తన కంపెనీ పన్లన్నీ ముగించుకుంటూ దైనందిన కార్యక్రమాలకు అలవాటుపడినాక తన భార్య రశ్మిని, మూడేళ్ళ కొడుకు బుజ్జిని తీసుకువచ్చాడు.

నగరం చూడటానికని అటూ ఇటూ తిరగటంతో ఒక నెల ఇట్టే గడిచిపోయింది. అప్పటికిగాని మామూలు స్థితికి రాలేకపోయారు ఆ దంపతులు. కాని

ఆస్థితిలో ఆ మహానగరంలోని ఖరీదైన జీవితం ముల్లులా గుచ్చుకోసాగింది. చుట్టుపక్కలున్న వాళ్లు ఇతర భాషల వాళ్ళవటంతో, మనసులో మాటను చెప్పు కోవటానికి కూడా ఎవరూ లేకుండాపో యారు. అందుకే ఒంటరితనం దుర్భర మైంది వాళ్ళకు. ముఖ్యంగా రశ్మికి.

అతికష్టం మీద ఒక మల్టీప్లేలోని మూడో అంతస్తులో ఒకే గది అద్దెకు దొరి కింది. అందులో వరండాలా వున్న భాగాన్ని వంట గదిగా మార్చుకున్నారు. ఎవరైనా వస్తే కూచోవటానికే అదే వాడు కుంటారు కూడా. సముద్ర తీరాన ఇల్లు దొరుకుతుంది, ఎగిరిపడే అలల సౌంద ర్యాన్ని ఆలోకిస్తూ, ఆస్వాదిస్తూ గంటల తరబడి గడిపేయొచ్చని, ముంబై వచ్చే ముందు ఊహించుకుంది రశ్మి. తీరా చూస్తే బయట తిరగటానికి మాత్రం ఏముంది కనుక, ఎక్కడ చూసినా గుడి సెలూ, గుడారాల్లాటి నివాసాలూ తప్ప! మనుషులు ఇంత దీనస్థితిలో కూడా ఉంటారా అనుకుని కడుపులో దేవినట్లు అనిపించింది రశ్మికి.

తన కలలు కల్లలైనందుకు రశ్మి వాపో తూంటే తుషార్ ఏడిపించేవాడు. "నిజ మైన ముంబై అంటే ఇదే. చేపలవాళ్ళు, పడవల్ని నడిపేవాళ్ళు గుడిసెల్లోనూ, గుడారాల్లోనూ కాక ఎక్కడుంటారు? మరి భవనాల్లో ఉంటారా? శ్రీమతి గారూ" అంటూ.

అప్పుడప్పుడూ పిల్లగాలులు మత్స్యగం ధాన్ని మోసుకొచ్చి ముక్కు పుటాల్ని తాకుతుంటే భరించలేక ముక్కు మూసుకో వటమూ కద్దు. అంతకన్నా వేరేదారీ కన్పించ లేదామెకు మరి! అక్కడకొచ్చిన కొత్తలో గిన్నెలు తోమటానికి, ఇల్లు శుభ్రం చేయటానికని మనిషిని పెట్టుకున్నది రశ్మి. ఆ మనిషి దగ్గరకు వచ్చినా కూడా మత్స్యగంధం వాసన గుప్పుమనేది. అందువల్ల ఆమెను పని మాన్పించింది.

రశ్మి ఇప్పుడు గర్భవతి కూడాను. ఇంటి పనులు చేసుకోవటం కష్టంగా ఉంది. పైపెచ్చు, మూడంతస్తులూ దిగి కూరగా యలూ, పాలూ తెచ్చుకోవాలి. బుజ్జిని తయారుచేసి స్కూలుకు పంపి, వంట చేసి పెట్టి, భర్తకి ఆలస్యం కాకుండా ఆఫీసుకు పంపాలి. పైగా తుషారు తనపనుల్లో సహాయ పడడు. ప్రొద్దున వెళ్లి రాత్రిగానీ రాలేడు. అదీ అలసిసొలసి వస్తాడు.

తుషారు తన తల్లికి ఉత్తరం కూడా రాశాడు. "అమ్మా.. నువ్వొచ్చి గర్భవతి అయిన కోడలికి సహాయపడరాదా" అని, ప్రాధేయపడ్డాడు కూడా. కాని ఆమె, "మీ నాన్నగారికి ఒంట్లో బాగుండటంలేదు.

నేను లేకపోతే ఎలా" అంటూ కారణం చెప్పింది. పైగా ఏమందంటే "అయినా నీవుండే ఆ ఒంటి గది ఇంట్లో కూర్చోటానికే చోటులేదు" అంటూ ఈస డించింది కూడాను.

భార్య కష్టపడేది చూడలేక, తుషారు తనకు తెలిసిన వాళ్ళందర్నీ, పనిమనిషిని వెతికిపెట్టమని అర్థించాడు. కానీ, ఆ వచ్చిన పనిమనుషులెవరూ రశ్మికి నచ్చ లేదు. గత్యంతరం లేక పనిమనిషి కావా లంటూ పత్రికల్లో కూడా ప్రకటించాడు. దాంతో కొంతమంది స్త్రీలు వెతుక్కుంటూ రానూ వచ్చారు, పోనూ పోయారు.

ఒకరోజు పొద్దున్నే ఎవరో తలుపు తట్టారు. అది విన్న రశ్మి ఆత్రంగా తలుపు తీస్తే, గుమ్మంలో ఒక మధ్య వయస్కు రాలు. అతి సాధారణమైన దుస్తుల్లో నిల్చుని ఉంది,

"పనిమనిషి కావాలని అడిగారా" అంది ఆమె.

"అవును, ఏది, ఎక్కడ" అని ఆత్రంగా అడిగింది రశ్మి.

"నేనే" అన్నదామె.

రశ్మి, తుషారు మొహమొహాలు చూసు కున్నారు. ఆమెకేసి మార్చి మార్చి చూశారు నమ్మలేనట్లు.

"నేను అన్ని పన్లూ చేయగలనమ్మా. అన్నిరకాల వంటలూ, పచ్చళ్ళూ, ఊరగా యలతోసహా చేయగలను. కాని రాత్రిళ్ళు మాత్రం ఇంటికె ళ్ళిపోతాను" అంటూ షరతు పెట్టిందామె.

"సరే.. రాత్రిపూట ఉండిపోనక్కరలే దులే" అంది రశ్మి సరి పెట్టుకుంటూ.

"సరే.. ఇంతకీ నీ పేరేమిటి? " అడి గింది మళ్ళీ.

"నాపేరు లక్ష్మి" అన్నదామె క్లుప్తంగా.

"చూడు.. మాదో చిన్న కుటుంబం. పనేమీ అంత ఎక్కువగా ఉండదులేగానీ మరి.. మాకు శుభ్రత ముఖ్యం" అంది రశ్మి. "మీకు నచ్చేవిధంగానే చేస్తానమ్మా " అంది లక్ష్మి, అదేం పెద్ద విషయం కాద న్నట్లు. కానీ నెలకు మూడువేల జీతం మాత్రం ఖచ్చితంగా అడిగింది. బేరమా డితే, రెండువేల అయిదు వందలకు దిగింది. ఆ రోజే పన్లోనూ చేరింది. ముందుగా టీ చేసిచ్చింది. బుజ్జిగాడికి నూనె మర్దనా చేసి స్నానం చేయించింది. ఇల్లు ఊడ్చి శుభ్రం చేసింది. తుషారుకి భోజనం క్యారేజి సిద్ధం చేసింది.

తుషారు రశ్మిలు ఆమె పని చూసి ముగ్ధులయ్యారు. తమ తపస్సు ఫలించినందుకు దేవునికి మనసారా కృత జ్ఞతలు చెప్పుకున్నారు.

రోజూ సాయంత్రం, లక్ష్మితో పచ్చాపాటి మాట్లాడ్డం అలవాటయింది. లక్ష్మి వాళ్ళ కుటుంబ సభ్యులలో ఒకటిగా మారిపో యింది. ఆమెను ఆ దంపతులు తల్లిగా భావించటం మొదలుపెట్టారు.

ఉదయం రాగానే అందరికి టీ తయారు చేసివ్వటం, రిక్షా వచ్చే సమయానికి బుజ్జిని స్కూల్ కి తయారుచేసి పంపించటం, తుషారికి 9 గంటలకల్లా టిఫిన్‌తోపాటు భోజనమూ తయారు చేసివ్వటం, రశ్మికి పళ్ళరసం తీసివ్వటం లాటి పన్లన్నీ గాలిప టంలా ఇల్లంతా తిరుగుతూ చురుగ్గా చేస్తూంటుంది.

నిజం చెప్పాలంటే, లక్ష్మి వంట చాలా అద్భుతంగా చేస్తుంది. రశ్మి ఆమె నుంచి ఢోక్లో, దోసెల్లాంటివి చేయటం నేర్చుకుంది కూడ. ఊరగాయలు చేయటం సరేసరి! పచ్చళ్ళూ రోజుకో రకం చేస్తుంది. ఆమె యీ ప్రావీణ్యతను చూసి ఒకసారి రశ్మి అడగనుగూడ అడిగింది. "మీరు వంట కాల స్కూలు నడిపారా అమ్మా" అంటూ.

లక్ష్మి పరాచికంగా అన్నది "అవునమ్మా, నేను కుట్లూ, అల్లికల స్కూలు కూడా నడి పేదాన్ని" అని. అది విన్న రశ్మి "యీమె మాటల్లో కొంచెం అతిశయోక్తి కూడ రంగ

రించుతుందిలా ఉందే" అనుకున్నది తన్లో తనే.

ఈ లోగా రశ్మిని ప్రసవానికని ఆస్ప్రత్రిలో చేర్చటమైంది. లక్ష్మి కూడా ఆస్ప్రత్రిలోనే ఉండిపోయింది. లక్ష్మి రశ్మిని బాగా చూచుకోగలదనే ధైర్యం వచ్చింది తుషారుకి. వాళ్ళమ్మకు ఉత్తరం కూడా వ్రాశాడు. నాన్నగారిని జాగ్రత్తగా చూసుకో. ఇక్కడ రశ్మిని లక్ష్మి బాగా చూసుకుంటోంది" అంటూ.

రశ్మికి ఆడపిల్ల పుట్టింది. మూడు రోజుల తర్వాత తల్లీ పిల్లలను యింటికి తీసుకువచ్చారు. పసిబిడ్డకు, తల్లికి చేయవలసిన ఉపచారాలన్నీ చేస్తూ, రోజువారి పనులనూ ప్రశంసనీయంగా చేసుకుంటూ పోతోంది లక్ష్మి.

"అమ్మా, మీరు నా అత్తగారు రాని లోపాన్ని తీర్చారమ్మా" అంటూ కృతజ్ఞత తెల్పుకుంది రశ్మి.

"మీరు నా కన్నబిడ్డ మాదిరి అమ్మ. మీ ఉప్పు తింటున్నాను ఆ మాత్రం చేయ లేనా? నిజానికిది నా కర్తవ్యం కూడా" అన్నది లక్ష్మి అతి తేలిగ్గా. రశ్మి కృతజ్ఞతా భారాన్ని దింపుకున్నట్లు.

ఒకరోజు రశ్మి, తుషారులు పసిబిడ్డను తీసుకుని డాక్టరు దగ్గరకు వెళ్ళారు. లోకల్ ట్రెయిన్ ప్రమాదంలో చిక్కుకోవటంతో అర్ధరాత్రికిగాని యింటికి చేరుకోలేక పోయారు. ఆత్రుతతో వచ్చిన వాళ్ళను తలుపుకువ్రేలాడుతున్న తాళం వెక్కిరించింది. తమ దగ్గరున్న మరో తాళం చెవితో తలుపులు తెరవగల్గారేగాని, బుజ్జిగాడు ఏమైనట్లు అనుకుని కంగారుపడ్డారు. చుట్టుపక్కలంతా వెతికి చూశారే గాని పిల్లాడి ఆచూకీ తెలియలేదు. లక్ష్మి మీద ఆక్రోశం అంతకంతకూ పెరిగిపోతోంది వారిద్దరికీను.

"తను వెడితే వెళ్ళింది. బుజ్జిని ఎందుకు



తీసుకెళ్ళింది? ఒకరోజు శెలవు తీసుకుని ఉండచ్చుగా. తనూ యిక్కడే ఉండిపోయి ఉండచ్చుగా" అనుకున్నారు.

పిల్లాడిని గురించిన భయమూ, బెంగా వాళ్ళను కృంగదీస్తున్నాయి. లక్ష్మి ఇల్లు ఎలా ఉంటుందో, బుజ్జి అక్కడ ప్రశాంతంగా నిద్రపోగలడో లేదో? అని బెంగపడ్డారు. వాళ్ళు మాత్రం రాత్రంతా నిద్రపోకుండా గడిపేశారు. రోజూ తను వచ్చే టైముకు లక్ష్మి రాకపోయేసరికి వాళ్ళకు ఏంచేయాలో పాలుపోలేదు. పనిమనిషి తమ బిడ్డను ఎత్తుకుపోయిందంటూ రోదించటం మొదలెట్టింది రశ్మి. చుట్టుపక్కల వాళ్ళు తలోమాటా అనటంతో వాళ్ళ ఆందోళన ఎక్కువైంది.



ఇప్పుడు తుషారుకి కూడ అనిపించసాగింది. లక్ష్మి నిజంగానే బుజ్జిగాణ్ణి ఎత్తుకుపోయింది అని. పిల్లాడిని అమ్ముకోవచ్చు లేక పెద్దమొత్తం యివ్వమని తమని బెదిరించవచ్చు అనుకుంటూ లోలోన భయపడసాగాడు. లక్ష్మి మీద అనుమానపడటానికి కారణం ఆమె రాకపోవటమే అంటూ తనని తాను సమర్థించుకున్నాడు. చుట్టుపక్కలవాళ్ళు యిచ్చిన సలహా మేరకు తన బిడ్డను వెతికివ్వమని బతిమాలుకున్నాడు గూడ.

అతను అర్జీ పెట్టుకుని వచ్చేటప్పుడు లక్ష్మిని గురించిన వివరాలు తెలుసుకోవాలంటూ పోలీసులు కూడ అతని వెంట వచ్చారు. రశ్మి మీద ప్రశ్నల వర్షం కురిపించేశారు. వాళ్ళలా అడగ్గా ఆమెకు లక్ష్మి మీద కోపం ఎక్కువ అవటం మొదలుపెట్టింది.

చివరికి తప్పంతా తుషారు, రశ్మిల మీదే తోసేశారా పోలీసులు. కొత్తగా పనిమనిషిని పెట్టుకునేప్పుడు, ఆ మనిషిని గురించిన వివరాలు తెలుసుకోవద్దా అని కేకలేశారు కూడ. పనిలో పెట్టుకున్న తరువాత ఆమె ఫొటో తీసుకుని పెట్టుకోవాల్సిందని చీవాట్లేసి తమ ఆధిక్యాన్ని నిరూపించుకున్నారు వాళ్ళు.

ఆ దంపతులకూ తమ తప్పు తెలిసిరావటంతో, ఆ ముంబై మహానగరంలో లక్ష్మిని ఎలా వెతకాలా అన్న ఆందోళనతోపాటు, ఆ వెతకటమనేది సముద్ర

తీరపు ఇసుకలో పడ్డ సూదిని వెతకటం లాంటిదని నిస్పృహ చెందారు.

ఈ తర్జన భర్జనలిలా ఉండగా లక్ష్మి హఠాత్తుగా ప్రత్యక్షమైంది. అంతా అవాక్కయ్యారు.

"మా బుజ్జి ఎక్కడున్నాడు? " అంటూ తుషారు రశ్మిలు ఏకకంఠంతో అడిగారు ఆత్రంగా. కత్తివేటుకు రక్తపు చుక్క లేదు లక్ష్మి ముఖంలో. రాత్రంతా నిద్రపోలేదన్నట్టుగా వుందామె. ఇంటి ముందున్న జనాన్ని పోలీసులనూ చూసి భయపడి పోయింది.

"చెప్పవేం. బాబునేం చేశావ్? వాడినెక్కడ వదిలేసి వచ్చావ్? " పోలీసు ధోరణిలో బెదిరించి అడగసాగారు.

"ఆస్పత్రిలో" అని ఏడవసాగింది లక్ష్మి

"ఆస్పత్రిలోనా" అంటూ తుషారు ఆశ్చర్యపోయాడు.

"అవునయ్యా, బాబు ఆస్పత్రిలో ఉన్నాడయ్యా? నిన్న మీరటు వెళ్లగానే బాబు మెట్లమీంచి పడ్డాడు. వెంటనే నేను ఆస్పత్రిలో చేర్చాను. ఇప్పుడు పూర్తిగా బాగున్నాడు. వాడికిప్పుడే పాలూ, బిస్కెట్లూ ఇచ్చి వస్తున్నాను. మీకీ విషయం చెప్దామని వచ్చాను. తీరా చూస్తే ఇక్కడ మీరు పోలీసులను తీసుకొచ్చివున్నారు. మీకు నామీద అనుమానం వచ్చిందిలా ఉంది. నన్ను దొంగ అనుకున్నారు కదా" అని కంట నీరు తెచ్చుకుంటూ మేం కష్టపడి పొట్ట పోషించుకోవడానికే చూస్తాంగాని దేనికీ ఆశపడం. నేను ఎవరికీ భారంగా వుండే దాన్నికాను. మీతో ఆత్మీయతను పెంచుకున్నాను. మీతోటే నా శేషజీవితాన్ని గడిపేద్దామనుకున్నాను. బుజ్జి అంటే నాకెంత ఇష్టమో మీకు తెలియదా? అయినా కూడా మీరు నన్ను అనుమానించారు" అంటూ ఏడుస్తూనే వివరించింది లక్ష్మి.

" అమ్మా.. లక్ష్మీ మమ్మల్ని క్షమించండి. నిజంగానే మేం మిమ్మల్ని అపార్థం చేసుకున్నాం" అంటూ మనస్ఫూర్తిగా క్షమాపణ వేడుకున్నారా దంపతులు. ఆమె ముందు తామెంత అల్పులం అనుకుని సిగ్గుపడ్డారు కూడా.

"నేనిక ఇక్కడుండనయ్యా. కావాలంటే మీకింకొక మనిషిని వెతికిపెడతాను. కానీ వెళ్ళేముందు మీ బాబును మీకు అప్పజెపుతాను రండయ్యా. ఆస్పత్రికి పోదాం రండి" అన్నదామె.

పోలీసులు, కొంతమంది చుట్టుపక్కల వాళ్ళు రాగా అంతా కలిసి ఆస్పత్రికి చేరుకున్నారు. అక్కడ బుజ్జిని చూడగానే రశ్మికి తుషారుకు పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్లైంది. బుజ్జి నుదుటికి పట్టీ వేసి ఉంది. కాళ్ళకు కట్లు ఉన్నాయి. లక్ష్మి తన చెవిదుద్దులమ్మి బిల్లు చెల్లించిందని అక్కడి డాక్టరే చెప్పగా తెలిసింది వారికి.

"బాబుకిప్పుడేం భయం లేదు. నేనిక వెళ్ళి వస్తాను" అంటూ బయల్దేరింది లక్ష్మి.

తుషారు దంపతులు చేతులు జోడించి, "క్షమించండమ్మా. మమ్మల్ని వదిలి వెళ్ళొద్దమ్మా" అంటూ బ్రతిమిలాడారు. అంత మంచి మనిషిని పోగొట్టుకోదలచ లేదు వాళ్ళు. అందుకనే బ్రతిమాలి, బామాలి

ఆమెను ఉండేట్లు చేశారు.

"మీరింత బలవంతం చేస్తున్నారు కాబట్టి అలాగే ఉంటానులెండి" అన్నది ఎట్టకేలకు.

"నా ఇల్లుచూస్తారాయ్యా" అన్నదో రోజు. రశ్మీ తుషారులు కూడా ఉషారుగా బయల్దేరారు.

తీరా చూస్తే ఆమె వాళ్ళను తీసుకు వెళ్ళింది ఓ సామాన్యమైన వృద్ధాశ్రమా నికి. దాని వరండాలోనే ఆమె పడక. ఆశ్రమ వాసులంతా కలిసి తుషారు దంప తులకు చెప్పిన విషయాలేమంటే.

లక్ష్మి తన జీవితంలో సంపాదించిం దంతా కూడా ఆ ఆశ్రమానికే వెచ్చించిం దిట. రాత్రులు నిద్రపోకుండా మంచాన పడిన వృద్ధులకు సేవచేస్తూ గడిపేస్తుం టుందిట. రశ్మి తుషారులకు లక్ష్మి మీది గౌరవ ప్రపత్తులు ఇనుమడించాయి. లక్ష్మి జీవితపుటలు ఒక్కొక్కటి తెరిచిన కొద్దీ ఆమె వాళ్లకు ఉన్నతంగా కనపించింది.

విధవరాలైన లక్ష్మి తన కొడుకును పెంచటానికి పడరాని పాట్లన్నీ పడ్డది. కానీ ఆమెకు దొరికిన కోడలు మాత్రం తన ప్రవర్తనతో లక్ష్మి ఆశలకూ, ఆశయాలకూ విఘాతం కలిగించింది.

తట్టుకోలేని లక్ష్మి తన కొడుకూ, కోడ ళ్లను వదిలి వచ్చి వృద్ధాశ్రమంలో ఉంటోంది. ఈ వివరాలను తెలుసుకున్న రశ్మీ, తుషారులతో "జీవితమంటే పోరా టమే కదా మరి" అన్నది చిరునవ్వుతో.

కొడుకూ కోడళ్ళను గాని, చివరికి తననిలా తరిమికొట్టిన విధిని గాని నిందిం చని ఆమె ఊన్నతిని చూసి వాళ్ళు అబ్బు రపడ్డారు.

నిజంగానే ఈమె 'లక్ష్మి' అనుకున్నారు ఆమెకు మనసారా నమస్కరించి.

## ముషాయిరా

# జారిపడిన బిందువు

మొదటి చూపున నిలచిన మోహమూర్తి
తలపు తనలోని గొనబుగా
నిలుపుకొనును
ఆ ప్రణయపారవశ్యమ్మునందె జంట
క్రమ్ముకొనిపోవు లోలోన కలసిపోయి

తరుణ రాగార్ద్ర వలిత చైతన్యధార
పరమ వాత్సల్యనిధికైన పరిమళమ్ము
రమ్య సౌందర్య లహరీ తరంగశయ్య
ఊసులు కలబోసుకున్నది యుక్తవిధిని

ఏ అనంతకాలమునాటిదీ ప్రణయము
నిండి జీవితాంతర్వాహినీ తటములు
పొంగి పొర్లునదేదియో పుటలు విప్పి
దివ్యరాగ స్రవంతిలో తేలిపోవు

ప్రేమకై జీవితమ్ము కల్పించుకొనిన
నాడు ప్రాయంపు తలపులన్నిటిని పేర్చి



పులకిత హృదంతరముల
నుప్పొంగుచున్న
పండువెన్నెల లలుము బ్రహ్మాండమెల్ల

– సాంధ్యశ్రీ

# ప్రపంచానికి కనిపించు



ప్రపంచాన్ని రెప్పలు వాల్చకుండా చూస్తూ
ఎంతకాలం వేదాంతచింతనలో కరుగుతావు
ప్రపంచానికి నువ్వు కొంచెం కనిపించు

నీ మనసులోనిది మెత్తగా వినిపించు
నువ్వెంత వినూత్నంగా కనిపిస్తావో
నువ్వెంత విలక్షణంగా కనిపిస్తావో
నువ్వెంత విశాలంగా కనిపిస్తావో
నువ్వెంత విశిష్టంగా కనిపిస్తావో
ప్రపంచానికి నువ్వుకూడా
కొంచెం కనిపించు
నువ్వుకూడా పనికివస్తావని
ఒక్కసారి నిరూపించు
నీ హృదయఘోష
సుతిమెత్తగా వినిపించు
అద్దంలాంటి నీలో
ప్రపంచమే తన ఆహార్యాన్ని
సరిదిద్దుకోదా?
తన బాధ్యతలన్నీ
నీ ఆదర్శాల్లో ముంచి
ఆరేసుకోదా?

– జి.నరసింహమూర్తి



# పరామర్శ

## 'కళాకారుడెవ్వరు' సుపర్బ్

'విపుల' పత్రికారంగంలో ఒక ప్రయోగం. ప్రపంచ, దేశ భాషల కథలతో ఇలా ప్రత్యేక పత్రిక మరెక్కడా లేదు. ప్రపంచ వ్యాప్తంగా వెలువడుతున్న కథలతో మన తెలుగు కథలను తులనాత్మకంగా పరిశీలించుకోవడానికి ఇదొక కరదీపికలాంటిది.

అక్టోబరు నెల సంచికలో ప్రధానంగా 'కళాకారుడెవ్వరు?' ఉర్దూకథ చాలా బాగుంది. ఒక వ్యక్తి జీవితంలో అనుకోకుండా కీడు, దుర్ఘటన సంభవిస్తే దానికి విస్తృత ప్రచారం జరుగుతుంది. దానికి సంబంధించి ఒకరు బొమ్మ వేస్తే మరొకరు కథ రాస్తారు. ఇంకొకరు సినిమా తీస్తారు. అంతేకానీ దెబ్బతిన్న వ్యక్తి మేలు గురించి ఆలోచించరు. అలా ఆలోచించిన వ్యక్తి కథ ఇది. అలాంటి వ్యక్తే నిజమైన కళాకారుడు.



కాలానుగుణంగా ఎదగకపోతే మనిషి జీవితం పనికిరాకుండా పోతుంది. అలాంటి వ్యక్తి బ్లాక్ అండ్ వైట్ సినిమా కాలంలోను మోసపోయాడు. కంప్యూటర్లు, కలర్ టీవీల యుగంలోనూ మోసపోతున్నాడు. కాలానుగుణంగా మారకపోతే ఎవరి బతుకైనా ఇంతే అని 'రెండో ఆట సినిమా' తెలుగుకథ చెబుతోంది.

'భార్య' హిందీ కథలో యువకుడు మరో ముగ్గురితో కలిసి దేశం గురించి ఆలోచిస్తాడే కానీ తన సామ్రాజ్యం అంటే ఇల్లు, తన పట్టమహిషి అంటే భార్య ఏ పరిస్థితిలో ఉన్నదీ ఆలోచించడు. పైగా అందరి ముందు దాసీగా చూస్తాడు. ఇలాంటి వ్యక్తులవల్ల సంఘానికే ప్రయోజనం కలగదు. పైపెచ్చు నష్టమే.

'విధ్వంసక దృశ్యం' పంజాబీ కథ యువత తప్పక చదవాలి. తను పుట్టి పెరిగిన గ్రామానికి పదిహేనేళ్ల తరువాత వస్తాడు. చాలా ఆధునికంగా కనిపిస్తుంది. బాల్యమిత్రులను చూస్తే వ్యసనాలకు బానిసలై కనిపిస్తారు. నిజానికి అభివృద్ధి కాదది, గ్రామం గ్రామం మొత్తం విధ్వంసమైపోయింది. ఎంత ఆధునికంగా మారినా నైతికవిలువలు లేకపోతే నిష్ప్రయోజనమని చెప్పే కథ ఇది.

రిక్షాలే లేని ఈరోజుల్లో 'ఎర్రకోక' లాంటి కథ రావడం ఆశ్చర్యంగా ఉంది. పాతకథే పునర్ముద్రణ అనిపిస్తోంది.

మాతృభూమిని మించింది లేదు. గెలుపోటములను క్రీడాస్ఫూర్తితో తీసుకోవాలి. మన మీద మనకు విశ్వాసముండాలని 'వైకుంఠపాళి' ఒరియా కథ చెబుతోంది.

యుద్ధసమయంలో అనుభవాలు ప్రపంచానికి తెలియాలంటే 'పన్నెండో మనిషి' (పోలిష్)లాంటి కథలు అవసరమే. కాన్వెంట్ చదువులు వచ్చి మన రాష్ట్రంలోనే తెలుగు మూడోభాష అయిపోయిన తరుణంలో మనల్ని వెన్నుతట్టి మేలుకొలపడానికి 'ఎవరిది తప్పు?' (తెలుగు) వంటి కథలు చాలా అవసరం.

'బంధుత్వాలు' తమిళ కథ చిత్రమైంది. ఒక కుటుంబంలో పురుషుని, ఇంకో కుటుంబంలో స్త్రీని తమ తమ కుటుంబాల సభ్యులు స్వార్థానికి వాడుకుంటారు. వాళ్ల బాగోగులు పట్టించుకోరు. ఇద్దరూ కొవ్వొత్తుల్లా కరిగిపోతూంటారు. ఈ నేపథ్యంలో ఆ రెండిళ్లల్లోని పనిమనిషి వాళ్లిద్దరినీ కలుపుతుంది. 'అనామకం' బెంగాలీ కథలో కథనం, మానసిక ఘర్షణ చదివించేలా బాగున్నాయి.

ఇతరభాషల కథలతో పోల్చిచూస్తే తెలుగు కథలు మరింత సమకాలీనతను సంతరించుకోవడం అవసరం అన్పిస్తోంది.

**– వి.సాంబశివరావు,** సినీదర్శకులు

# పుస్తక సమీక్ష

## కథానికా వైభవం



ఈ పుస్తకంలో రెండు భాగాలున్నాయి. గురజాడ, శ్రీశ్రీ, కొనకళ్ళ, కొడవటి గంటి, గోపీచంద్, పాల గుమ్మి- వీరికి స్మృత్యంజలి మొదటి భాగం. తొంభైనాలుగుమంది సమకాలీన కథకుల పరిచయం రెండోభాగం. ఈ నూరు లఘువ్యాసాలు తెలుగు కథానికా వైభవానికి అద్దం పడుతున్నాయి. కథకుల జీవిత విశేషాల కంటే రచనలోని ప్రత్యేకతలకు ప్రాధాన్యమివ్వడం విశేషం. కథాభిమానులు విశ్లేషణాత్మకంగా కథ లు చదివేందుకు ఈ గ్రంథం ఎంతో ఉపక రిస్తుంది. డెబ్భై మందితో రెండో సంపుటి వ స్తుందన్నారు కాబట్టి, మరికొందరికి అందులో చోటుంటుందని ఆశించవచ్చు.

**(కథాకృతి– విహారి,** వెల: రూ. 100/- ప్రతులకు: నవోదయ, విశాలాంధ్ర పుస్తక విక్రయ కేంద్రాలు)

## అనువాదకుల అనుభూతులు



నేటి తెలుగుకవుల్లో సినారె తర్వాత డా. ఎన్. గోపి కృతులే ఎక్కువగా ఇతర భాషల్లోకి అనువాదితమ య్యాయి. ఆయన 'నానీలు', 'జలగీతం', 'కాలాన్ని నిద్రపోనివ్వను' అనువాదాలు హిందీ, ఇంగ్లిషు, కన్నడం, మళయాళం, సంస్కృతం, తమిళం, ఉర్దూ మొదలైన భాషల్లో వెలువ డ్డాయి. ఆయన రచనలను ఇరవై ఆరుగురు అనువాదకులు అనువదించారు. ఈ అనువాద కుల అభిప్రాయాలను, అనుభవాలను వ్యాసాల రూపంలో ఈ గ్రంథంలో సంకలనం చేశారు. తెలుగు (7), ఇంగ్లిషు (8), హిందీ (7), ఉర్దూ (3) భాషల్లో వున్న వ్యాసాలు అనువాదరంగం పట్ల ఆసక్తివున్న వారికి ఎన్నో సూచనలు, మెల కువలు అందిస్తున్నాయి. ఒక విధంగా ఇది చక్కటి ప్రయోగమని చెప్పాలి.

**(గోపి కవిత్వం – అనువాదకుల అనుస్పం దనలు –**సంపాదకులు **ఎస్వీ. సత్యనారాయణ** వెల: రూ. 200/- ప్రతులకు: విశాలాంధ్ర పుస్తక విక్రయ కేంద్రాలు)

*–గోవిందరాజు*

## చేతిని వదలని నిప్పు బొమ్మ



'నిప్పుబొమ్మ' ముప్పైయేడు కవితల సంపుటి. రచయిత మాధవీ సనారా. ఈయన పత్రికల ద్వారా పాఠక పరిచి తులే. రామాయణంలోని సీతమ్మ- ఈ కవి దృష్టిలో నిప్పుబొమ్మ. నిప్పుకున్న మంచి లక్షణా లన్నిటినీ పుణికిపుచ్చుకున్న నేటి సంఘంలోని రకరకాల బొమ్మలే ఇందులోని కవితలన్నీ. 'చెట్టు' ఈయనకో దేవాలయంలా కనిపించింది. రిటైరుకాని ఉద్యోగస్తునిగా ఆకాశంలో చంద్రుడూ, వేదిక ఎక్కుతున్న ప్రసిద్ధ కవిగా ఉదయ సూర్యుడూ ఈయనకు విలక్షణంగా కనిపించడం విశేషం. ఒకచోట 'ఒక ఫలంలో వచ్చిన తక్షకుడి కాటుతో చచ్చిన జనమేజయునిలాంటివాడు బుష్' అంటారు 'పరీక్షితులాంటి వాడు' అనాలి గదా! నేటి జీవితమంటేనే పానిపట్టు పోరాటం గా అక్షరాలా నిరూపించిన ఈ 'నిప్పుబొమ్మ'ను పట్టుకున్న ప్రతి పాఠకపాణి, మరి దీన్ని వదిలి పెట్టలేదు. ఇది అతిశయోక్తి కాదు. నిజం.

**(నిప్పుబొమ్మ – మాధవీ సనారా,** వెల: రూ. 40/- ప్రతులకు: రచయిత, కామాక్షీదేవి దేవా లయం వీధి, 14-18-1, నిదానం దొడ్డి, అనకా పల్లి-531002)

*–డా. రామడుగు వెంకటేశ్వరశర్మ*




**రాజమకుటాలు**
–గిడుగు రాజేశ్వరరావు
వెల: రూ. 30/-
ప్రతులకు: విశాలాంధ్ర పుస్తక విక్రయశాలలు

**హృదయజలధి**
–రఘువర్మ
వెల: రూ. 35/-
ప్రతులకు: నవోదయ బుక్ హౌస్, కాచీగూడ క్రాస్‌రోడ్స్, హైదరాబాద్-27

**మా మట్టికోసం**
–వడ్డెబోయిన శ్రీనివాస్, అబ్దుల్ బాసిత్, వంగాల సంపత్‌రెడ్డి
వెల: రూ. 5/-
ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక విక్రయశాలలు

